# గుంటూరు జిల్లా అదృశ్య గ్రామాలు




మణిమేల శివశంకర్

ఓం శ్రీ విఘ్నరాజాయ నమః



# గుంటూరు జిల్లా
# అదృశ్య గ్రామాలు

రచన

మణిమేల శివశంకర్

తొలి ప్రచురణ : 2022

ప్రతులు : 200

వెల : రూ. 250/-



కవర్‌పేజి డిజైన్ : పావులూరి సతీష్‌బాబు, మాచర్ల.

డి.టి.పి. : తిమ్మన శ్యామ్‌సుందర్, పావులూరి సతీష్‌బాబు

ప్రతులకు:

మణిమేల శివశంకర్

S/O వెంకటరాజు

25-19-20, తిరుపతమ్మ గుడి వద్ద

భవానికాలనీ, సంపత్ నగర్, గుంటూరు-522004.

సెల్: 80196 32030

ముద్రణ :

శ్రీ లక్ష్మీ ప్రెస్

14వలైను అరండల్‌పేట

గుంటూరు - 522002

ఫోన్ : 0863-2230643

## డా. ఈమని శివనాగిరెడ్డి, స్థపతి

సి. ఈ. ఓ.

ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ అమరావతి,

4వ అంతస్తు, మధుమాలక్ష్మీ ఛాంబర్స్,

మొగల్రాజపురం, విజయవాడ-10

మొబైల్: 9848598446.



# మరుగున పడిన గ్రామాలపై వెలుగురేఖలు

చాలామంది చరిత్రకారులు ఒక ప్రాంతచరిత్రను, ఒక రాజవంశచరిత్రను, ఒక ఆలయచరిత్రను, ఒక కోటచరిత్రను, ఒక జాతిచరిత్రను ఎంచుకొని రాయటానికి పూనుకుంటారు. రాస్తారు; పేరు గడిస్తారు. అలాంటివారిలో కొమర్రాజు, మల్లంపల్లి, నేలటూరి, బిఎస్ఎల్, యశోదాదేవి లాంటి వారు ముఖ్యులు. కొందరు చరిత్ర రాయటానికి ఇదొక పద్ధతి. పైగా వీరంతా చదువుకొన్నవారు. శాసన సాహిత్యాల ఆధారంగా తమ రచనల్ని వెలువరించారు. పేరు గడించారు.

కేవలం ఎలిమెంటరీ స్కూల్ చదువుకే పరిమితమై అపరిమిత వినికిడి జ్ఞానం, నిరంతరం చదివే సద్గుణం, చీకటిలో మగ్గుతున్న, పాడుబడి, అదృశ్యమై, బేచిరాకు గ్రామాలను ఎంచుకొని, ఉనికిలో, మనుగడలో లేని గ్రామాలను కాలినడకన తిరిగి, చారిత్రక సమాచార పరిగె ఏరుకొని, అందుబాటులో ఉన్న లోకల్ రికార్డుల్ని తిరిగేసి, కల్నల్ కొలిన్ మెకంజీ రాతల్ని తడిమిచూచి, నేడోరేపో అంటున్న పక్కగ్రామాల పెద్దల్ని పరామర్శించి, నిశ్శబ్దంగా, చారిత్రక శబ్దపేటికను మార్చి, ఎవరూ చేయని పనికి పూనుకొన్నారు,

ఎక్కడా దొరకని చారిత్రకాంశాలను ఒక్క ఫోను కాల్‌తో అందించే చరిత్ర ఖజానా మణిమేల శివశంకర్‌గారు. వృత్తి మీద మమకారంతో, చారిత్రకవిషయ సేకరణ మీద గౌరవంతో ఆయన ఒక నడిచే చరిత్ర గ్రంథాలయం.

ఎక్కువ చదువుకోకపోయినా, గ్రామాలు అదృశ్యం కావటానికి పేర్కొన్న కారణాలు, తెలుసుకొనే మార్గాలు, తాలూకావారీ అదృశ్యగ్రామాల చరిత్ర, ఆ గ్రామాలకు ఆ పేర్లు ఎలా వచ్చాయో వివరాలు, ఒకటేమిటి! నన్నడిగితే ఇదే నిజమైన చరిత్ర అంటాను. ఇదే విషయమై మిగతా జిల్లాల్లో కూడా ఇలాంటి పుస్తకాలు రావటానికి శివశంకర్ ప్రేరణ కావాలని, ఈ రచన ఆదరణ చూరగొనాలని నా ప్రగాఢ ఆకాంక్ష.

ఎవరూ పూనుకోని ఒక గొప్పపనికి శ్రీకారం చుట్టి ఏకంగా దాదాపు 500 అదృశ్యగ్రామాల పుట్టుపూర్వోత్తరాల చరిత్ర, సంస్కృతి మొదలైన విషయాలను సేకరించి, ఒక దండగా గుచ్చి, తెలుగువారిచరిత్రలో వెలితిని పూరించారు. భవిష్యత్ తరాలకు ఒక వరాలమూట అందించారు. విశ్వవిద్యాలయాల్లోని చరిత్ర అధ్యాపకులు, ఆచార్యుల కంటే ఏ మాత్రం తీసిపోని, వాసిగల, వన్నెగల అదృశ్యగ్రామాల చరిత్రనందించారు. చరిత్రకారుల సరసన నిలిచారు. ఇంతటి మహత్తర, బృహత్తర కార్యక్రమాన్ని విజయవంతంగా పూర్తి చేసినందుకు చరిత్రకారుడు మణిమేల శివశంకర్‌గారిని నేను మనసారా అభినందిస్తున్నాను. ఎవరికీ పట్టని ఇలాంటి మరికొన్ని రచనల్ని చేపట్టాలని కోరుకుంటూ నాకు అభిప్రాయం రాసిచ్చే అవకాశమిచ్చినందుకు నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

ఈమని శివనాగిరెడ్డి, స్థపతి.

వలివేరు, తెనాలి తాలూకా,
13.8.2021.





## డా. బెల్లంకొండ రమేష్‌చంద్రబాబు

ఎం.ఏ., (హిస్టరీ) పిహెచ్.డి.

రిటైర్డ్ ప్రిన్సిపాల్, గవర్న్‌మెంట్ డిగ్రీ కాలేజి,

రేపల్లె, గుంటూరుజిల్లా.

మొబైల్: 9441519781


# అదృశ్యగ్రామ విశేషము

గుంటూరుసీమలో కనుమరుగైన గ్రామాలను శోధించి, సాధించి పట్టుకొన్న మణిమేల శివశంకర్ పడిన నిర్విరామశ్రమకు ఫలితమే ఈ 'అదృశ్యగ్రామాలు' గ్రంథం.

శాసనపాఠాలను ఆమూలాగ్రం పఠించి ఆయా గ్రామాలు అదృశ్యం కావడం వెనుక వున్న కారణాలను తర్కించి వివరించడంలో రచయిత కృషి పట్టుదల కన్పిస్తుంది. అందుకే ఈ పరిశోధకగ్రంథం భవిష్యత్‌తరాలవారికి ఎంతగానో ఉపకరిస్తుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

ఈ పుస్తకంలో అనేక మెరుపులు మెరిసాయి. వాటిలో కొన్నింటిని చూడాలనిపించింది. అదృశ్యమైన పింగళి గ్రామం గురించి రచయిత ఇచ్చిన వివరణ నాకెంతగానో నచ్చింది. 'పింగళి' వంశంలో జన్మించిన జాతీయపతాక రూపశిల్పి వెంకయ్యగారి పూర్వీకుల గ్రామం కావడం ఒక విశేషమైతే, ' పింగళి' అనగానే ఆధునిక సినీకవి పింగళి నాగేంద్రరావుగారి విజయావారి మనసును తాకే పాటలు గుర్తుకొస్తున్నాయి. మధ్యయుగంలో అష్టదిగ్గజాలలో ప్రముఖుడు "కళాపూర్ణోదయం" సృష్టికర్త పింగళి సూరనకవి మరియు కాకునూరి అప్పకవీంద్రుల యొక్క పుట్టుపూర్వోత్తరాలను తిరగతోడటం వెనుక సాహిత్యంపై శివశంకరునకు ఉన్న ఆసక్తి వ్యక్తమవుతుంది.

ఇక్ష్వాకు వంశానికి చెందిన చాంతమూలుని రెంటాల బ్రాహ్మీశాసనంలో 'నిడిగల్లు' గ్రామం ప్రస్తావించబడింది. దీనిపై ఇటీవల శాసన పరిశోధకులతో చర్చ నడుస్తున్నది. అయితే ఇక్కడ అంతర్ధానమయిన 'నెయ్యూరు' గ్రామం గురించి రచయిత గంగయసాహిణి దుర్గి శాసనాన్ని పేర్కొంటూ, నెయ్యూరు సరిహద్దుల్లో 'నింగలుగుట్ట' ఉందని ప్రస్తావించారు. క్రీ.శ. 3వ శతాబ్దం నాటి ఇక్ష్వాకు రాజధాని 'నిడిగల్లు' విజయపురి (నాగార్జునునికోట)లో ఉన్నదనటానికి ఆధారం లభించినట్లయింది.

దుర్గి మండలంలోని అదృశ్యగ్రామం 'దద్దనాలపాడు' కలదు. పూర్వం రాజస్త్రీల సతీసహగమనం జరిగిన ప్రదేశాన్ని దద్దనాల అనేవారట. ఈ విషయం ఆంధ్రుల సాంఘికచరిత్రకు దోహదపడుతుంది.

అలపాడు గ్రామం సమీపంలో ఉత్తర పల్లపట్ల గ్రామం ఉండేదని చెబుతూ నిజాంపట్నం మండలంలో పల్లపట్ల గ్రామ ప్రస్తావన రచయిత తీసుకొచ్చారు. ఈ పల్లపట్ల గ్రామం ఒకనాడు యేలేరు (యేలేటిపాలెం పక్కన, నగరం మండలం) ఒడ్డున ఉండేది. క్రీ.శ. 8వ శతాబ్దం నాటి చాళుక్య విష్ణువర్ధనుని అహదనకర తామ్రశాసనంలో ప్రస్తావించబడిన పల్లవపట్టణాన్ని ప్రస్తుత పల్లపట్ల గ్రామంగా భావరాజు వేంకటకృష్ణారావుగారు గుర్తించారు.

ఆంధ్రదేశంలో 'చరిత్ర', 'పురాతత్వశాస్త్రం' పై పరిశోధనలు అడుగంటిపోవడం మనమెరిగినదే. సంస్కృతి-వారసత్వం అంటూ కబుర్లు చెప్పే చాలామందిలో చారిత్రకస్పృహ కొరవడుతున్న కాలంలో శాసనాలు, సాహిత్యం పట్ల ఆసక్తి కలిగి ఎవరూ చేయ సాహసించని కనుమరుగైన గ్రామాలను కనుగొని ఒక మంచి పరిశోధనగ్రంథాన్ని మనకు అందజేసిన మణిమేల శివశంకర్‌కి అభినందనలు అందజేస్తూ..

రమేష్‌చంద్ర (signature)

రేపల్లె,
14.8.2021

బెల్లంకొండ రమేష్‌చంద్రబాబు

## సూర్యదేవర రవికుమార్

విశ్రాంత పశువైద్యులు

ప్రాచీన కావ్య పరిష్కర్త

ఎస్.4, పరమేశ్వరి టవర్స్, 4వ లైన్, లక్ష్మీపురం

గుంటూరు -522 007

మొబైల్: 7013073712



# అభినందన

“తరముల్ నాల్గయిదెందు నెందునగు తత్తద్గ్రామనామంతబులన్ వరలున్ వంశము” అని 16వ శతాబ్దపు పింగళి సూరనకవి చెప్పినట్లు తెలుగువారిలో అత్యధిక సంఖ్యాకులకు, కులవర్గమతాతీతంగా, వారి వారి నివాసగ్రామనామాలే నిన్నమొన్నటి వరకు ఇంటిపేర్లుగా నిలిచాయి. వలసల వలన గ్రామాలు మారినపుడు అవికూడా మారుతుండేవి. ఇప్పుడు అందరి ఇంటిపేర్లు స్థిరపడిపోయాయి. అయితే ఇంటిపేరును సూచిస్తున్న గ్రామాలు కొన్ని ఎక్కడ ఉన్నాయో విశ్వవిద్యాలయాల్లో ఇంటిపేర్లపై పరిశోధన చేసిన పరిశోధకులు గుర్తించే ప్రయత్నం చేయలేదు. శాసనాలలో చెప్పబడి ఇంటిపేర్లుగా వాడుకలో ఉన్న చాలా గ్రామాలు ఈనాడు తెలుగునేలపై కన్పించవు. అవి కాలగమనంలో కనుమరుగై పోయాయి. గుంటూరుజిల్లాలో ఇటువంటి గ్రామాలను గుర్తించే దృఢసంకల్పంతో విశేష కృషిచేసిన పరిశోధకుడు కాని పరిశోధకుడు మణిమేల శివశంకర్.

అల్పవిద్యావంతుడైన శివశంకర్ ఈ విషయమై చేసిన కృషి అనన్యమైంది, విశిష్టమైనది. డిగ్రీలతో కొలవలేనిది. దేశీయ సంప్రదాయాలపైన, గ్రామీణజీవనంపైన అంతగా ఆసక్తిచూపని విద్యావంతులైనవారు వారివారి గ్రామాలను వీడి పట్టణాలలో, పరాయి రాష్ట్రలలో, దేశాలలో స్థిరపడటానికి

ఇష్టపడుతున్న ఈ రోజుల్లో శివశంకర్ ఇటువంటి నిగూఢ విషయంపై దృష్టిపెట్టి ఇంతగా విషయసేకరణ చేయటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అద్భుతం అనిపిస్తుంది. ప్రజలు సామూహికంగా తమ నివాసగ్రామాన్ని విడిచి వలస వెళ్ళవలసిన పరిస్థితులను శివశంకర్ చక్కగా విశదీకరించాడు. ప్రాచీనకాలంలో ఈ వలసలు ఎలా సాగేవో 14వ శతాబ్దానికి చెందిన ఎఱ్ఱాప్రగడ రచించిన హరివంశములో చక్కగా వర్ణించబడింది. ఈ వలసల వలన, ఇతర వైపరీత్యాల వలన కాలక్రమంలో అదృశ్యమైన గ్రామాలను ఈనాడు ఎలా గుర్తించాలో శివశంకర్ వివరించారు. ఒక్క గుంటూరుజిల్లాలోనే ఇన్ని వందల గ్రామాలను శివశంకర్ గుర్తించాడంటే అతడి పట్టుదల, శ్రమ ఏపాటివో అర్థమౌతుంది. అభినందనలకు పాత్రమౌతుంది. తెలుగురాష్ట్రలలోని చరిత్రకారులు, చరిత్రాభిమానులు శివశంకర్‌కు తగిన ప్రోత్సాహమిచ్చి అతడి సేవలను సద్వినియోగమొనరించుకొందురుగాక!

అమోఘమైన ఇతడి కృషి ఇతోధికంగా ప్రవర్ధిల్లునుగాక!

సూర్యదేవర రవికుమార్

గుంటూరు,
20.8.2021



## మోదుగుల రవికృష్ణ
సమన్వయకర్త
పుస్తకప్రచురణ విభాగం
వివా-వివిఐటి, నంబూరు.
సెల్: 94403 20580



# మనవి మాటలు

నిత్య నరసింహ నామోపాసనా నిష్ఠాగరిష్ఠులు కీ॥శే॥ అరిశెట్టి సాయిప్రసాద్‌గారి ద్వారా మణిమేల శివశంకర్‌కి, నాకూ పరిచయం ఏర్పడింది; వర్ధిల్లింది. పరిచయం ఏర్పడిన కొత్తల్లో 'సవాకోటి జంగాలలో యిదీ ఒకటి' అనుకొన్నాను. కొన్నాళ్లు గడిచాక తెలిసింది, అతని విశిష్టత.

శివశంకర్‌కి ఆంధ్రప్రదేశ్‌లో అనేకానేక గ్రామాల చరిత్రలు, స్థల పురాణాలు, క్షేత్ర మాహాత్మ్యాలు, అట్టుపుట్టానవాళ్లు హృత్కవిలె. అమ్మ పుట్టిల్లు గురించి అమ్మకే చెప్పగల ఘటికుడు.

అతని 'యిది' అర్థమయ్యాక, అతనంటే గౌరవం పెరగజొచ్చింది. చదువు చూద్దామా: వానాకాలం చదువు; సంపద చూద్దామా: ఎండకూ చలికి ఆగే చిన్న సదనం. ఉద్యోగమా: నవత ట్రాన్స్‌పోర్ట్‌లో ఆరుగాలమూ కష్టపడే ముఠాకూలీ.

అయినా అతనిలోని ఒకానొక తృష్ణ గ్రామచరిత్రల వైపు చూపు తిరిగేట్టు చేసింది. తనకున్న అల్పార్జనతోటే ఏదోవిధంగా తంటాలు పడి ఎన్నో పుస్తకాలు - గ్రామచరిత్రలకి సంబంధించినవి - కొనుక్కున్నాడు. సేకరించుకొన్నాడు. పనిలో పనిగా శాసనాల సంపుటాలూ పోగేశాడు. ఎందుకంటే శాసనాలలో గ్రామాలను దానం చేసిన శాసనాలు విరివిగా ఉంటాయి కదా, అందుకు.

గాలివాటం చదువు చదువుకొన్న శివశంకర్ పేరు – సహాయం చేసినందుకు కృతజ్ఞతగా – యిప్పటికి కనీసం పదిహేను పరిశోధనా గ్రంథాల లోకి, ఇతర గ్రంథాలలోకి ఎక్కిందంటే నామట్టుకు నాకు ఆశ్చర్యం యిసుమంతైనా లేదు. కారణం నేను ఎడిట్ చేసిన 'కొండవీడు కైఫియత్'కు అతని వలన సహాయం పొంది ఉన్నాను కనుక.

శివశంకర్‌తో పరిచయం వృద్ధి అయ్యాక; అతని తపన, సేకరణ గమనించాక; గ్రంథసేకరణకు, గ్రంథపరిరక్షణకుగాను యిచ్చే 'అయ్యంకి– వెలగా స్మారక పురస్కారం'ను లంకా సూర్యనారాయణగారి కుమ్మక్కుతో యిప్పించగలిగాను. ఈ మాట చెప్పడం నా పలుకుబడిని వెల్లడి చేసుకోవటానికి కాదు, అతని అర్హత యిలాంటిది అని చెప్పటం కోసం.

'గుంటూరు జిల్లా అదృశ్యగ్రామాలు' అనే గ్రంథం శివశంకర్ కృషికి, పట్టుదలకి సంకేతం. ఎన్నో ఏళ్ల గ్రంథపరిశీలన, స్థానికుల నుండి సేకరించిన సమాచారం, వీలైనంత క్షేత్రపర్యటన ద్వారా యీ గ్రంథాన్ని సమకూర్చారు శివశంకర్. ఇప్పుడు లేని గ్రామాల చిరునామాలను, యాదాస్తులను వలేసి పట్టి మరీ ఒకచోట కూర్చారు శివశంకర్. 'ఇంకా జాగ్రత్తగా వెదికితే మరిన్ని అదృశ్య గ్రామాలు దొరికే అవకాశం ఉం'దని వాపోతారు.

పచ్చగా ఉన్న గ్రామాల సంగతే ఎవరికీ పట్టని దశలో, ఎన్నడో కాలం కడుపులో అయిపు అజా లేకుండా పోయిన గ్రామాల సంగతి ఎవరికి కావాలి? వాటి గురించి సమాచారం ఎవరిక్కావాలీ? అదే చెప్పబోతున్నాను.

శ్రీనాథుడు అవసానదశలో 'బాపన వ్యవసాయం'నకు దిగి బొడ్డుపల్లిని గుత్తకు తీసుకొని, అది సరిగ్గా పండక ఏడువందల టంకాలు సర్కారుకు బాకీ పడ్డాడు కదా! ఆ బొడ్డుపల్లి ఎక్కడ ఉంది? ఆంధ్రప్రదేశ్ గ్రామనామాల పట్టికలలో ప్రస్తుతం ఆ ఊరు ఎక్కడా కానరాదు. అసలు ఆ ఊరే లేదా అంటే, 'బొడ్డుపల్లి' ఇంటిపేరు ఉన్న బ్రాహ్మణ కుటుంబాలు ఉన్నాయి. కాబట్టి ఒకప్పుడు ఎక్కడో ఆ గ్రామం ఉంది. కవిగారి పుణ్యమా అని 'గొడ్డేరు' వలన

మోసపోయానని శ్రీనాథుడు చిన్న ఆచూకీ యిచ్చాడు. ఆ 'గొడ్డేరు'ని ఎద్దువాగుగా భావించి – ఎద్దువాగు అమరావతి సమీపంలో కృష్ణానదిలో కలుస్తుంది కాబట్టి, బొడ్డుపల్లి ఆ సంగమ ప్రాంతంలో లంక గ్రామం అయి ఉంటుందని శివశంకర్ ఊహ.

నాగార్జునసాగర్ కట్టక మునుపు కృష్ణానది ప్రవాహం అమరావతి ప్రాంతంలో యిప్పుడున్నదానికన్నా విశాలంగా ఉండేది. కాబట్టి అక్కడ పెద్దపెద్ద లంకలు ఏర్పడి, వాటిపై గ్రామాలు ఏర్పడే అవకాశం ఉంది.

పానగల్ రాజాగా పేరొందిన పానుగంటి రామారాయణింగారు బ్రిటిష్ హయాంలో ఉమ్మడి మదరాసు రాష్ట్రానికి ప్రధాని (ప్రీమియర్)గా పనిచేశారు. ఆయన్ను అందరూ శ్రీకాళహస్తి సమీపంలోని పానగల్లుకి రాజాగా భ్రమపడుతూ ఉంటారు. నిజానికి కాదు. పానగల్లు రాజాల యింటి పేరు 'దామెర్ల' వారు.

వెంకటరామారాయణింగారి పూర్వీకులది తెలంగాణాలో మహబూబ్ నగర్ జిల్లాలోని పానగల్లు. అక్కడి నుండి వచ్చేసి 'కొమ్మాలపాడు' అనే చిన్న ఎస్టేట్‌దారు లయ్యారని 'సమదర్శిని' పత్రికలో పానగల్ రాజా నిర్యాణం సందర్భంగా రాసిన స్మృతివ్యాసంలో పేర్కొన్నారు. ఈ పత్రిక జస్టిస్ పార్టీ పక్షాన పానగల్ రాజా ఆదరణతో వెలువడుతుండేది. ఆ పత్రికలో తప్పు రాస్తారని నేననుకోను.

ఇప్పటి ప్రకాశం జిల్లా సంతమాగులూరు మండలంలో ఒక కొమ్మాలపాడు ఉంది. అయితే, ఉమ్మడి మదరాసు రాష్ట్రంలోని ఎస్టేట్లు, ప్రొప్రయిటరీ ఎస్టేట్లు, జమీల పట్టికలో కొమ్మాలపాడు పేరుతో ఎస్టేట్ లేదు.

కొమ్మాలపాడు మూడు గ్రామాలు ఉన్న చిన్న ఎస్టేట్ అని, రామారాయణింగారి తాతలనాడే ఆ ఎస్టేట్ హరించుకుపోయిందని 'సమదర్శిని' వ్యాసంలో రాశారు.

మరి ప్రకాశం జిల్లా కొమ్మాలపాడు కాకపోతే పానగల్ రాజాగారి కొమ్మాలపాడు ఎక్కడిది?

పై ప్రశ్నకు ఈ గ్రంథం అస్పష్టంగానైనా సమాచారం యిస్తుంది. నరసరావుపేట మండలంలోని పమిడిపాడు గ్రామంలో ఉన్న శాసనంలో 'క్రమ్మాలపాడు' ప్రస్తావన ఉంది. ఇప్పుడు ఆ క్రమ్మాలపాడు లేదు. ఆ క్రమ్మాలపాడే కొమ్మాలపాడు అని శివశంకర్ ఊహిస్తున్నాడు.

శ్రీనాథుని బావమరది, నాసికేతూపాఖ్యానకర్త దగ్గుబల్లి దుగ్గనగారి దగ్గుబల్లి కూడా యిక్కడ దొరుకుతుంది మనకు.

చేబ్రోలు దాటిన తరువాత పెద్దకాలువ ఒకటి 'కొమ్మమూరు కాలువ' పేరుతో ఉంది. ఏదీ, ఎక్కడుందీ కొమ్మమూరు అంటే యిదుగో, శివశంకర్ చెప్పేదాకా అది అదృశ్యగ్రామమని తెలియనే లేదు.

మా అమ్మమ్మగారి యింటిపేరు కంబాల. బాపట్లలో కూడా 'కంబాల' యింటిపేరుగలవారున్నారు. ఈ గ్రామం కోసం వెతగ్గా రాష్ట్ర గ్రామనామ పట్టికలలో లేదు. ఆ ఊరు చిరునామా కూడా యీ గ్రంథంలోనే దొరికింది. 12వ శతాబ్ది నాటి అమరావతి శాసనం ప్రకారం నేటి అచ్చంపేట మండలం మాదిపాడు సమీప ప్రాంతంలో కంబాల గ్రామం ఒకప్పుడు ఉండేది.

ఇలాగే మీ యింటిపేర్లలో దాగుండి ఎక్కడ ఉన్నాయో తెలియని కొన్ని గ్రామాలు ఈ సంపుటిలో దొరికే అవకాశం ఉంది. ప్రయత్నించి చూడండి.

తానూహించిన కుందేలుకు అయిదు లేదా మూడే కాళ్లుంటాయనే రకపు వాదనధోరణి కొంత మృదువుపరుచుకొంటే మిత్రుడు మణిమేల శివశంకర్ తనలోని పరిశోధక తత్త్వానికి మరింత మెరుపును సంతరించుకో గలడు.

డిగ్రీలు లేని పరిశోధకుడు శివశంకర్ నుండి మరిన్ని ఉత్తమ గ్రంథాలను ఆశిస్తున్నాను.

గుంటూరు, మొదుగుల రవికృష్ణ
18.12.2021

## మణిమేల శివశంకర్

చరిత్ర అన్వేషకుడు

ఇంటి నెం. 25-19-20

భవానికాలనీ, సంపత్ నగర్,

గుంటూరు - 522004.

మొబైల్: 8019632030




# విన్నపము

తెలిసింది గోరంత! తెలియవలసింది కొండంత!

నేను రచించిన 'గుంటూరుజిల్లా అదృశ్యగ్రామాలు' అను పరిశోధక పుస్తకం తెలుగునాట అదృశ్యగ్రామాలపై తొలిపుస్తకం. అయినా ఈ పుస్తకం దిక్సూచి మాత్రమే. ఎందుకంటే పరిశోధకుడు ఒక అంశాన్ని అనేక కోణాలలో పరిశీలన చేయాలి. అంతటి శక్తియుక్తులు నాకు లేవు. కేవలం మా ప్రాంతం (గుంటూరుజిల్లా)పై ఆసక్తి మాత్రమే నాలో ఉంది. కావున అనేకమంది మిత్రుల సహాయంతో ఈ చిన్న పరిశోధక పుస్తకాన్ని రాసాను. ఈ పుస్తకం చూసిన పరిశోధకులు కొందరు తమ ప్రాంతాలలో అదృశ్యగ్రామాలపై పరిశోధన చేస్తారని భావిస్తాను. అది ఒక ఒరవడిలాగా ఏర్పడి ఇంతవరకు చరిత్రకు అందని, తెలియని కొన్ని అదృశ్యగ్రామాల నిగ్గు తేలుస్తుంది. అందుకు ఈ పరిశోధన పుస్తకం ఒక మూలముగా ఉండగలదని విశ్వసిస్తున్నాను.

ఈ పుస్తకం వలన గుంటూరుజిల్లాలోని శాసనాలలో ప్రస్తావించబడి అదృశ్యమైన చారిత్రకగ్రామాలు, సామాజికగ్రామాలు, అగ్రహారాలు, కండ్రికలు, పాలెములు, తండాలు, విలీనగ్రామాలు, సరిహద్దులు తెలియని గ్రామాలు, కొన్ని ఇంటిపేర్లు వెలుగులోకి వచ్చాయి. అయినా ఇంకా 1000 కి పైగా అదృశ్యగ్రామాలు మా జిల్లాలో ఉంటాయని నా అంచనా. ఫీల్డ్ వర్క్ ద్వారానే మిగిలిన అదృశ్యగ్రామాలు కొన్నైనా వెలుగులోకి రాగలవు.

తొలుత నేను కూడా ఫీల్డ్ వర్క్ ద్వారానే అదృశ్యగ్రామాలు పుస్తకాన్ని తయారుచేద్దామనుకున్నాను. కాని అందుకు చాలా ధనం, కొన్ని సంవత్సరాల కాలం అవసరం. నా పరిధిలో, నాకున్న కొద్దిపాటి విరామ సమయాన్ని ఈ పరిశోధనకు కేటాయించి కొంత వరకు విలువైన సమాచారాన్ని ఇచ్చాననే అనుకుంటున్నాను.

చరిత్రలోని ప్రతి అంశం గ్రంథస్థం కావలసిందే. అందులో ముఖ్యంగా ప్రతి గ్రామచరిత్ర వెలుగులోకి వస్తే అనేక చారిత్రక, జానపద, సాంస్కృతిక, సామాజిక విషయాలు వెలికి వస్తాయి. తద్వారా కొత్తచరిత్ర బయటకు వస్తుంది. ఇక అదృశ్యగ్రామాల విషయానికి వస్తే ఒక అదృశ్యగ్రామ విషయం సమీప గ్రామస్థులకు చాలావరకు తెలియదనే చెప్పాలి. తెలిసినవారు కొందరే ఉంటారు కానీ వారు మన దృష్టికి రారు. ముఖ్యంగా పలనాడు, వినుకొండ ప్రాంతాలలో చరిత్రపై అవగాహన చాలమందికి స్వల్పమని నా అవగాహన. సత్తెనపల్లి, నరసరావుపేట, చిలకలూరిపేట ప్రాంత ప్రజానీకం చరిత్రపై కొద్దిపాటి అవగాహన కలిగి ఉంది. రేపల్లె, పొన్నూరు, బాపట్ల, మంగళగిరి, గుంటూరు ప్రాంతాలలో చరిత్ర అవగాహన కొంత మెరుగు. తెనాలి ప్రాంతం ఈ విషయంలో ముందంజలో ఉందని చెప్పవచ్చు.

'గుంటూరుజిల్లా అదృశ్యగ్రామాలు' పరిశోధనలో నాకు ఎందరో మహానుభావులు సహాయసహకారాలను అందించారు. వారు పెద్దలు లంకా సూర్యనారాయణగారు (అన్నమయ్య గ్రంథాలయం, గుంటూరు), స్వగ్రామం గొట్టిపాడు, ప్రత్తిపాడు మండలం. మరొకరు పెద్దలు సూర్యదేవర రవికుమార్‌గారు (గుంటూరు). స్వగ్రామం పేటేరు, రేపల్లె మండలం. అలాగే పెద్దలు చిరతనగండ్ల సోమేశ్వరరావుగారు, పాత గుంటూరు. మిత్రులు విష్ణువెములకల లీలాసుబ్రహ్మణ్యంగారు, స్వగ్రామం చావలి, వేమూరు మండలం. వీరికి నేను ఎంతో ఋణపడి ఉన్నాను.

గుంటూరు బృందావనగార్డెన్స్ అన్నమయ్య గ్రంథాలయ సిబ్బందికి, తాను రచించిన ప్రతి పుస్తకం నాకు అందించే మిత్రులు, శ్రేయోభిలాషి మోదుగుల రవికృష్ణగారికి, లామ్ (తాడికొండ మండలం) గ్రామస్థులు పెరుగుపల్లి బలరామ్‌గారికి ధన్యవాదములు.

ఈ పుస్తకం ముద్రణకు సిద్ధంగా ఉన్న సమయంలో గమనించిన పెద్దలు వాడపల్లి శేషకల్పశాయి గారు(హైదరాబాద్) ఇందులో వున్న తప్పులు, లోపాలు, దోషాలు సరిచేయుటకు గుంటూరుకు చెందిన తిరుపతి శ్యాంనారాయణ గారికి అప్పజెప్పారు. వారు ఎంతో ఓపికగా పరిశీలించి సరిచేశారు. పెద్దలు మన్నెం వెంకటరాయుడు (మనసు ఫౌండేషన్)గారికి వందనములు. డి.టి.పి. చేయించి యిచ్చిన బాపట్ల వాస్తవ్యులు, పెద్దలు, మిత్రులు తిమ్మన శ్యామ్‌సుందర్‌గారికి ప్రత్యేక ధన్యవాదాలు. అలాగే శాసన పుస్తక దాత, మిత్రులు గుడిపూడి (సత్తెనపల్లి మండలం) వాస్తవ్యులు కామినేని అచ్యుత్ గారికి, పరోక్ష సహకారం అందించిన మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు గారికి అభినందనలు.

ఈ పుస్తక ముద్రణ విషయంలో, ధనసహాయం కొరకు ఎదురుచూస్తున్న సమయంలో ఈ అవకాశాన్ని నాకు కల్పించమనీ, తన పేరు చెప్పవద్దనీ కోరిన మా అశోకవృక్షానికి సర్వదా కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలో తప్పులు, లోపాలు, చేర్చవలసిన సమాచారం తెలియజేయగలరు.

ఇట్లు

బుధజన విధేయుడను

శివదూషణ భరింపనివాడను

శివనామము సదా స్మరించువాడను

శివభక్తుడను

శివశంకర నామధేయుడను

శివార్పణమ్

# గ్రామాల అదృశ్యానికి కారణములు

1. ఒక గ్రామవికాసానికి ప్రధానంగా వాతావరణపరిస్థితి దోహదపడుతుంది. కరవుకాటకాలు ఆ గ్రామంపై తీవ్రమైన ప్రభావాన్ని చూపుతాయి. అతివృష్టి, అనావృష్టి కరవుకు దారితీస్తాయి. ఆరుగాలం శ్రమించిన రైతులకు కష్టానికి తగిన ఫలితం దక్కదు. దానితో తీవ్ర నిరాశా నిస్పృహలు కలుగుతాయి. ఒక ప్రాంతంలో పదేపదే ఆ పరిస్థితి సంభవించినప్పుడు ఆ కుటుంబాలకు గ్రామాన్ని వీడి వెళ్ళవలసిన దుస్థితి ఏర్పడుతుంది. దాంతో వ్యవసాయం మీద ఆధారపడి జీవించే రైతులు, రైతుకూలీలు, ఇతర బడుగుజీవులు మరో దారిలేక ఇతర ప్రాంతాలకు వలసపోవడం ప్రారంభిస్తారు. ఇతర వృత్తుల మీద ఆధారపడి జీవించేవారు సైతం ఆయా గ్రామాలను వీడక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. ఇతర గ్రామాలకు వలసపోవడమో లేక తామే ఇతర అనుకూలమైన ప్రదేశాల వద్ద క్రొత్త జీవనాన్ని ప్రారంభించాలనుకోవడమో చేస్తారు. వారు క్రొత్త గ్రామాలను నిర్మించుకొని, తాము అప్పటివరకు జీవించిన తమ పాత గ్రామ నామాన్నే పెట్టుకుంటారు. లేదా ఆ నూతన గ్రామానికి వేరే పేరు పెడతారు. గ్రామాల వలస నేటికీ జరుగుతూనే ఉంది. ఉపాధి దొరకని దుస్థితిలో కొన్నివేల కుటుంబాలు పొట్టకూటి కోసం ఇతర ప్రాంతాలకు వలసపోవడం చూస్తూనే ఉన్నాం.
2. దొంగలదోపిడీ భరించలేక కొన్ని గ్రామాల ప్రజలు ఆ ప్రాంతాలను వీడిపోవడం గతంలో జరిగేది. ఆ కారణంగా ఆ గ్రామాలు అదృశ్యమయ్యేవి.

3 కొందరు ప్రధానరహదారికి దూరంగా ఉన్న గ్రామాలను ఖాళీచేసి, ప్రధానరహదారికి దగ్గరగా క్రొత్త నివాసాలను ఏర్పాటు చేసుకొని, నూతన గ్రామాలను సృష్టిస్తారు. ఆ గ్రామాలకు అప్పటివరకు వారు ఉన్న గ్రామం పేరో, మరో కొత్తపేరో పెట్టుకుంటారు.

4. సముద్రతీరప్రాంతంలో నివాసముండేవారు సునామి, ఉప్పెన తదితర ఉత్పాతాలు సంభవించినపుడు ఆ గ్రామాలను వీడి, సముద్రపు ఎగువప్రాంతంలో కొత్త గ్రామాలను ఏర్పాటు చేసుకుంటారు. వాటికి కొత్త పేరు పెట్టడం లేదా పాత పేరునే కొనసాగించడం చేస్తారు.
5. నదులు, వాగుల వెంబడి వున్న గ్రామాలు వరదల వలన అదృశ్యమవ్వడం అనేకచోట్ల జరిగింది. ముంపుకు గురైన గ్రామాల పునర్నిర్మాణం జరగనప్పుడు

ప్రజలు ఆ గ్రామాలను ఖాళీచేసి ఎగువపాటిపై కొత్తగ్రామాలు నిర్మించుకుంటారు. వాటికి కొత్త పేరు పెట్టడం లేదా పాత పేరునే కొనసాగించడం చేస్తారు.

6. ప్రజావసరాల కోసం జలప్రాజెక్టుల నిర్మాణం వలన కొన్ని గ్రామాలు శిథిలం కావడం నేటికీ జరుగుతూంది. నాగార్జునసాగర్, పులిచింతల మొదలగు భారీ నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణాలను ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. నిర్వాసితులకు ప్రభుత్వం వేరే ప్రదేశాల్లో స్థలాలను కేటాయించడం, వారికి నూతనగృహాలను నిర్మించి యివ్వటం, ఆ ప్రాంతాలకు ప్రభుత్వమే పేర్లు నిర్ణయించడం లేదా గ్రామీణులే తమకు ఇష్టమైన పేర్లను పెట్టుకోవడం జరుగుతుంది.

7. పూర్వం మశూచి, ప్లేగు మొదలగు అంటువ్యాధులు ప్రబలంగా ఉండేవి. లక్షలాది జనం అకాలమరణాలకు గురయ్యేవారు. భయభ్రాంతులకు గురైన ప్రజలు తమ ప్రాంతంలో అటువంటివ్యాధి లక్షణాలు కనిపించినప్పుడు, ఆ గ్రామాలను ఖాళీ చేసి వేరే ప్రాంతాలకు వెళ్లిపోయేవారు. ఆ విధంగా ఆ గ్రామాలు అదృశ్యమయ్యేవి.

8. మునులు, సిద్ధులు, యోగులు, బ్రాహ్మణులు, భూతవైద్యులు, పేరంటాళ్ళు మొదలగువారి శాపాల భయం చేత ప్రజలు ఆ గ్రామాలను వీడి వెళ్లిపోయేవారు.

9 కొన్ని గ్రామాల్లో గ్రామదేవతలకు పూజాదికాలు సక్రమంగా నిర్వహించక పోవడంతో తాము గ్రామదేవత శాపానికి గురయ్యామనే భావనతో ప్రజలు ఆ ఊరినుండి వెళ్లిపోయేవారు.

10. గ్రామీణుల జీవితాలలో అభివృద్ధి లేకపోవడంతో ఊరి వాస్తు సరిగ్గా లేదనే భావనతో కొన్ని గ్రామాలు ఖాళీ అయ్యేవి.

11. తరచుగా అగ్ని ప్రమాదాలు సంభవిస్తున్న గ్రామాలను కూడా ప్రజలు వీడి వెళ్లిపోయేవారు. ఉగ్రదేవతలైన కాళి, నరసింహస్వామి, వీరభద్రస్వామివార్ల తీక్షణదృష్టి తమ గ్రామంపై పడిందనే భావన కలిగి వారు ఆయా గ్రామాలను ఖాళీచేసి వెళ్లిపోయేవారు.

12. మతవైషమ్యాలు కూడా కొన్ని గ్రామాలు అదృశ్యమవ్వటానికి కారణమయ్యింది. వీరశైవం ప్రబలంగా ఉన్నకాలంలో వారు బౌద్ధ, జైన, వైష్ణవ గ్రామాలపై దాడిచేసి గ్రామాలను ధ్వంసం చేసేవారు. దాంతో వారు ఆ ప్రాంతాలను విడిచిపెట్టి పారిపోయేవారు.

13. పలుయుద్ధాలు గ్రామాలు అదృశ్యమయ్యేందుకు కారణమయ్యాయి. యుద్ధంలో ఇతరరాజ్యాలను ఓడించిన రాజులు తాము గెలుపొందిన గ్రామాలను స్వాధీనం చేసుకుని, అక్కడున్న ధన, ధాన్య, పశు సంపదను దోచుకుని, ఆ గ్రామాలను ధ్వంసం చేసేవారు. పలు విదేశీపాలకులు కూడా ఈ విధంగా వినాశనానికి ఒడిగట్టేవారు. దాంతో ఆ ప్రజలు రాత్రికి రాత్రి ఆ ఊరి నుండి పారిపోయి, వేరేచోట తల దాచుకునేవారు. ఆ విధంగా పలుగ్రామాలు తొలుత శిథిలమై, ఆ పిదప అదృశ్యమయ్యేవి. అలాగే సైనికవిడిది కేంద్రాలు (స్కందవారము/కందవారము)గా ఉండే పలుగ్రామాల ప్రజలు ఆ సైనికుల అవసరములను తీర్చలేక తమ గ్రామాలను ఖాళీచేసి వెళ్లిపోయేవారు.

14. ఫ్లోరైడ్ నీరు ఉన్న గ్రామాలు, సిమెంటు, యురేనియం, ఇనుము మొదలగు ఖనిజాల త్రవ్వకం వలన కొన్ని గ్రామాలు ఖాళీ అవుతున్నాయి.

15. దెయ్యాలు, భూతాలు వంటి కొన్ని దుష్టశక్తులు తమ గ్రామాన్ని పట్టిపీడిస్తున్నాయనే భావనతో భయభ్రాంతులకు గురైన ప్రజలు తమ గ్రామాలను ఖాళీ చేసి వెళ్లిపోవటం పలుచోట్ల జరిగింది.

16. పాలకులు ప్రజలపై విధించే అధిక పన్నుల భారం ప్రజల్ని ఎన్నో ఇబ్బందులకు గురిచేసేది. వివిధ రకాలైన పన్నులు కట్టలేక ప్రజలు తమ గ్రామాలను ఖాళీ చేసి పొరుగు రాజ్యాలకు వెళ్లిపోయిన సందర్భాలు అనేకం చరిత్రలో గోచరిస్తాయి.

17. ముఠాకక్షలు, కార్పణ్యాల కారణంగా కొన్ని గ్రామాల్లో ప్రజలు ఆ గ్రామాలను ఖాళీ చేసి వెళ్లిపోతుండటం నేటికీ జరుగుతున్నది.

18. అటవీప్రాంత గ్రామాల్లోని ప్రజలు క్రూరమృగాల భయంతో తమ ఊర్లను ఖాళీ చేయడం జరుగుతుంది.

19. వాగ్దానభంగం, నిందలతో పూర్వకాలంలో కొన్ని గ్రామాలను ప్రజలు వీడవలసివచ్చేది. అబద్ధాలు చెప్పినందుకు శిక్షగా ఆనాటి రాజులు కొన్ని గ్రామాలను ఖాళీ చేయించడం జరిగింది.

20. పట్టణాలు పెరిగి, సమీపగ్రామాలు కలిసిపోవడంతో ఆ గ్రామాలు ఉనికి కోల్పోయి, పేటలు కాలనీలుగా రూపాంతరం చెందడం జరుగుతుంది.

21. సంచారజాతులు కొన్ని ఏండ్లు ఒకే చోట నివశించి తర్వాత వేరే ప్రాంతాలకు వలసపోవటం జరుగుతుంది.

# అదృశ్య గ్రామాలను తెలుసుకొనుటకు మార్గములు

1. మెకంజీ కైఫియత్తులు
2. శిలా, తామ్ర శాసనములు
3. తాళపత్రాలు, జమీ రికార్డులు
4. వారసత్వం (హెరిటేజ్)
5. రెవిన్యూ భూ రికార్డులు (అడంగల్)
6. పాతమ్యాపులు, పిన్‌కోడ్ ద్వారా
7. ఆలయచరిత్రలు
8. స్వీయచరిత్రలు, యాత్రాసాహిత్యము
9. ప్రాచీనసాహిత్యము, చాటుపద్యాలు
10. చరిత్ర గ్రంథములు
11. కరణీకర పట్టిక (దండకవిలె)
12. చెరువులు (అదృశ్యగ్రామం పేరుతో చెరువు ఉంటుంది)
13. ఫీల్డ్ సర్వే, ఇంటిపేరు వలన
14. గ్రామ, సమీప గ్రామ వృద్ధుల, ప్రజల వాడుక
15. బ్రిటిష్ గ్రంథములు (మ్యాన్యువల్, గెజిట్ వగైరా)
16. సామెతలు (నానుడులు)
17. ఎం.ఆర్.ఓ. (మండల గ్రామ సమగ్ర పట్టిక)
18. పర్వతములు (కొన్ని పర్వతములకు అదృశ్యగ్రామాల పేర్లు ఉంటాయి.)
19. వాగులు (కొన్ని వాగులకు అదృశ్యగ్రామాల పేర్లు ఉంటాయి.)

20. ఒక ప్రధానగ్రామం పేరు కలిగి, చివర దానికి లంక, తండ, పాలెం, పాడు అని ఉండి ఆ ప్రధానగ్రామం అక్కడ లేకపోతే పూర్వం ఆ గ్రామం ఉండి ఉంటుంది. కాని పాడు అను గ్రామాన్ని జాగ్రత్తగా పరిశీలన చేయవలసివుంటుంది.

21. గ్రామదేవతలను, ఆంజనేయ, నరసింహ, వీరభద్ర మొదలగు దేవతావిగ్రహాలను అదృశ్యగ్రామాల నుండి తీసుకువచ్చి వేరే గ్రామాలలో ఆలయాలు నిర్మించేవారు. వాటిని అదృశ్యగ్రామదేవతల పేరుతోనే పిలిచేవారు.

22. పూర్వం ఒక అదృశ్యగ్రామం నుండి విగ్రహాలను తీసుకొచ్చి వేరే గ్రామంలో ఆలయాన్ని నిర్మించినప్పటికీ నేటి గ్రామస్థులకు ఆ విషయం తెలియదు. ఆ ఆలయాల్లోని అర్చకులు ప్రతిరోజూ పూజలలో పూర్వ అదృశ్యగ్రామదేవతను స్తుతిస్తుంటారు. ఈ విషయాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించినపుడే ఆ అర్చకులు చరిత్రను వివరించడం జరుగుతుంది.

23. ఎక్కడైనా కొత్త ఊరు, కొత్తపల్లి, కొత్తపాలెం అని పేర్లు ఉంటే సమీపంలో అదృశ్యగ్రామం ఏదో ఉండి ఉంటుంది. అలాగే ఒక ఊరునుండి విడిపోయి, లేక కొత్తగా వలస వచ్చినవారు కొత్తఊరు, కొత్తపల్లి, కొత్తపాలెం గ్రామాలను నిర్మించుకుంటారు. ఈ రెండు తేడాలను గమనించాల్సిన అవసరం ఉంది.

24. కొన్నిచోట్ల శ్మశానం కూడా అదృశ్యగ్రామం పేరుతో ఉంటుంది.

25. ఉపకులాల గానం వలన కొన్ని అదృశ్యగ్రామాలు తెలుస్తాయి.

26. సంచారజాతుల వలన కొన్ని అదృశ్యగ్రామాలు తెలుస్తాయి.

27. వంశవృక్ష గ్రంథాల ద్వారా కొన్ని అదృశ్యగ్రామాలు తెలుస్తాయి.

28. బ్రిటిష్ ప్రభుత్వకాలంలో శాసనం ఎక్కడ లభిస్తే అక్కడి గ్రామం పేరుతో శాసనాలు రికార్డు చేశారు. కొన్ని చోట్ల ఆ గ్రామాలు అదృశ్యమైనాయి.

# విషయ సూచిక

| క్ర.సం. | విషయము | పుట |
| --- | --- | --- |

**గుంటూరు తాలూకా (పుట. 22-31)**

**మంగళగిరి తాలూకా (పుట. 32-40)**

**నరసరావుపేట తాలూకా(పుట.41-45)**



**పలనాడు తాలూకా(పుట. 46-79)**

## పొన్నూరు తాలూకా (పుట.80-88)

## రేపల్లె తాలూకా (పుట.89-97)



## సత్తెనపల్లి తాలూకా (పుట.98- 128)

## తెనాలి తాలూకా (పుట.129-156)

## వినుకొండ తాలూకా (పుట.157-177)

# బాపట్ల తాలూకా

1.బాపట్ల మండలం

2.కర్లపాలెం మండలం

3.పిట్టలవానిపాలెం మండలం

# 1. వెలిచర్ల (వెలిచర్ల అగ్రహారం)

భర్తిపూడి (బాపట్ల మండలం) గ్రామానికి ఆగ్నేయంగా 3 కి.మీ. దూరంలో వెలిచర్ల ఉండేది. ఇప్పటికీ అక్కడ 5 ఎకరాల 'వెలిచర్ల చెరువు' ఉంది. భర్తిపూడి గ్రామస్థులు ఆ ప్రాంతపొలాలను వెలిచర్లపొలాలుగా పిలుస్తారు. ఇక్కడ ఓ చిన్నదిబ్బపై నాగప్రతిమలు ఉన్నాయి. బాపట్లకు ఈశాన్యంగా వెలిచర్ల ఉన్నట్లు బాపట్ల కైఫియత్తు(1812)లో కనిపిస్తుంది.

కొందరు భర్తిపూడి గ్రామస్థులు వెలిచర్ల గ్రామాన్ని చూసినట్లు చెబుతారు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. క్రీ.శ. 669 కొణికె (కోనంకి, పిడుగురాళ్ళ మండలం) తామ్రశాసనంలో వెలిచర్ల ప్రస్తావన ఉంది. వెలిచర్ల మున్నుబులు చెరువువారు వైదికులు. దొంగలభయంతో ఈ గ్రామం ఖాళీ అయిందని చెబుతారు. వెలిచర్ల ఇంటిపేరుకల చాకలివారు భర్తిపూడిలో ఉన్నారు. వెలిచర్ల ఇంటిపేరుకల క్షత్రియ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 156.
2. ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూమ్: 31, సీరియల్ నెం. 12.
3. భర్తిపూడి గ్రామస్థులు మా చిన్నమేనత్త, చిన్నమేనమామ మనుబ్రోలు పద్మావతి, సుబ్బయ్య దంపతులు ఇచ్చిన సమాచారం.
4. అప్పికట్ల (బాపట్ల మండలం) గ్రామస్థులు చల్లపల్లి వీరయ్యచౌదరి ఇచ్చిన సమాచారం.

## 2. నేరేడుపల్లి (నేరేడుబల్లి అగ్రహారం)

భర్తిపూడి (బాపట్ల మండలం) గ్రామానికి తూర్పు ఆగ్నేయంగా, యానాదిసంఘం దాటిన తరువాత నక్కలగొంది పొలాల్లో నేరేడుపల్లి ఉండేది. సాక్షిగా అక్కడ శివలింగం ఉంది. భక్తులు అక్కడకు వచ్చి శివలింగానికి పూజాదికాలు నిర్వహిస్తుంటారు. భర్తిపూడి గ్రామస్థులు నేరేడుపల్లి గ్రామాన్ని చూసినట్లు చెబుతారు. నేడు ఈ ప్రాంతమంతా పొలాలుగా మారిపోయింది. ఇక్కడే తుంగభద్రనుండి చీలిన ఒక పాయ, ఓగేరు నుండి చీలిన ఒక పాయ కలిసి మరో వాగుగా ఏర్పడ్డాయి. వరదలు ఈ గ్రామాన్ని ముంచివేసినట్లు తెలుస్తుంది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది.

**ఆధారం:** భర్తిపూడి గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 3. ములకపాడు (ములసపాడు)

భర్తిపూడి (బాపట్ల మండలం) గ్రామానికి తూర్పు ఆగ్నేయంగా, నక్కలగొంది దాటిన తరువాత నేరేడుబల్లి సమీపంలో ములకపాడు ఉండేది. ఇప్పుడు ఎటువంటి ఆనవాళ్లు లేవు. ఈ గ్రామమంతా పంటపొలాలుగా మారిపోయింది. భూకంపం కారణంగా ఈ గ్రామం అదృశ్యమయ్యిందంటారు. భర్తిపూడి గ్రామస్థులు ఈ ప్రాంతపొలాలను ములకపాడు పొలాలుగా పిలుస్తారు.

**ఆధారం:** భర్తిపూడి గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 4. పాలపర్తిపాడు

బాపట్ల – పొన్నూరు రహదారిలో ఈతేరు (బాపట్ల మండలం) గ్రామం వద్ద తూర్పు ఈశాన్యంగా పాలపర్తిపాడు ఉండేది. ఈ గ్రామ కరణాలు పాలపర్తివారు. భారద్వాజస గోత్రులు వెలనాటి వారు. ఈతేరు వద్ద 'పాలపర్తికాలువ' అనే వాడుక ఉంది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో పాలపర్తిపాడు కనిపిస్తుంది. పాలపర్తిపాడు గుడిపూడి (బాపట్ల మండలం) గ్రామానికి ఉత్తర వాయవ్యాన ఉంది. గుడిపూడి గ్రామస్థుల్లో కూడా 'పాలపర్తిపాడు పొలాలు' అనే వాడుక ఉంది.

**ఆధారం:** భర్తిపూడి గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 5. వెన్నవాడ (విలీనగ్రామం)

పూర్వం గోవాడ (అమృతలూరు మండలం) గ్రామం నుండి కొందరు వర్తకులు పాలఉత్పత్తులను సేకరించి సమీపప్రాంత కూడలి వద్ద అమ్మకం చేసేవారు. అక్కడ వెన్నవ్యాపారం జోరుగా సాగేది. వెన్నవ్యాపారం జరుగుతున్న ప్రాంతం కాబట్టి 'వెన్నవాడ' గా పేరు పొందింది. విజయనగరసామ్రాజ్యపతనం తరువాత ముస్లింపాలనలో కొందరు ముస్లింసైనికులు నిజాంపట్నం తదితర సమీపగ్రామాల్లో వచ్చి స్థిరపడ్డారు. వారిలో ఖాజీ అనే వైద్యుడు వెన్నవాడ సమీపంలో మంచివైద్యుడుగా పేరు గడించి అక్కడే ఒక గృహాన్ని నిర్మించుకున్నాడు. ఖాజీ నివసించు ప్రాంతం ఖాజీపాలెం (పిట్టలవానిపాలెం మండలం) గా మారింది. ఖాజీపాలెం విస్తరించుట వలన వెన్నవాడ అందులో కలిసిపోయింది.

**ఆధారం:** ఖాజీపాలెం వాస్తవ్యులు వేదాన్తం అనంత శ్రీనివాసచక్రవర్తి ఇచ్చిన సమాచారం.

## 6. తూర్పు బొల్లవరం, అలరాల

కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో జడవల్లి (పొన్నూరు మండలం), తూర్పు కోడూరు (సంగుపాలెంకోడూరు, పిట్టలవానిపాలెం మండలం), తూర్పు బొల్లవరం, వెలిచర్ల, నేరేడుపల్లి మొదలైన గ్రామాలున్నాయి. తూర్పు బొల్లవరం సరిహద్దులు తెలియలేదు. తూర్పు బొల్లవరం కరణాలు బొల్లవరపు వారు. భారధ్వాజస గోత్రులు. ముప్పాళ్ళ మండలంలో కూడా బొల్లవరం ఉన్నది. దుగ్గిరాల మండలంలో బొల్లవరం అదృశ్య గ్రామం ఉన్నది. యాజలి (కర్లపాలెం మండలం) గ్రామసమీపంలో అలరాల ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్:2, పుట: 44, 65.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: 50 అనుబంధం

## 7. చిరిపురం (చెరుమూరు?)

బాపట్ల మండలం మర్రిపూడి అగ్రహారం – జిల్లెళ్ళమూడి గ్రామాల మధ్య చిరిపురం ఉండేది. ఈ గ్రామంలో ఆనాడు తెలికల (గాండ్ల) కులస్థులు అధికంగా ఉండేవారు. వీరు చేసిన పొరపాట్లవలన అప్పటి ప్రభువు ఆగ్రహించి ఆ గ్రామాన్ని ఖాళీ చేయించాడట.

**ఆధారం:**

1. అప్పికట్ల (బాపట్ల మండలం) గ్రామస్థులు చల్లపల్లి వీరయ్యచౌదరి ఇచ్చిన సమాచారం.
2. దేవుని దయతో, నోరి రామకృష్ణయ్య, 2009, పుట: 19.

## 8. వెంకటాపురంకంద్రిక

నిజాంపట్నం సర్కారులోని ఉల్లిపాలెం (నగరం మండలం) జమీందారైన రేచర్ల గోత్రోద్భవులు రాజా సూరానేని వెంకటపతిరాయనింగారు శ్రీరంగయాత్రకు వెళ్లి తిరిగివస్తూ అద్దంకిసీమలో త్రోవగుంట (ఒంగోలు మండలం) గ్రామంనుండి ప్రముఖ శ్రీవైష్ణవాచార్యులు, కౌశికసగోత్రులైన కందాళం వేంకటాచార్యులను తీసుకువచ్చి అల్లూరు (పిట్టలవానిపాలెం మండలం) గ్రామానికి పశ్చిమదిశన 20 కత్తులబీటు పొలాన్ని 'కంద్రిక' చేసి ఇచ్చారు. ఆ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. కందాళం వంశీయులు అల్లూరు, నిజాంపట్నం పరిసర గ్రామాలలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్:5, పుట: 179, 180.

1. కత్తు భూమి అంటే సుమారు 15 ఎకరములు.
2. బీటు అంటే అడవిని కొట్టి బాగుచేసిన నేల

## 9. చాగంటిపాడు

బాపట్ల మండలం జిల్లెళ్ళమూడి గ్రామానికి, ఓగేరు (నల్లమడవాగు)కి మధ్యలో జిల్లెళ్ళమూడి గ్రామానికి దక్షిణంగా ఒక కి.మీ. దూరంలో చాగంటిపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

**ఆధారం:** సహస్రసూత్రధారిణి అమ్మ, కోన వేంకటేశ్వరరావు, పొన్నూరు, 1996, పుట: 1.

## 10. సంగుపాలెం (విలీనగ్రామం)

పిట్టలవానిపాలెం మండలంలో సంగుపాలెం, కోడూరు గ్రామాలు కలిసిపోయి 'సంగుపాలెం కోడూరు' గా ఏర్పడింది.

గుంటూరుజిల్లాలో నారాకోడూరు (చేబ్రోలు మండలం), బ్రాహ్మణ కోడూరు (పొన్నూరు మండలం) మొదలగు కోడూరు గ్రామాలు ఉండుటవలన ఈ కోడూరు గ్రామాన్ని సంగుపాలెం కోడూరు అని అంటారు.

**ఆధారం:** కొత్తగూడెం (తెలంగాణ) మాజీ శాసనసభ్యులు కూనంనేని సాంబశివరావు ఇచ్చిన సమాచారం.

# చిలకలూరిపేట తాలూకా

1. చిలకలూరిపేట మండలం
2. యడ్లపాడు మండలం
3. నాదెండ్ల మండలం

# 1. చిలకలూరిపేట పరిసర విలీనగ్రామాలు

పురుషోత్తమపట్నం శివారులో చిలకలపాడు(చిలకలూరుపాడు) గ్రామం ఉండేది. సమీప పాటిదిబ్బలపై ఉన్న పండ్లచెట్లపై చిలుకలు ఎక్కువగా ఉండేవి. కనుక ఈ గ్రామానికి 'చిలకలపాడు' పేరు వచ్చి కాలక్రమేణా చిలకలూరిపేటగా మారింది. ఇది మధ్వ బ్రాహ్మణులైన మానూరివారికి జమీకేంద్రము. సమీపగ్రామాలలో పండే ప్రత్తి ఆధారంగా చిలకలూరిపేటలో అనేక కాటన్ జిన్నింగ్, ప్రెస్సింగ్, టెక్స్‌టైల్స్ పరిశ్రమలు ఏర్పడ్డాయి. 16వ నెంబరు జాతీయరహదారి వెంబడి యడ్లపాడు, తిమ్మాపురం (యడ్లపాడు మండలం), గణపవరం (నాదెండ్ల మండలం), చిలకలూరిపేట, మార్టూరు (ప్రకాశంజిల్లా) ప్రాంతాలలో ప్రత్తి, గ్రానైటు, ఆయిల్ మొదలగు పరిశ్రమలు ఉన్నాయి. వీటికి కేంద్రం చిలకలూరిపేట. చిలకలూరిపేటలో పురుషోత్తమపట్టణం, కొమరవల్లిపాడు, రాగన్నపాలెం, సూదావారిపాలెం మొదలగు గ్రామాలు కలిసిపోయాయి. గుంటూరుజిల్లాలో 50 వేల జనాభా దాటిన 14 పట్టణాలలో ఒక్క చిలకలూరిపేటకు మాత్రమే రైలుమార్గం లేదు. ఈ పట్టణం ఆంధ్ర కోయంబత్తూరుగా ప్రసిద్ధి చెందింది.

**ఆధారం:** చిలకలూరిపేట వాస్తవ్యులు మన్నె కుమారస్వామి
ఇచ్చిన సమాచారం.

# 2. శంభునిపాలెం (విలీనగ్రామం)

నాదెండ్ల (మండలకేంద్రం) గ్రామానికి పడమరగా శంభునిపాలెం (భాగ్యనగరం) ఉండేది. కాలక్రమేణా శంభునిపాలెం నాదెండ్లలో కలిసిపోయింది. సమీప గ్రామస్థులు కొందరు శంభునిపాలెం గ్రామాన్ని ప్రత్యేకంగా పిలుస్తారు.

**ఆధారం:** కనపర్రు (నాదెండ్ల మండలం) గ్రామస్థులు
యంపరాల పెదలింగారావు ఇచ్చిన సమాచారం.

## 3. బండారుపల్లివారిపాలెం (విలీనగ్రామం)
## గొట్టిపాటివారిపాలెం (విలీనగ్రామం)

సాతులూరు (నాదెండ్ల మండలం) గ్రామానికి దక్షిణంగా బండారుపల్లివారిపాలెం ఉండేది. కాలక్రమేణా ఈ గ్రామం సాతులూరులో కలిసిపోయింది. సమీప గ్రామస్థులు బండారుపల్లివారిపాలెం గ్రామాన్ని ప్రత్యేకంగా పిలుస్తారు. గొట్టిపాటివారిపాలెం కూడా సాతులూరులో కలిసిపోయింది. బండారుపల్లి, గొట్టిపాటి ఇంటిపేరు కల కమ్మవారు ఈ పాలెములను పూర్వం నిర్మించుకున్నారని తెలుస్తున్నది.

**ఆధారం:** కనపర్రు (నాదెండ్ల మండలం) గ్రామస్థులు
యంపరాల పెదలింగారావు ఇచ్చిన సమాచారం.

## 4. సుందరీపురం

దూపాటిసీమ (ప్రకాశంజిల్లా) పాలకవంశానికి చెందిన సాయపనేని రాగప్పనాయడు క్రీ.శ. 1676లో బెజవాడ బ్రహ్మయ్యలింగంగారికి సాతులూరు (నాదెండ్ల మండలం) గ్రామసమీపాన సుందరీపురం అగ్రహారాన్ని ఇచ్చాడు. సుందరీపురం ఇప్పుడు సాతులూరులో కలిసిపోయిందంటారు. ఈ గ్రామకరణాలు వెలనాటివారైన మౌద్గల్యసగోత్రులు పాలుట్లవారు. సుందరీపురం గ్రామాన్ని త్రిపురసుందరీపురం అనికూడా కొందరు అంటారు.

**ఆధారం:** సాయపనేనివారి చరిత్ర, కొడాలి లక్ష్మీనారాయణ, మోపర్రు గ్రామం,
అమృతలూరు మండలం, 1976, పుట: 15, 16.

## 5. జీవరం

క్రీ.శ. 1161 తిమ్మాపురం (యడ్లపాడు మండలం) శాసనంలో చందోలు రాజధాని వెలనాటి పాలకుడైన కులోత్తుంగచోడ రెండవ గొంకరాజు (క్రీ.శ. 1137–1162) భార్య కామిదేవి తమ్ముడు సరణయ జీవరం గ్రామంబు తటాకమును త్రవ్వించెను అని ఉంది. శాసనాన్నిబట్టి తిమ్మాపురం ప్రాంతంలో జీవరం ఉండేదని భావించవలసి ఉంటుంది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 151.
2. నరసరావుపేట తాలూకా గ్రామచరిత్ర, విష్ణుభొట్ల సూర్యనారాయణ, గుంటూరు, 1964, పుట: 86, 87.
3. తిమ్మాపురం గ్రామస్థులు బందినేని రామకృష్ణ ఇచ్చిన సమాచారం.

## 6. వంగా?పాపయ్యపాలెం, నాగభైరవవెంకటాచలపాలెం

చిలకలూరిపేట మండలం చినగొట్టిపాడు (కంచరగొట్టిపాడు) గ్రామానికి దగ్గర్లో వంగా?పాపయ్యపాలెం, నాగభైరవవెంకటాచలంపాలెం ఉండేవి. చినగొట్టిపాడు దగ్గర్లో నాగభైరవపాలెం (పెదనందిపాడు మండలం) ఉంది. కావున నాగభైరవవెంకటాచలపాలెం, నాగభైవరపాలెం ఒకటేనా కాదా అని పరిశోధన చేయవలసివుంది. నాగభైరవ ఇంటిపేరుతో కమ్మకులస్థులు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 36.

## 7. సూదనిపాడు

బొప్పూడి (చిలకలూరిపేట మండలం) గ్రామ చెన్నకేశవస్వామికి కొణిదెన (బల్లికురవ మండలం, ప్రకాశంజిల్లా) పాలకుడు నన్నెచోడకన్నరదేవుడు సూదనిపాడు గ్రామంలో 10 ఖండుకల భూమిని దానంగా ఇచ్చాడు. (ఖండు అంటే పుట్టి అని అర్థము. పుట్టి అంటే పెద్దగంపలో పట్టే ధాన్యం నాటితే సరిపోయేంత భూమి). సమీపాన ఉన్న ప్రకాశంజిల్లా ప్రాంతంలో కూడా సూదనిపాడు లేదు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 6, సీరియల్ నెం. 651.
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 130.


## 8. కాగితాలపేట

కొండవీడు (యడ్లపాడు మండలం) సమీపాన కాగితాలపేట ఉండేది. అక్కడ జనపనార, గుడ్డపేలికలు మొదలగు వాటితో వందల ఏళ్ళపాటు చెడకుండా ఉండే కాగితాలు నైపుణ్యంతో చేసేవారు. రాజకీయ వ్యవహార గ్రంథాలకు, రాజపత్రాలకు, గ్రంథరచనకు ఈ కాగితాలు వాడేవారు. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

**ఆధారం:**


1. కొండవీడు పర్యాటక విశేషములు, చింతలపాటి యజ్ఞనారాయణ, సింగిస్కాన్‌పేట, యడ్లపాడు మండలం, 2013, పుట: 40, 42.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 11, 8.

## 9. మారెడ్లవారిపాలెం

వేలూరు (చిలకలూరిపేట మండలం) గ్రామానికి దక్షిణదిశలో మారెడ్లవారిపాలెం ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. మారెడ్డి ఇంటి పేరు కలిగిన రెడ్లు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్:3, పుట: 218.

## 10. సంతపేట

కొండవీడు కోటవద్ద సంత జరిగే ప్రాంతంలో సంతపేట ఉండేది. సింగిస్కాన్‌పేట (యడ్లపాడు మండలం) గ్రామ చివరివాడను పూర్వ సంతపేటగా భావిస్తారు.

**ఆధారం:** కొండవీడు పర్యాటక విశేషములు, చింతలపాటి యజ్ఞనారాయణ, సింగిస్కాన్‌పేట, యడ్లపాడు మండలం, 2013, పుట: 42, 43.

## 11. చినపసుమర్రు

చిలకలూరిపేట మండలం పసుమర్రు (పెద్ద పసుమర్రు) గ్రామానికి దక్షిణాన చినపసుమర్రు ఉండేది. క్రీ.శ. 1606లో కొండవీడు పాలకుడు గుంటుపల్లి ముత్తయ్య వెలనాటి వైదికులైన మద్దూరి పేరుభట్టుకు చినపసుమర్రు గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు. చినపసుమర్రు కరణాలు నందవరీకులైన భారద్వాజసగోత్రులు పసుమర్తివారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 100.

## 12. కంతేటివారికండ్రిక

చిలకలూరిపేట మండలం చిన్నగొట్టిపాడు (కంచరగొట్టిపాడు) గ్రామానికి దక్షిణంగా కంతేటివారికండ్రిక ఉండేది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం చూడవచ్చు. కంతేటి ఇంటిపేరు కలిగిన బ్రాహ్మణులు పసుమర్రు (చిలకలూరిపేట మండలం) లో ఉన్నారు.

**ఆధారం:** నాదెండ్ల గ్రామస్థులు మన్నె కుమారస్వామి ఇచ్చిన సమాచారం.

## 13. పుల్లగార్లపాడు

వేలూరు (చిలకలూరిపేట మండలం) గ్రామానికి నైఋతిదిశలో అక్కిరాజు వెంకటాచలం చెరువు, అయ్యేటి అంకులుకుంటల సమీపాన పుల్లగార్లపాడు ఉండేది. రెండు వందల ఏళ్ళకు పూర్వమే ఈ గ్రామం అదృశ్యమయింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 218, 219.

## 14. శ్రీరంగనగరం (రంగపతిపేట)

క్రీ.శ. 1616లో కొండవీడు పాలకుడైన జూపల్లి రంగారావు కుమారుడు రంగపతిరావు (క్రీ.శ. 1616-1618) కొండవీడులో ఉన్న రంగనాయకులస్వామిని సొలస (యడ్లపాడు మండలం) గ్రామానికి తూర్పుగా ప్రతిష్ఠించి, శ్రీరంగనగర గ్రామనిర్మాణం చేశాడు. తర్వాత కాలంలో సొలస గ్రామస్థులైన అరవపల్లి సోదరుల పొలంలో రంగనాయకస్వామి లభించడంతో వారు తమ గ్రామంలో ఆలయం నిర్మించారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 32, 33.

## 15. కుతుబ్‌షాపురం

క్రీ.శ. 1598 లో శిగిలిసుభానుడు కొండవీడు పాలకుడు. ఇతను కొండవీడు దక్షిణాన తమ ప్రభువు మహమ్మద్ కులీకుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612)పేరుతో కుతుబ్‌షాపురం నిర్మించాడు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 32.

## 16. మహమ్మదాపురం

క్రీ.శ. 1598 లో శిగిలిసుభానుడు కొండవీడు పాలకుడు. ఇతను కొండవీడు ఉత్తరాన తమ ప్రభువు మహమ్మద్ కులీకుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612)పేరుతో మహమ్మదాపురం నిర్మించాడు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 32.

## 17. కృష్ణాపురం

తూబాడు (నాదెండ్ల మండలం) గ్రామానికి చేరువలో కృష్ణాపురం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 52.

## 18. విప్రులపాలెం

రెడ్డిరాజుల కాలంలో కొండవీడు ఆలయాలలో పూజాదికాలు నిర్వహించు విప్రులు సొలస (యడ్లపాడు మండలం) సమీపాన విప్రులపాలెం గ్రామాన్ని నిర్మించుకున్నారు. ఆ గ్రామం సొలసలో కలిసిపోయిందని పెద్దలు చెబుతున్నారు.

**ఆధారం:** సొలస గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 19. చెరుకూరి బుచ్చన్నపాలెం

జాలాది (యడ్లపాడు మండలం) గ్రామానికి పడమరగా చెరుకూరి బుచ్చన్నపాలెం ఉండేది. చెరుకూరి ఇంటిపేరుకల కమ్మకులస్థులు యడ్లపాడు పరిసరగ్రామాల్లో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 43.

## 20. తారిశపాడు

మద్దిరాల (చిలకలూరిపేట మండలం) గ్రామానికి తూర్పుగా, బొప్పూడి (చిలకలూరిపేట మండలం) గ్రామానికి వాయవ్యంగా తారిశపాడు ఉండేది. ఆ గ్రామకరణాలు నందవరీకులైన రాజనంపల్లివారు. తర్వాత వారి ఇంటిపేరు మద్దిరేల గా మారి క్రమంగా మద్దిరాల గా మార్పుచెందినది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 72, 75.

## 21. నూజెళ్ళపల్లి అగ్రహారం

నాదెండ్ల (మండలకేంద్రం) గ్రామానికి ఉత్తర వాయవ్యంగా నూజెళ్ళపల్లి అగ్రహారం ఉండేది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు. నాదెండ్ల మండలంలో ఉన్న ఎండుగుంపాలెం, కనపర్రు, ఇర్లపాడు గ్రామాల మధ్య నూజెళ్ళపల్లి అగ్రహారం ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఇప్పుడు ఆ ప్రదేశంలో అక్కలకుంట ఆంజనేయస్వామి ఆలయం ఉంది.

**ఆధారం:**

1. నాదెండ్ల వాస్తవ్యులు మన్నె కుమారస్వామి ఇచ్చిన సమాచారం.
2. కనపర్రు (నాదెండ్ల మండలం) గ్రామస్థులు యంపరాల పెదలింగారావు ఇచ్చిన సమాచారం.

## 22. వెంపటివారిపాలెం

చిలకలూరిపేట మండలంలో కావూరు, లింగంగుంట్ల గ్రామాలు కలిసి ఉంటాయి. గుంటూరుజిల్లాలో ఇంకా కావూరు గ్రామాలు ఉండుట వలన ఈ కావూరు గ్రామాన్ని లింగంగుంట్ల కావూరు అంటారు. లింగంగుంట్ల వద్ద వెంపటివారిపాలెం ఉండేది. వెంపటి ఇంటిపేరుతో బ్రాహ్మణ, కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 101.

## 23. మద్దుకూరిపాలెం

చిలకలూరిపేట మండలంలో కావూరు, లింగంగుంట్ల గ్రామాలు కలిసి ఉంటాయి. కావూరు గ్రామం దగ్గర మద్దుకూరిపాలెం ఉండేది. మద్దుకూరి ఇంటిపేరుతో కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 13.

## 24. రామచంద్రపురం

విజయనగరచక్రవర్తి అచ్యుతదేవరాయల పాలన (క్రీ.శ. 1530-1542) లో రామయ్యభాస్కరుడు (బాచరసు) కొండవీడు పాలకుడు. ఇతని సోదరి ప్రతాప చిన్నమాంబ క్రీ.శ. 1540లో వంకాయలపాడు (యడ్లపాడు మండలం) గ్రామంలో పెద్దచెరువు (గోపినాథచెరువు) నిర్మించింది. తర్వాత కొండవీడుకి దక్షిణంగా మూడుఘడియల దూరం (మూడు క్రోసులు) లో రామచంద్రపురం గ్రామాన్ని నిర్మించి, బ్రాహ్మణులకు దానం ఇచ్చింది. ఈ గ్రామహద్దులు తెలియవు. వంకాయలపాడే రామచంద్రపురం అయి ఉండవచ్చని నా ప్రగాఢవిశ్వాసం. గుంటూరుజిల్లాలోని చిలకలూరిపేట మండలంలో, గుంటూరు పట్టణంలో, మంగళగిరి మండలంలో రామచంద్రపురం పేరిట గ్రామాలున్నాయి.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 121.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 78.

ఘడియ అంటే 48 నిమిషాలు. మనిషి సాధారణంగా 48 నిమిషాల్లో ఎంత నడుస్తాడో అంత దూరాన్ని ఘడియ అంటారు.

ఘడియ దూరం అంటే ఒక క్రోసు. క్రోసు అంటే రెండు మైళ్ళు. మైలు అంటే 1.60 కి.మీ.

## 25. పుచ్చకాయలపాడు (విలీనగ్రామం)

ఉన్నవ (యడ్లపాడుమండలం) గ్రామం ఏర్పడకముందు దానికి దక్షిణదిశగా పుచ్చకాయలపాడు ఉండేది. దీనికి సంబంధించి ఓ కథ ప్రచారంలో ఉంది. నల్లగొండసీమ (తెలంగాణ) నుండి జున్యావుల పెద్దక్క (గోపశ్రీ) తన పశుగణంతో పుచ్చకాయలపాడు వద్ద మకాం వేసింది. ఒకానొక సమయంలో పెద్దక్క పశు గణంలో మూడు ఆవులు పాలు ఇవ్వని పరిస్థితి ఏర్పడింది. అది గమనించిన పెద్దక్క పాలేర్లతో విచారిస్తుండగా 'మేముఉన్నాము' అని సమీప బావి నుండి శబ్దం వచ్చింది. దాంతో పెద్దక్క తరువాత రోజున తన గోవులను శబ్దం వచ్చిన చోటునగాక వేరే చోటున ఉంచినది. ఐనా ఆమూడు ఆవుల పాలు ఆరోజు కూడా హరించబడ్డాయి. పెద్దక్కకు ఈ విషయం ఎంత ఆలోచించినా బోధపడలేదు. ఆ రాత్రి పెద్దక్కకు కలలో రాజగోపాలస్వామి కనిపించి 'అమ్మా! మేము ముగ్గురం రాజగోపాలమూర్తులము. ఉభయనాంచారసమేతులమై సమీపబావిలో ఉన్నాము. మమ్ములను బావి నుండి తీయించి, అరక కట్టని కోడెలతో మూడుబండ్లపై ఉంచి కోడెలు బండ్లను ఎటు తీసుకెళ్తే అటు పోనివ్వు' అని చెప్పాడట. ఉదయమే స్వామి చెప్పిన విధంగా చేయగా మూడు బండ్లలో ఓ బండి తిరిగి పెద్దక్క ఉన్న ప్రాంతానికి వచ్చింది. స్వామి బావి నుండి 'ఉన్నాము' అన్నారు కనుక ఆ ప్రాంతానికి 'ఉన్నాము' అని పేరు వచ్చింది. కాలక్రమేణా అది 'ఉన్నవ'గా మారింది. ఉన్నవలో నేటికీ రాజగోపాలస్వామి ఆలయం ఉంది. మిగతా రెండుబండ్లు క్రోసూరు, పెద్దపణిదం (సత్తెనపల్లి మండలం) గ్రామాలలో ఆగినవట. పుచ్చకాయలపాడు క్రమేపి ఉన్నవలో కలిసిపోయింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 1, పుట: 86.

**జ(జు)న్యావుల వారి సమాచారం.**

వీరు ఎర్రగొల్లలు. క్రీ.శ. 1414 మాచర్ల శాసనంలో జన్యావుల కసవనాయుని ప్రస్తావన కలదు. క్రీ.శ. 1515లో పాతగుంటూరు జిల్లాలోని 8 దుర్గాలను శ్రీకృష్ణదేవరాయలు జయించాడు. అందులో ఒక దుర్గానికి జన్యావుల కసవపాత్రుడు అధిపతిగా ఉన్నాడు. అందుకు ఆధారం ఆ సమయంలో అనేక శాసనాలు కలవు.

## 26. గోపీనాథపురం

విజయనగరచక్రవర్తి అచ్యుతదేవరాయలు పాలన (క్రీ.శ. 1530-1542) లో రామయ్యభాస్కరుడు (బాచరసు) కొండవీడు పాలకుడు. ఇతడు కొండవీడులో రెడ్డిరాజులు కట్టించిన కోటలు, కట్టడాలు, ఆలయాలను పునర్నిర్మించాడు. మంచి శిల్పులను రప్పించి కొండవీడు వద్ద గోపీనాథ ఆలయాన్ని కట్టించాడు. (ఈ ఆలయంలోని మూర్తి సమీప సింగిస్కాన్‌పేట (యడ్లపాడు మండలం) లో కొలువైవున్న వెన్నముద్దల బాలగోపాలస్వామి అని ప్రతీతి). గోపీనాథ ఆలయప్రాంతం క్రమేపీ గోపీనాథపురంగా ప్రసిద్ధి చెందింది. కొండవీడు ప్రాంత పాలెగాళ్లు 72 మంది ప్రభుత్వానికి విరుద్ధంగా ఉండటంవలన రామయ్య భాస్కరుడు వారిని పిలిపించి, భోజనాదులు పెట్టించి, కత్తులబావిలోకి ఒక్కొక్కరిని పడదోసి చంపించాడని ఒక కథనం. క్రీ.శ. 1570?లో గోల్కొండసేనాని ముర్తుజాఖాన్ కొండవీడును జయించి గోపీనాథపురాన్ని ధ్వంసంచేసి కొండవీడుకు తన పేరిట ముర్తుజానగర్ పేరు పెట్టాడు. ఇతని పాలన ఎక్కువ కాలం సాగలేదు. అళియ రామరాయల తమ్ముడు మొదటి తిరుమలదేవరాయలు కొండవీడును స్వాధీనం చేసుకున్నాడు. కోట (యడ్లపాడు మండలం) గ్రామ సమీపంలో గోపీనాథ ఆలయశిథిలాల్ని చూడవచ్చు.

**ఆధారం:** కొండవీడు కైఫియత్తు, సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ,
గుంటూరు, 2020. పుట: 66, 67, 71.

కొండవీడుసీమ పాలకుడు బాచరసు(రామయ్యభాస్కరుడు) పెట్టిన ఇబ్బందులు తట్టుకోలేక పెదపలకలూరు(గుంటూరు రూరల్ మండలం) గ్రామస్థుడు పలకలూరు గోపన్న చెప్పిన చాటు పద్యం

ఆ.వె॥ గోలకొండమలక గోవుల భక్షించు
గొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసుచేరి భక్షించుచున్నాడు
మలక మేలొ బాచమరసు మేలో?

**ఆధారం :** చాటుపద్యం మణిమంజరి. రెండవభాగం పుట.333

## 27. అయిలవరం (ఉప్పలపాడు)

రెడ్డిరాజ్యస్థాపకుడు ప్రోలయవేమారెడ్డి (క్రీ.శ. 1325-1353) ద్వితీయ కుమార్తె అయిన వేమాంబ కుమార్తె పేరు అయిలమ్మ. ఆమె సంక్రాంతిరోజున తాతగారిని పండుగ సరదాలకు కొంత ధనాన్ని కోరగా ప్రోలయవేమారెడ్డి సొలస (యద్లపాడు మండలం) ప్రాంతంలో కొంతభూమిని విడదీసి సంక్రాంతిపాడు (నాదెండ్ల మండలం), అయిలమ్మవరం గ్రామాలు నిర్మించి ఇచ్చాడు. ఇందులో అయిలమ్మవరం(అయిలవరం) ఉప్పలపాడుగా మారి ఆ తర్వాత అదృశ్యమయింది. సంక్రాంతిపాడు గ్రామానికి ఈశాన్యంగా 3 కి.మీ. దూరంలో అయిలవరం (ఉప్పలపాడు) ఉండేది. స్థానిక మామిడిపల్లి నాగేశ్వరరావు పొలం వద్ద పోలేరమ్మ ఆలయం ఉంది. అక్కడే అయిలవరం (ఉప్పలపాడు) ఉండేదని భావించవచ్చు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 111.
2. ఫిరంగిపురంమండల గ్రామాలచరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, అమీనాబాద్, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 89, 90.

## 28. విశ్వనాథునికంద్రిక

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542 - 1576) యద్లపాడు, కారుచోల (యద్లపాడు మండలం) గ్రామాల సరిహద్దు పొలాలలో 30 తూపల భూమిని కంద్రిక చేసి కొలిచెలమల విశ్వనాథుడు అనే విప్రునికి దానంగా ఇచ్చాడు. కారుచోల గ్రామ కైఫియత్తు (1812)లో చెప్పిన శాసనంలో ఆ గ్రామచిహ్నాలతోపాటు తెలిపిన సరిహద్దులలో "ఉత్తరదిశ విశ్వనాథునికంద్రిక పొలిమేర పుట్టకాడ" అని ఉంది. ఈ గ్రామచిహ్నంగా చిన్నకొండపై శివాలయం ఉంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ప్రభుత్వ రెవిన్యూ రికార్డులలో ఈ ప్రాంతపొలాలు ఇంకా విశ్వనాథునికంద్రిక పేరుతోనే ఉన్నాయి. గుంటూరుజిల్లా పాతమ్యాపులో విశ్వనాథునికంద్రికను చూడవచ్చు.

**కొలి(చె)చలమలవారి సమాచారం:** కొలిచలమల జగ్గుభట్లు, గంగమ్మ కుమారుడు అచ్చన్న క్రీ.శ. 1622లో కొండవీడు (యడ్లపాడు మండలం) రామేశ్వరుని ప్రతిష్ఠించి, గర్భగృహ, అంతరాలయమండపాల్ని కట్టించాడు. ఈ వివరాలుగల శాసనం కొండవీడు (యడ్లపాడు మండలం) రామేశ్వరాలయంలో ఉంది.

క్రీ.శ. 1718లో అమరావతి పాలకుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడి ముత్తాత రామలింగన్న(?) రామచంద్రపాలెం గ్రామాన్ని రామచంద్రపుర అగ్రహారం (గుంటూరునగరంలో కలిసిపోయిన ఆర్. అగ్రహారం) గా పేరుమార్చి కొలిచలమల జగ్గావధానులు, గుండు నరసావధానులు అను వారికి దానమిచ్చాడు.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 11.
2. ప్రజాశక్తి ప్రత్యేక సంచిక – 2001, పుట: 52.
3. కొండవీడు, కల్లి శివారెడ్డి, గుంటూరు, 2017. పుట: 55.
4. దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర, సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ, గుంటూరు, 2020, పుట: 19.


తూప అంటే కుచ్చెల. కుచ్చెల అంటే 3ఎకరాల 40 సెంట్లు భూమి. కంద్రిక అంటే ఒక గ్రామంలో కొంత భూమిని ఖండించి, అనగా విడదీసి ఇచ్చినది. కంద్రిక గ్రామానికి సగం పన్ను మినహాయింపు ఉంటుంది. అలాగే అగ్రహారం గ్రామానికి పూర్తి పన్ను మినహాయింపు ఉంటుంది. సామాన్య ప్రజలు మాత్రం అగ్రహారం, కంద్రిక గ్రామాలలో పన్ను చెల్లించటం తప్పనిసరి.

“శోత్రియం” గ్రామం అంటే యాగం చేసేవానికి ఇచ్చే గ్రామం. దాత హోదాను బట్టి శోత్రియం గ్రామానికి పన్ను నిర్ణయించబడుతుంది.

## 29. సర్ సాలార్‌జంగ్ పేట

హైదరాబాద్ రాజ్య ప్రధానమంత్రి మీర్ తురాబ్ అలీఖాన్ (మూడో సాలార్‌జంగ్) (1853-1883) పేరిట కొండవీడు పరిసరాలలో ఏర్పడిన గ్రామం. ఈ గ్రామహద్దులు తెలియవు. ఇతని పేరుతోనే హైదరాబాద్‌లో సాలార్‌జంగ్ మ్యూజియం ఏర్పడినది.

**ఆధారం:**

శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ,
నరసరావుపేట, 2019, పుట: 8.

## 30. నక్కలగుడిపూడి, పడమట పెంచికలపూడి

ఈ రెండు గ్రామాలు నలస గ్రామ సమీపాన ఉండేవి. ఇప్పుడు నలస లేదు, ఈ రెండు గ్రామాలూ లేవు. కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో సాతులూరు (నాదెండ్ల మండలం), కొమెరపూడి (సత్తెనపల్లి మండలం) వరుసలో ఉన్న నలసను సొలస (యడ్లపాడు మండలం) గా భావించాలి. సత్తెనపల్లి మండలంలో ఉన్న గుడిపూడి గ్రామాన్ని నక్కలగుడిపూడి అనేవారేమో పరిశీలన చేయవలసివుంది. సంతగుడిపాడు (రొంపిచర్ల మండలం), గుడిపాడు (క్రోసూరు మండలం) గ్రామాలను కూడా కొందరు గుడిపూడిగా పిలిచేవారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.

# గుంటూరు తాలూకా

1. గుంటూరు రూరల్ మండలం
2. పెదకాకాని మండలం
3. తాడికొండ మండలం
4. ప్రత్తిపాడు మండలం
5. వట్టిచెరుకూరు మండలం

## 1. పెయ్యలమిట్ట (ప్రయంమిట్ట)

నిడుముక్కల (తాడికొండ మండలం) గ్రామానికి దక్షిణ నైఋతిదిశలో పెయ్యలమిట్ట ఉండేది. సాక్షిగా ఇక్కడ పెయ్యలమిట్ట ఆంజనేయస్వామి ఆలయం ఉంది. దొంగల భయంతో ఈ గ్రామం ఖాళీ చేసారు. క్రీ.శ. 1577 నిడుముక్కల శాసనంలో పెయ్యలమిట్ట ప్రస్తావన ఉంది. ఈ గ్రామకరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు నిడుముక్కలవారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 37.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 289.

## 2. అగతవరం

పెదకాకాని (మండలకేంద్రం) గ్రామానికి నైఋతిదిశలో అగతవరం ఉండేది. ఈ గ్రామం అదృశ్యమైన తరువాత ఎగువపాటిపై అగతవరప్పాడు గ్రామాన్ని నిర్మించుకున్నట్లు ప్రచారముంది. గుంటూరు ఇన్నర్ రింగ్ రోడ్ పక్కన అగతవరప్పాడు ఉంది. గ్రామకరణాలు వెలనాటివారైన భారద్వాజసగోత్రులు కాకానివారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 3.

## 3. ఇటికలపాడు

నంబూరు (పెదకాకాని మండలం) గ్రామానికి పడమరగా శనగల ప్రమీల జూనియర్ కళాశాల వద్ద ఇటికలపాడు ఉండేది. మావోయిస్టుల దాడితో ఆ గ్రామస్థులు తమ ఊరును వీడి సమీపంలోని గుంటూరుకాలువ వద్ద భూపట్టాలు పొంది స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. వారి నివాసాలు నేడు నంబూరులో ఓ పేటగా ఉన్నాయి.

**ఆధారం:** నంబూరు గ్రామస్థులు ఉయ్యూరు శివరామరెడ్డి, కూసం వెంకటరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 4. వంగిపురం పరిసర అదృశ్యగ్రామాలు

వంగిపురం (ప్రత్తిపాడు మండలం) గ్రామం వద్ద శ్రీశకవారిపాలెం, నన్నపనేనివారిపాలెం, నువుపాడు (సువుపాడు?), మల్లపాడు (పల్లపాడు?) గ్రామాలు ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. క్రీ.శ. 1274 లో కాభయ్య పండితుడు కాకతీయ రుద్రమదేవి (క్రీ.శ. 1262–1289) అనుమతితో వంగిపురం వల్లభస్వామికి 'కోయూరు' పట్టణ సుంకాన్ని వసంతోత్సవాలకు ఇచ్చాడు. ఈ కోయూరు ఎక్కడుందో తెలియవలసివుంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 1, పుట: 72, 75.

## 5. గోపీనాథపురం (విలీనగ్రామం)

పెదపలకలూరు (గుంటూరు రూరల్ మండలం) గ్రామానికి దక్షిణదిశలో గోపీనాథపురం ఉండేది. 12వ శతాబ్దంలో ఆ గ్రామంలో వేణుగోపాలస్వామి ఆలయం ఉండేది. ఇప్పుడు ఆలయం ఉంది కాని గ్రామం పెదపలకలూరులో కలిసిపోయింది. మెకంజీ రికార్డులలో పెదపలకలూరు సమీప గోపీనాథపురం గురించిన సమాచారం ఉంది. క్రీ.శ. 1378 రెడ్డిరాజుల పెదపలకలూరు తామ్రశాసనంలో గోపీనాథపురం సరిహద్దుల ప్రసక్తి ఉంది. కొండవీడు(యడ్లపాడు మండలం) వద్ద కూడా గోపీనాథపురం అదృశ్యగ్రామం కలదు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.
2. కాపర్ ప్లేట్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం వాల్యూమ్: 1. పుట: 207.
3. రెడ్డిరాజ్య సర్వస్వము, భిన్నూరి నరసింహశాస్త్రి, హైదరాబాద్, 1998, పుట: 511.

## 6. గౌతుభూతాలకుంటపాలెం

ప్రత్తిపాడు (మండలకేంద్రం) గ్రామానికి తూర్పు ఆగ్నేయదిశలో జమ్ములకుంటవద్ద గౌతుభూతాలకుంటపాలెం ఉండేది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 103.
2. ప్రత్తిపాడు గ్రామస్థులు చాగంటి పరమేశ్వరరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 7. గుంటూరు పరిసర విలీనగ్రామాలు

గుంటూరు అనగానే మనకు మిర్చి గుర్తుకొస్తుంది. ఆంధ్రప్రదేశ్ లోని పెద్ద నగరాలలో ఒకటి, జిల్లాకేంద్రము. జనాభా సుమారు పదిలక్షలు. రామచంద్రపురం అగ్రహారం (ఆర్.అగ్రహారం), కొరిటెపాడు, గుజ్జనగుండ్ల, శివారెడ్డిపాలెం, స్తంభాలగరువు, గడ్డిపాడు, గోరంట్ల మొదలగు గ్రామాలు గుంటూరు నగరంలో కలిసిపోయాయి.

## 8. బయ్యవరం

కొండవీడు పాలకుడైన అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) పెదపలకలూరు (గుంటూరు రూరల్ మండలం) తామ్రశాసనం (క్రీ.శ. 1378) లో బయ్యవరం సరిహద్దులు ఉన్నాయి. అందులో 'నల్లపాటి తెరువ(బాట) దాటి పడమర కంబం (స్తంభం) గడచిపోగా బయ్యవరపు తెరువు' అని ఉంది. అంటే నల్లపాడు (గుంటూరు రూరల్ మండలం)కి ఇంచుమించు పడమరగా బయ్యవరం ఉండేది. క్రోసూరు మండలంలో కూడా బయ్యవరం పేరుతో ఒక గ్రామం ఉంది.

**ఆధారం:**

1. కాపర్ ప్లేట్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం వాల్యూమ్: 1. పుట: 204.
2. రెడ్డిరాజ్య సర్వస్వము, భిన్నూరి నరసింహశాస్త్రి, హైదరాబాద్, 1998, పుట: 511.

## 9. యనమదల పరిసర అదృశ్యగ్రామాలు

యనమదల (ప్రత్తిపాడు మండలం) గ్రామానికి చేరువలో కాలివారిపాలెం, త్రిపురపురం, వెంకటాపురం ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. త్రిపురపురం, వెంకటాపురం గ్రామాలకు కరణాలు భారద్వాజసగోత్రులు గణపరాజువారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 1, పుట: 64.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 33, 64.

## 10. పులిపాడు

ధరణికోట (అమరావతి) పాలకుడు కోట గణపతిదేవుడి (క్రీ.శ. 1234-1240) మహాప్రధాని ప్రోలెనాయకుడు తన తల్లిదండ్రులు గుండ్డసాని, ఉద్దండనాయకుడు, అన్న కేతినాయకుని పుణ్యానికి క్రీ.శ. 1238 లో పులిపాటి రామేశ్వరదేవరను ప్రతిష్ఠించి, ఆలయాన్ని నిర్మించాడు. మెకంజీ కైఫియత్తులో పులిపాక (పులిపాడు) బేజాత్‌పురంగా మారిందని ఉంది. పులిపాటి ఇంటిపేరు కలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు. గురజాల మండలంలో కూడా ఒక పులిపాడు ఉంది. అమరావతి మండలం నెమిలికల్లు వద్ద అదృశ్యమైన గుండవరం గ్రామం, తూళ్ళూరు మండలంలో ఉన్న ఉద్దండరాయునిపాలెం ఈ ప్రోలెనాయకుడు తల్లిదండ్రులు పేరుతో ఏర్పడి ఉండవచ్చు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 289.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 66.

## 11. గారపాడు

తక్కెళ్ళపాడు (పెదకాకాని మండలం) గ్రామానికి దక్షిణంగా పాతగుంటూరు, సుద్దపల్లిడొంక బాటలో గారపాడు ఉండేది. ఇక్కడి పాటిదిబ్బలపై గారచెట్లు అధికంగా ఉండుట వలన ఆ పేరు వచ్చిందట. ఇక్కడ ఉన్న చెరువును గారపాడు చెరువు అంటారు. తక్కెళ్ళపాడు గ్రామస్థులు కొందరు తమ పొలాలకు దగ్గరగా ఉన్న గారపాటి పొలాలలో గ్రామాన్ని నిర్మించుకుని తక్కెళ్ళపాడునుండి వలసవచ్చినవారికి పెద్ద అయిన చిగురుపాటి రామచంద్ర పేరుతో ఆ గ్రామానికి రామచంద్రపాలెం అని పేరు పెట్టారు.

**ఆధారం:**

1. సదాశివమ్ (డా॥ కాసరనేని సదాశివరావు స్వీయచరిత్ర), 2013, పుట: 5,
2. రామచంద్రపాలెం (పెదకాకాని మండలం) గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 12. దద్దనాలపాడు

పాతగుంటూరు, సుద్దపల్లిడొంక బాటలో రామచంద్రపాలెం (పెదకాకాని మండలం) గ్రామం దాటిన తరువాత దద్దనాలపాడు ఉండేది. ఇందుకు సాక్ష్యం అక్కడ ఉన్న చెరువు. ఆ చెరువును దద్దనాలచెరువని పిలుస్తారు. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. (రాజాంతఃపుర స్త్రీలు సతీసహగమనం చేసిన ప్రాంతాన్ని దగ్ధనాల అనేవారట.)

**ఆధారం:** రామచంద్రపాలెం (గారపాడు) గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 13. తుర్లపాడు (ఉత్తర తుర్లపాడు)

క్రీ.శ. 1562 మంగళగిరి శాసనంలో శ్రీరామానుజకూటానికి (మంగళగిరి?) తాళ్ళపాక చినతిరుమలయ్య త(తు)ర్లపాడులో కొంత భూమి ఇచ్చినట్లు ఉంది. రావెల (తాడికొండ మండలం) గ్రామానికి 2 కి.మీ. దూరంలో పశ్చిమదిశలో తుర్లపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. చుట్టుప్రక్కల గ్రామాలైన వరగాని (పెదకూరపాడు మండలం), పాములపాడు (తాడికొండ మండలం) రైతులు ఆ ప్రాంతాన్ని తుర్లపాడు పొలాలు అని పిలుస్తారు. 80 ఏళ్ళక్రితం రావెల గ్రామస్థుడు మేకల చలమయ్యచౌదరికి తుర్లపాడువద్ద పూసపాటివారి పొలాల్లో ఆంజనేయస్వామి లభించాడు. రావెల తోపువద్ద తుర్లపాటి ఆంజనేయస్వామి ఆలయం నిర్మించారు. ఈ గ్రామకరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు సంపుటంవారు. తుర్లపాటి ఇంటిపేరు కలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు. యడ్లపాడు మండలంలో కూడా ఒక తుర్లపాడు ఉంది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 4, సీరియల్ నెం. 710.
2. రావెల గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 14. నడలపాడు

క్రీ.శ. 1294 పొత్తూరు (గుంటూరు రూరల్ మండలం) శాసనంలో మలినేని కేతినేడు తన 'తల్లిదండ్రుల పుణ్యంగాను పొత్తూరు సోమనాథదేవునికి భీమనప్రెగడ పోచిరాజుక్షేత్రం(పొలం) నడలపాటి తెరువు(బాట) తూర్పున క్రయము విలిచి కొని' అని ఉంది. నేడు పొత్తూరు పరిసరాలలో ఈ గ్రామం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 478.

## 15. ఉత్తర నారాకోడూరు

కంతేరు (తాడికొండ మండలం) గ్రామ సమీపాన ఉత్తర నారాకోడూరు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. ఈ గ్రామాన్ని విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) వాధూలసగోత్రులు కంనాళ్ళవారికి దానంగా ఇచ్చారు. చేబ్రోలు మండలంలో కూడా నారాకోడూరు పేరుతో గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 58, 64.

## 16. పడ్లిపాక, కొప్పుని, సత్తువు, వల్లని, పోరుపాక

పాతగుంటూరులోని పొత్తూరి అప్పయ్య ఇంట్లో ఉన్న తామ్రశాసనం (తేదీ తెలియదు) లో విష్ణువర్ధనమహారాజు పడ్లిపాక, కొప్పుని, సత్తువు, పొత్తూరు (గుంటూరు రూరల్ మండలం), వల్లని, పోరుపాక గ్రామాలను తన ఖడ్గసహాయుడైన రంగరాజుకు ఇచ్చినట్లు ఉంది. పొత్తూరు తప్ప మిగతా గ్రామాలు లేవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 1, 47.

## 17. మనుబోతులకుంట (ప్రతినామగ్రామం)

మనుబోతు జింకజాతికి చెందిన వన్యమృగం. మనుబోతులు ఉన్న కుంటప్రాంతానికి 'మనుబోతులకుంట' పేరు వచ్చింది. అదే పేరుతో గ్రామం కూడా ఏర్పడింది. ఆ గ్రామస్థులు 'మనుబోతు'ను చెడ్డపేరుగా భావించి వెంకటకృష్ణాపురం (పెదకాకాని మండలం)గా పేరు మార్చుకొన్నారు. ఇది అదృశ్యగ్రామం కాదు. ప్రతినామగ్రామానికి ఒక ఉదాహరణ.

**ఆధారం:** పెదకాకాని గ్రామస్థులు పిన్నమనేని మృత్యుంజయరావు ఇచ్చిన సమాచారం.

## 18. తాడికొండ పరిసర అదృశ్యగ్రామాలు

క్రీ.శ. 5, 6 శతాబ్దాలకి చెందిన పృధ్వీశ్రీ మూలరాజు తాడికొండలోని చాతుర్దిశ శాక్యభిక్షు సంఘం కోసం ఒక విహారం నిర్మించాడు. ఆ సంఘ అవసరాల కోసం 'తాలుపాక విషయంలోని తాడికొండ, చుప్పాదప్పుల, వెల్కుండ, అతళావుల, కంసార్య గ్రామాలమధ్యనున్న తంగోడు నడవభూమిని' దానం ఇచ్చాడు. నేడు తాడికొండలో ఎటువంటి బౌద్ధచిహ్నాలూ లేవు. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** కృష్ణాతీరంలో బౌద్ధక్షేత్రాలు, యమ్. రాజగోపాలరావు,
గుంటూరు, 2006, పుట: 29

## 19. పొన్నిగంటికంద్రిక

విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509–1529) పొన్నిగంటి గోపీనాథుడు అనే వ్యక్తికి పొన్నెకల్లు గ్రామపొలంలో కొంతభూమికి పొలిమేర హద్దులు పెట్టించి దానమిచ్చాడు. పొన్నిగంటికంద్రిక ఎక్కడ ఉండేదో తెలియదు. గోల్కొండ నవాబు ఇబ్రహీం కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1550–1580) సామంతుడు, పొట్లచెరువు పాలకుడు అమీన్‌ఖాన్. అతని ఆస్థానకవి పొన్నగంటి తెలగన్న అచ్చతెనుగు కావ్యమైన యయాతిచరిత్రను రచించాడు. ఈ కవి పొన్నెకల్లు గ్రామస్థుడేమోనని డా.లక్ష్మణచక్రవర్తి ఊహ. పొన్నగంటి ఇంటిపేరుతో బ్రాహ్మణ, కాపు, కమ్మ కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 55.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ,
   నరసరావుపేట, 2019, పుట: 69.

## 20. ప్రత్తిపాడు పరిసర అదృశ్యగ్రామాలు

ప్రత్తిపాడు చుట్టుపక్కల దండయ్యపాలెం, శౌరిపాలెం (దక్షిణం?), మంగళపాలెం (పడమర?), గింజుపల్లి పెదరామునిపాలెం (తూర్పు?), గింజుపల్లి చినరామునిపాలెం. గుంటువల్లి రమణయ్యపాలెం?, గుంటువల్లి భగవాన్‌దాసుపాలెం? (దక్షిణం, గాలికుంట), మెడికినపూడి, నడికూడి మొదలగు గ్రామాలు ఉండేవి. వీటి హద్దులు తెలియవు. కొన్ని గ్రామాలు ప్రత్తిపాడులో కలిసిపోయాయని అంటారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2,
పుట: 103, 104, 105, 106, 113.

## 21. కొండజాగర్లమూడి

ప్రత్తిపాడు పడమర నైఋతిదిశలో కొండజాగర్లమూడి ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం చూడవచ్చు. ఈ గ్రామకరణాల ఇంటిపేరు ఉన్నవ. సమీపంలో కొండ ఉండుట వలన ఈ గ్రామానికి కొండజాగర్లమూడి పేరు వచ్చింది. తెనాలి మండలంలో సంగం జాగర్లమూడి గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 8.

## 22. గుంటూరు పరిసర అదృశ్యగ్రామాలు

గుంటూరుకు దగ్గర్లో బుడమ, కొరివేడు, గరికపాడు ఉండేవి. బహుశా బుడమ - బుడంపాడు (గుంటూరు రూరల్ మండలం), కొరివేడు - కొరిటపాడు (గుంటూరులో కలిసిపోయినది), గరికపాడు - గడ్డిపాడు (పెదకాకాని మండలం) అయివుండవచ్చు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65

# మంగళగిరి తాలూకా

1. మంగళగిరి మండలం
2. తాడేపల్లి మండలం
3. తుళ్లూరు మండలం
4. అమరావతి మండలం

## 1. ఉప్పుంబాలూరు

క్రీ.శ. 1577 మల్కాపురం (తుళ్ళూరు మండలం) శాసనంలో గోల్కొండ పాలకుడైన ఇబ్రహీం కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1550–1580) రావిపూడి (రాయపూడి, తుళ్లూరు మండలం) స్థలంలోని 19 గ్రామాల పొలాలు, సరిహద్దులను కొలిపించి చిన్నరైతులకు శిస్తు రద్దుచేసినట్లు ఉంది. అందులో ఉప్పుంబాలూరు ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. గ్రామకరణాలు కాసులనాటివారు. కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో తూములూరు (కొల్లిపర మండలం), ఉప్పుంబాలూరు, తాడికొండ (మండలకేంద్రం) ఇలా ఉన్నాయి.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 748
2. మందడం నుండి మోటుపల్లి రేవుదాక, నూతక్కి వెంకటప్పయ్య, మందడం, తుళ్లూరు మండలం, 2009, పుట: 50, 51.
3. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 38.

## 2. సుబ్బనత(ప)ల్లి

కొండవీడు వరస దండకవిలె కరణీకపట్టికలో తాడేపల్లి (మండలకేంద్రం), ప్రాతూరు (తాడేపల్లి మండలం), సుబ్బనతల్లి, తూములూరు (కొల్లిపర మండలం) ఇలా ఉన్నాయి. కాని సుబ్బనతల్లి హద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 37.

## 3. ఉప్పలపాడు

క్రీ.శ. 1261 కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199-1262) మల్కాపురం శాసనంలో ఉప్పలపాడు చెరువు పడమటి కొమ్ము రావిపూండి (రాయపూడి, తుళ్లూరు మండలం) వెలంగపూండి (వెలగపూడి, తుళ్లూరు మండలం) పొలమునందు పొలిమేర అని ఉంది. మల్కాపురం (తుళ్లూరు మండలం) గ్రామానికి నైఋతిదిశలో ఉప్పలపాడు చెరువు ఉన్నది. కావున ఆ చెరువుకు చేరువలోనే ఉప్పలపాడు ఉండిఉండాలి. గుంటూరుజిల్లాలో అనేక ఉప్పలపాడు గ్రామాలున్నాయి.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 395
2. నవ్యాంధ్ర రాజధానిప్రాంత గ్రామాలచరిత్ర,
   యార్లగడ్డ బాలగంగాధరరావు, విజయవాడ, 2015, పుట: 39.

## 4. తూర్పు దొండపాడు, ఉత్తర ఉప్పలపాడు

పెదవడ్లపూడి (మంగళగిరి మండలం) గ్రామానికి దగ్గర్లో తూర్పు దొండపాడు, ఉత్తర ఉప్పలపాడు ఉండేవి. తూర్పు దొండపాడు కరణాలు వెలనాటివారైన ముచ్చిరాజువారు. ఉత్తర ఉప్పలపాడు కరణాలు వెలనాటివారైన శ్రీవత్సగోత్రులు.
**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64, 40.

## 5. బంధంరావూరు

అమరావతి మండలంలో వైకుంఠపురం గ్రామం ఉన్న చోట బంధంరావూరు ఉండేది. క్రీ.శ. 1577 మల్కాపురం (తుళ్ళూరు మండలం) శాసనంలో గోల్కొండ పాలకుడైన ఇబ్రహీం కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1550-1580) రావిపూడి (రాయపూడి, తుళ్లూరు మండలం) స్థలంలోని 19 గ్రామాల పొలాలు, సరిహద్దులను కొలిపించి చిన్నరైతులకు శిస్తు రద్దుచేసినట్లు ఉంది. అందులో బంధంరావూరు ఉంది.

కృష్ణానది ఇక్కడ ఉత్తరంగా ప్రవహిస్తుంది. నది ప్రక్కనేగల పెద్దపర్వతాన్ని క్రౌంచగిరి అంటారు. ఈ పర్వతంపై ఓ గుహలో స్వయంభూః వేంకటేశ్వరస్వామి ఉన్నాడు. ఈ గ్రామానికి సంబంధించి ఓ కథ ప్రచారంలోఉంది. అన్నాచెల్లెళ్లు చిన్ననాడే విడిపోయి, పెద్దయిన తర్వాత ఒకరికొకరు తెలియక పెళ్లి చేసుకున్నారు. తెలిసిన తరువాత దోషనివారణకై అనేక పుణ్యనదులలో బంధాలు ధరించి స్నానాలు చేసారు. వారి బంధాలు ఎక్కడ విడిపోతే వారు అక్కడ పాపవిముక్తులు అవుతారు. వారు క్రౌంచగిరితీర్థం వద్ద స్నానమాచరిస్తుండగా వారి బంధాలు విడిపోయాయి. అందువలన ఈ గ్రామానికి బంధంరావూరు అని పేరు వచ్చింది. ఆనాటినుండి ఈ క్షేత్రము బంధవిరామక్షేత్రము (క్రౌంచతీర్థం)గా ప్రసిద్ధి చెందింది.

బంధంరావూరు గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. గుంటూరుజిల్లాలో అనేక రావూరు గ్రామాలు ఉన్నాయి. కృష్ణానది అమరావతి నుండి బెజవాడ వెళ్ళకుండా మంగళగిరి వెళ్ళడానికి సిద్ధపడగా క్రౌంచగిరి అడ్డుకొని బెజవాడ కనకదుర్గమ్మ చెంతకు చేర్చిందని ఓ కథనం.

అమరావతి పాలకుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు (క్రీ.శ. 1761-1816) అమరావతిని కైలాసంగాను, క్రౌంచగిరిని వైకుంఠంగాను భావించి ఇచ్చట వైకుంఠపురం అను గ్రామాన్ని ఏర్పాటుచేసి ఎగువ తిరుమల, దిగువ తిరుమలలాగా వేంకటేశ్వరస్వామి ఆలయాల్ని నిర్మించాడు. వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు బంధంరావూరు వేణుగోపాలస్వామి ఆలయంలో ఉన్న మూర్తికి చేబ్రోలు (గుంటూరుజిల్లా) గ్రామంలో చతుర్ముఖబ్రహ్మ ఆలయానికి ఉత్తరాన ఆలయం నిర్మించాడు. బంధంరావూరి ఇంటి పేరు కలిగిన నాయీబ్రాహ్మణులు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం: 748.
2. మిత్రులు లాం (తాడికొండ మండలం) గ్రామస్థులు
   పెరుగుపల్లి బలరామ్ ఇచ్చిన సమాచారం.

## 6. గుండవరం(ఉత్తర గుండవరం)

నెమలికల్లు (అమరావతి మండలం) గ్రామానికి నైఋతిదిశలో, మండెపూడి (అమరావతి మండలం) గ్రామానికి ఈశాన్యదిశలో (ఉత్తర) గుండవరం ఉండేది. సాక్షిగా గుండవరం ఆంజనేయస్వామి ఆలయం ఉంది. మండెపూడి గ్రామస్థులకు గుండవరం పొలాలు అని వాడుక ఉంది. కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509–1529) గుండవరం గ్రామాన్ని తాళ్ళపాక అన్నమయ్య వంశీయులైన తాళ్ళపాక వెంకటాచార్యులకు దానమిచ్చాడు. దక్షిణ గుండవరం చేబ్రోలు మండలంలో ఉంది.

**ఆధారం:**

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 69.
2. మిత్రులు అనంతవరం (తుళ్లూరు మండలం) గ్రామస్థులు పారా అశోక్‌కుమార్ ఇచ్చిన సమాచారం.

## 7. పడమట మున్నంగి

కాజ (మంగళగిరి మండలం) గ్రామ సమీపాన పడమటమున్నంగి ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. పడమటమున్నంగి కరణాలు సాంఖ్యాయనసగోత్రులు గౌతరాజువారు. కొల్లిపర మండలంలో కూడా మున్నంగి (మునికోటిపురం) పేరుతో ఒక గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 46, 65.

## 8. చామర్లపాడు

క్రీ.శ. 1288 అమరావతి శాసనంలో 'మద్దూర తాడేకుంట కడన (చివర) 16 నడిమి (మధ్య) తేరు (బాట)న చామెరలపాటి తూర్పున' అని ఉంది. పాటి పదము పేట, పాడుగా మారుతుంది. పెదమద్దూరు (అమరావతి మండలం) కు ఇంచుమించు పడమరగా చామర్లపాడు గ్రామం ఉండేది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 6, సీరియల్ నెం. 225.

## 9. పిచ్చికలపాలెం

తుళ్లూరు మండలం దొండపాడు గ్రామానికి దక్షిణాన అర కిలోమీటరు దూరంలో పిచ్చికలపాలెం ఉండేది. అక్కడ సర్వేశ్వరాలయం ఉంది. క్రీ.శ.1979 లో గుంటూరుజిల్లా దేవాలయపట్టికలో పిచ్చికలపాలెం సర్వేశ్వరాలయం ఉంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఈ ప్రాంత పొలాలను పిచ్చికలపాలెం పొలాలుగానే పిలుస్తారు. పిచ్చికలపాలెం గ్రామానికి దొండపాడు ముఖద్వారం. పిచ్చికలపాలెంకు ఆ పేరు పిచ్చుకల గుర్తుగా ఏర్పడలేదు. ఇది వాస్తవానికి పచ్చికల పాలెం. కాలక్రమేణా పిచ్చికలపాలెంగా మారింది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో పిచ్చికలపాలెం కనిపిస్తుంది.

**ఆధారం:** తుళ్లూరు గ్రామస్థులు రొంపిచర్ల శోభనాచల లక్ష్మీనరసింహాచార్యులు ఇచ్చిన సమాచారం.

## 10. కొండలరాజుపాలెం

రాయపూడి (తుళ్లూరు మండలం) గ్రామానికి దగ్గరగా, తుళ్లూరు (మండలకేంద్రం) కు తూర్పు ఈశాన్యదిశగా కొండలరాజుపాలెం ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఇక్కడి పంటపొలాలను కొండలరాజుపాలెం పొలాలుగానే పిలుస్తారు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో కొండలరాజుపాలెం కనిపిస్తుంది.

**ఆధారం:** తుళ్లూరు గ్రామస్థులు రొంపిచర్ల శోభనాచల లక్ష్మీనరసింహాచార్యులు ఇచ్చిన సమాచారం.

## 11. సాంబిరెడ్డిపాలెం

తుళ్లూరు మండలంలో ఉన్న పెదపరిమి–నెక్కల్లు మార్గంలో తాబేటిచెరువు ఉంది. 1950కి ముందు పెదపరిమి భూస్వామైన కటికల సాంబిరెడ్డి తమ పొలాలకు దగ్గరగా ఉన్న తాబేటిచెరువువద్ద సాంబిరెడ్డిపాలెం గ్రామాన్ని నిర్మించాడు. ఆ గ్రామం అదృశ్యమయింది.

**ఆధారం:** పెదపరిమి గ్రామస్థులు అట్లూరి చలమారెడ్డి ఇచ్చిన సమాచారం.

## 12. పుట్టిపాడు

కృష్ణానదితీరాన పొందుగుల (అమరావతి మండలం) గ్రామానికి పశ్చిమంగా, కస్తల (అచ్చంపేట మండలం) గ్రామానికి తూర్పుగా పుట్టిపాడు ఉండేది. సాక్షిగా పుట్టిపాడు ఆంజనేయస్వామి ఆలయం ఉంది. ఇక్కడ నుండి కృష్ణ ఆవలి ఒడ్డుకు పుట్టి (గుండ్రటి బుట్టవంటి చిన్నపడవ) నడిపేవారు కనుక ఈ గ్రామానికి పుట్టిపాడు అను పేరు వచ్చిందంటారు. ప్రభుత్వ రెవిన్యూ రికార్డుల్లో పుట్టిపాడు పేరు ఉంది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో పుట్టిపాడును చూడవచ్చు.

**ఆధారం:** అమరావతి వాస్తవ్యులు వావిలాల సుబ్బారావు ఇచ్చిన సమాచారం.

## 13. క్రపగఊపురి

క్రీ.శ. 1167 యర్రబాలెం (మంగళగిరి మండలం) శాసనంలో చందోలు (పిట్టలవానిపాలెం మండలం) రాజధానిగా పాలిస్తున్న వెలనాటి 'రాజేంద్ర కులోత్తుంగ చోడ (క్రీ.శ. 1160-1181) కు ధర్మంగాను ఉండవల్లి (తాడేపల్లి మండలం) మహాజనం నకు జిల్యబోయుడు క్రపగఊపురి' గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 162

## 14. గడ్గోనాటకూరు

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1289-1323) కి పుణ్యంగాను ఇందుకూరి గన్నప్రెగ్గడ కొడుకు అక్కదేవుడు ఉండవల్లి (తాడేపల్లి మండలం) అనంతశయనస్వామికి గడ్గోనాటకూరు గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 42.

## 15. ఉత్తర పొట్టాపురం, ఉత్తర కోపల్లె

మెకంజి రిపోర్టు వలన ఈ రెండుగ్రామాలు కలిసిపోయి 'ఒకేపల్లి' గ్రామంగా ఏర్పడ్డాయని తెలుస్తుంది. ఈ రెండు గ్రామాలు కలిసి 'ఒకేపల్లి'గా ఏర్పడ్డాయా? లేక 'ఒకేపల్లి' అనేది వేరే గ్రామమా? అనేది పరిశీలించాలి. మంగళగిరి తాలూకా లేక సత్తెనపల్లి తాలూకాలో ఈ గ్రామాలు ఉండవచ్చని అంచనా. తెనాలి మండలంలో కోపల్లె పేరుతో గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65

## 16. దేవవరం

క్రీ.శ. 13వ శతాబ్ది రావిపూండి (రాయపూడి, తుళ్ళూరు మండలం) శాసనంలో దేవావురపు తెరువు (బాట) ప్రస్తావన ఉంది. శాసనం అసంపూర్ణంగా ఉంది. ఇప్పుడు ఈ ప్రాంతంలో దేవవరం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 458.

## 17. ఒంకదొన

క్రీ.శ. 1182లో వేల్పూరు శాసనంలో ధరణికోట రాజధానిగా పరిపాలించిన రెండవ కోట కేతరాజు (క్రీ.శ. 1182-1231) వేల్పూరు (అచ్చంపేట మండలం) రామేశ్వరదేవరకు కొండనతవాడి, దొడ్డికంద్రవాడి ప్రాంతాలలో చాలా గ్రామాలు దానంగా ఇచ్చినట్లు ఉంది. అందులో ఒంకదొన గ్రామం ఉంది. కొండనతవాడి ప్రాంతం అచ్చంపేట, బెల్లంకొండ, రాజుపాలెం, క్రోసూరు? మండలాలలో ఉంది. దొడ్డికంద్రవాడి ప్రాంతం సత్తెనపల్లి తాలూకాలో ఉన్నదని పరిశోధకులు భావించారు. ఒంక (వంక) అంటేవాగు, దొన అంటే కొండపై నీరు ఉన్న పల్లపు ప్రదేశం కావున ఒంకదొనను వాగుదొన గ్రామంగా భావించాలి. వాగుదొన గ్రామం తుళ్ళూరు మండలంలో ఉన్న అనంతవరం గ్రామానికి కూతవేటు దూరంలో పడమరదిశలో ఉండేది. స్థానికులు ఇక్కడ (వాగుదొన) గ్రామం ఉండేదని చెబుతారు.

అక్కడ ఉన్న అనంతవరం గ్రామాన్ని వాగుదొౌన అనంతవరం అని పిలుస్తారు. దొడ్డికంద్రవాడి పరిధిలో ఆత్మకూరు (మంగళగిరి మండలం) గ్రామం కూడా ఉంది. కనుక దొడ్డికంద్రవాడి రాజధాని తాడికొండ, కంతేరు (తాడికొండ మండలం)లలో ఒకటి కావచ్చు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 199, 288.
2. మిత్రులు అనంతవరం (తుళ్ళూరు మండలం) గ్రామస్థులు పారా అశోక్‌కుమార్ ఇచ్చిన సమాచారం.

## 18. వీరంభట్లపాలెం

క్రీ.శ. 1558 మంగళగిరి శాసనంలో విజయనగరచక్రవర్తి సదాశివరాయలు పాలన (క్రీ.శ. 1542-1576) లో కొండవీడు పాలకుడు సిద్ధిరాజు తిమ్మరాజు (క్రీ.శ. 1554-1561) (అళియరామరాయల మేనల్లుడు) పానకాల నరసింహస్వామికి వీరంభట్లపాలెంలో కొంతభూమి దానం ఇచ్చాడు. వీరంభట్లపాలెం హద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 4, సీరియల్ నెం. 709.

## 19. గారలపాడు (గార్లపాడు)

కోటబేతరాజు ఉంగుటూరు (అమరావతి మండలం) శాసనం (తేదీ తెలియదు) లో గారలపాడు ప్రస్తావన ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. గుంటూరుజిల్లాలో అనేక గార్లపాడు గ్రామాలు ఉన్నాయి. ఈ గారలపాడు గ్రామం ఉంగుటూరు సమీపానా? లేక అనేక గార్లపాడు గ్రామాల్లో ఒకటా? తెలియవలసి ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 391.

# నరసరావుపేట తాలూకా

1. నరసరావుపేట మండలం
2. రొంపిచర్ల మండలం
3. నకిరికల్లు మండలం

# 1. అట్లూరు (విలీనగ్రామం)

నరసరావుపేట ఏర్పడకముందు ఆ ప్రాంతంలో అట్లూరు (పాతూరు/పాతఊరు) ఉండేది. అట్లూరు భీమేశ్వరాలయంలోని క్రీ.శ. 1159, 1244, 1264 శాసనాలలో అట్లూరు గ్రామాన్ని అట్టలూరు అని పేర్కొన్నారు. అట్లూరి వేంగళేంద్రుడు గజపతుల కాలంలో కొండపల్లి పాలకుడు. అట్లూరు గ్రామపెత్తందార్లు వెలమలైన కటికినేనివారు. నరసరావుపేట జమీందారులైన మల్రాజువారు వీరి బంధువులు. బెల్లంకొండసీమ, వినుకొండసీమ ప్రాంత గ్రామాలపై పాలకుడుగా ఉన్న మల్రాజు వేంకట పెదగుండారాయనింగారు (క్రీ.శ. 1769-1819) బెల్లంకొండ, వినుకొండకు సమదూరంలో ఉన్న అట్లూరు గ్రామం వద్ద తన తండ్రి వేంకటనరసింహారావు (నరసారావు) పేర క్రీ.శ. 1797లో నరసింహారావుపేటను నిర్మించాడు. అది కాలక్రమేణా నరసరావుపేటగా మారింది. నరసరావుపేటలో అట్లూరు కలిసిపోయింది. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో 2644 పగోడాలను అట్లూరు గ్రామశిస్తుగా మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించాడు. అట్లూరి ఇంటి పేరుతో కమ్మ, రెడ్డి మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**


1. నరసరావుపేట పురపాలకసంఘం శతవసంతోత్సవసంచిక, 2015. పుట: 7, 174.
2. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 80.
3. చిలకలూరిపేట వాస్తవ్యులు మన్నె కుమారస్వామి ఇచ్చిన సమాచారం.

## 2. నరసింహాపురం

క్రీ.శ. 1554 నకరికల్లు శాసనంలో విజయనగరచక్రవర్తి సదాశివరాయలు పాలన (క్రీ.శ. 1542-1576) లో బెల్లంకొండ పాలకుడు జిల్లెళ్ళ వెంగళయ్యదేవమహారాజు (క్రీ.శ. 1554-1559) నగరెకంటీశ నరసింహస్వామికి నగిరకంట్టి (నకరికల్లు) చెరువు క్రింది మాగాణిపొలాన్ని, నరసింహాపురం గ్రామాన్ని దానం చేసినట్లు ఉ ంది. నకరికల్లు (మండలకేంద్రం) నుండి నరసింహస్వామి కొండకు వెళ్లే మార్గంలో నరసింహాపురం ఉండేది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 189.
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 19.

## 3. నల్ల అనంతవరం

మాచవరం (రొంపిచర్ల మండలం) గ్రామానికి దక్షిణదిశగా ఓగేరు తీరాన నల్ల అనంతవరం ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఈ ప్రాంతంలో నల్ల అనంతవరపు ఆంజనేయస్వామి ఆలయం ఉంది. మాచవరం, నల్లగార్లపాడు (రొంపిచర్ల మండలం) గ్రామస్థులు ఈ ఆలయానికి వచ్చి పూజలు చేస్తారు. ఈ గ్రామకరణాలు ఆర్వేల నియోగులైన కౌశికసగోత్రులు పరగటిచర్లవారు, నందవరీకులైన విశ్వామిత్రసగోత్రులు బొడ్డుచర్లవారు.

**ఆధారం:**

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 5.
2. మాచవరం గ్రామస్థులు గాదె చిన్నపరెడ్డి ఇచ్చిన సమాచారం.

# 4. గుంటగార్లపాడు

నరసరావుపేటకు ఉత్తరంగా 3 కి.మీ. దూరంలో గుంటగార్లపాడు ఉండేది. అక్కడున్న చెరువుకట్టపై రెండు శాసనాలు ఉన్నాయట. గుంటగార్లపాడు ఆంజనేయస్వామి ఆలయం కూడా అక్కడే ఉంది. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో ఆ గ్రామశిస్తుగా 771 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించారు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో గుంటగార్లపాడును చూడవచ్చు. గుంటూరుజిల్లాలో అనేక గార్లపాడు గ్రామాలుండుట చేత ఈ గ్రామాన్ని గుంటగార్లపాడు అనేవారు.

**ఆధారం:**

1. నరసరావుపేట తాలూకా, గ్రామచరిత్ర, విష్ణుభొట్ల సూర్యనారాయణ, గుంటూరు, 1964, పుట: 26, 27.
2. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 81.

# 5. పోతవరప్పాడు

నరసరావుపేట మండలం జొన్నలగడ్డ గ్రామానికి దక్షిణంగా పోతవరప్పాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో పోతవరప్పాడును చూడవచ్చు. ఈ గ్రామానికి పడమటి పోతవరం అని పేరుండేది. చిలకలూరిపేట జమీందారులైన మానూరివారి ఆధీనంలో ఈ గ్రామం ఉండేది. మానూరివారే అద్దంకి తాతాచార్యులకు ఐదు వరహాలకు ఈ గ్రామాన్ని ఇచ్చారు. (దక్షిణ) పోతవరం గ్రామం చిలకలూరిపేట మండలంలో ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 68.
2. నాదెండ్ల గ్రామస్థులు మన్నె కుమారస్వామి ఇచ్చిన సమాచారం.

## 6. నక్కలపాడు

క్రీ.శ. 1265 రొంపిచర్ల (మండలకేంద్రం) వేణుగోపాలస్వామి ఆలయశాసనంలో 'నక్కలపాటి పడుమటను గోంగులపాటి (గోగులపాడు, రొంపిచర్ల మండలం) తెరువు' (బాట) అని ఉంది. ఇప్పుడు నక్కలపాడు గ్రామం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 406.

## 7. ద్విజవరం

క్రీ.శ. 1155 పమిడిపాడు (నరసరావుపేట మండలం) శాసనంలో 'ద్విజవర గ్రామే రమావల్లభం సంస్థాప్య..' అని ఉంది. నేడు ద్విజవరం గ్రామం లేదు. పమిడిపాడు గ్రామంలో నేటికీ రమావల్లభాలయం ఉంది. ద్విజవరం నుండి రమావల్లభస్వామిని పమిడిపాడుకు తెచ్చెనా?లేదా ద్విజవరమే పమిడిపాడుగా మారినదా! తెలియవలసి ఉన్నది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 135.

## 8. బెహరావారిపాలెం (ప్రతినామగ్రామం)

విప్పర్ల (రొంపిచర్ల మండలం) గ్రామసమీపాన బెహరావారిపాలెం ఉండేది. బెహరావారు బరంపురం బ్రాహ్మణులు, బెల్లంకొండ అగ్రహారీకులు. ఇప్పుడు బెహరావారిపాలేన్ని మర్రిచెట్టుపాలెంగా పిలుస్తున్నారు.

ఇది అదృశ్యగ్రామం కాదు. ప్రతినామగ్రామానికి ఒక ఉదాహరణ.

**ఆధారం:** నరసరావుపేట వాస్తవ్యులు స్వర్ణ చినరామిరెడ్డి, ఈవూరి వెంకటరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 9. నందిపాడు

గురవాయపాలెం (నరసరావుపేట మండలం) సమీపాన ఉన్న శిథిల శివాలయం ప్రాంతంలో నందిపాడు గ్రామం ఉండేది. హద్దులు తెలియలేదు.

**ఆధారం:** ఉయ్యూరు (కృష్ణాజిల్లా ) వాస్తవ్యులు గబ్బిట దుర్గాప్రసాద్ ఇచ్చిన సమాచారం.

# పలనాడు తాలూకా

1. మాచర్ల మండలం
2. గురజాల మండలం
3. దాచేపల్లి మండలం
4. పిడుగురాళ్ళ మండలం
5. మాచవరం మండలం
6. రెంటచింతల మండలం
7. కారంపూడి మండలం
8. వెల్దుర్తి మండలం
9. దుర్గి మండలం

## 1. బేత (బేతపురం?)

క్రీ.శ. 12వ శతాబ్ది(?) నడికుడి (దాచేపల్లి మండలం) ముక్తీశ్వరాలయశాసనంద్వారా నాగులేరు దగ్గర రేచర్ల బేతరాజు పేరున బేత గ్రామం ఉన్నట్లు తెలుస్తున్నది. ఇప్పుడు అక్కడ బేత పేరుతో గ్రామం లేదు.

'కృష్ణవేణీ నదీతీర దక్షిణే నదుకుద్యయం (నడికుడి) నాగేశ్వరీనదీ (నాగులేరు) ప్రాచీ దక్షిణే ప్రిణుబంధనం క్రిష్ణ స్వల్పతటాకం చ పశ్చిమే ఖారి శిమ్ని చ! గెజ్జెగా సరసీశక్తి ఉత్తరే కరిణీశిలా! చతుస్సీమమిదం జ్ఞాత్వా బేతనామపుర భవేత్'

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 67.

## 2. మేదరా

క్రీ.శ. 16వ శతాబ్ది జానపాడు (పిడుగురాళ్ళ మండలం) శాసనంలో తంగెడ (దాచేపల్లి మండలం) సీమలో పిడుగురాళ్ళ సమీపంలో మేదరా ఉన్నట్లు తెలుపబడింది. శాసనం శిథిలం అవడంతో గ్రామ హద్దులను తెలుసుకునేందుకు సాధ్యపడలేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 85.

## 3. ద్రప్పిచెర్ల

క్రీ.శ. 1288 పులిపాడు (గురజాల మండలం) శాసనంలో ద్రప్పిచెర్ల ప్రస్తావన ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. కారంపూడి మండలంలో ఉన్న ఒప్పిచర్ల గ్రామం ద్రప్పిచెర్ల గ్రామమేమో? పరిశీలన చేయవలసి ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 47.

## 4. రామడక

క్రీ.శ. 1518 రామడక శాసనంలో విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయల పాలన (క్రీ.శ. 1509-1529) లో నాగార్జునకొండ పాలకుడైన తిమ్మరినాయకుడు 'కృష్ణదేవరాయల పుణ్యంగాను రామదుక' గ్రామాన్ని మాచర్ల చెన్నకేశవునికి దానం చేసినట్లు ఉంది. పట్లవీడు (వెల్దుర్తి మండలం) కి రామడక శివారుగ్రామం. క్రీ.శ. 1619 మాచర్ల చెన్నకేశవాలయశాసనంలో రామడక భూదాన ప్రస్తావన ఉంది.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్స్: 40, సీరియల్ నెం. 104.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్స్: 10, సీరియల్ నెం. 756.
3. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.


## 5. అయ్యగారిపాలెం

పొందుగుల (దాచేపల్లి మండలం) శివారు గ్రామమైన శ్రీనివాసపురంనుండి పులిపాడు (గురజాల మండలం) రహదారిలో శిథిల జల్పేశ్వరాలయానికి (బొబ్బనాగమ్మ ఆలయమని స్థానికుల వాడుక) దక్షిణంగా అరకిలోమీటరు దూరంలో దిండివాగు సమీపాన అయ్యగారిపాలెం ఉండేది. క్రీ.శ.1924 గుంటూరుజిల్లా పాతమ్యాపులో అయ్యగారిపాలెం కనిపిస్తుంది. అప్పట్లో ఈ గ్రామం తమలపాకు తోటలకు ప్రసిద్ధి.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా దేవాలయాల చరిత్ర, నాగార్జునకొండ పిచ్చయ్య, పిడుగురాళ్ళ, 2006, పుట: 35, 36.
2. శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక (పునర్ముద్రణ), సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ, గుంటూరు, 2015, పుట: 297, 298.

## 6. కోమటిపేట

తేరాల (దుర్గి మండలం) గ్రామ పెద్దచెరువు (బ్రహ్మానాయుడు చెరువు) సమీపాన సిద్దులయ్యగుట్టల వద్ద కోమటిపేట ఉండేది. తేరాలచెరువు (పెద్దచెరువు) నిర్మాణంతో కోమటిపేట మునిగిపోయిందని స్థానికులు చెబుతారు. అక్కడ ఈ గ్రామానికి సంబంధించిన ఆనవాళ్లు కనిపిస్తాయి.

**ఆధారం:** తేరాల సిద్దేశ్వరాలయ చరిత్ర, పావులూరి సతీష్‌బాబు.
మాచర్ల, 2018, పుట: 7.

## 7. శంఖులమఠం

తేరాల (దుర్గి మండలం) గ్రామ సమీపాన పాటిగడ్డ ప్రాంతంలో శంఖులమఠం ఉండేది. ఈ గ్రామం అదృశ్యమైనప్పటికీ నాలుగు శిథిలాలయాలు, అనేక శివలింగాలు ఇక్కడ ఉన్నాయి. గుప్తనిధుల కోసం కొందరు ఈ ప్రాంతాన్ని తవ్వి ధ్వంసం చేశారు. వర్షం పడినప్పుడు అక్కడక్కడ మట్టిపాత్రలు, బంగారు ఆభరణాలు బైటపడిన విషయాలను స్థానికులు చెబుతుంటారు.

**ఆధారం:** తేరాల సిద్దేశ్వరాలయ చరిత్ర, పావులూరి సతీష్‌బాబు.
మాచర్ల, 2018, పుట: 7.

## 8. గుండాల

కృష్ణదేవరాయల పాలన (క్రీ.శ. 1509-1529) లో వాకిట తిమ్మప్పనాయనింగారు నాగార్జునకొండ పాలకుడు. క్రీ.శ. 1518 దుర్గి శాసనంలో నాగార్జునకొండ సీమలోని దుర్గి పాలకుడైన వనజపల్లి పెదశింగమనాయనింగారు వాకిట తిమ్మప్పనాయనింగారి అనుమతితో దుర్గిలోని వీరేశ్వర, వంకేశ్వర దేవతలకు దుర్గి పొలంలోని గుండాల గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు ఉంది. దుర్గి, బుగ్గచెరువుల మధ్య ఆ గ్రామం ఉండేదని స్థానికులు చెబుతున్నారు. దుర్గికి దక్షిణ ఈశాన్యమున కొండల నడుమ గుండాల చెరువు ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 67

## 9. జల్పేశ్వరపురం

పొందుగుల (దాచేపల్లి మండలం) శివారుగ్రామమైన శ్రీనివాసపురంనుండి పులిపాడు (గురజాల మండలం) రహదారిలో దిండివాగు రెండుపాయల మధ్య మట్టిదిబ్బలపై శిథిల జల్పేశ్వరాలయం ఉంది. ఈ ఆలయం క్రీ.శ. 7, 8 శతాబ్దాలకు చెందినదిగా శాసనపరిశోధకులు గుర్తించారు. ఈ ఆలయాన్ని బొబ్బనాగమ్మ గుడి అంటారు. నాగమ్మ అనే రక్కసి బొబ్బలు (ఏడుపులు) పెడుతూ ఈ ప్రాంతంలో సంచరించేదని ప్రతీతి. జల్పేశ్వరాలయమున్న ప్రాంతంలోనే జల్పేశ్వరపురం ఉండేది. ఆనాడు ఇది విశ్వబ్రాహ్మణ కులక్షేత్రము.

8వ శతాబ్ది జల్పేశ్వరాలయ శాసనం:

స్వస్తి జల్పేశ్వర పురావరాధీశ్వరే విశ్వ
కర్మ కులతిలక దేవబహ్మానలబ్ధకోదన్డ
పఱగోషణ శ్రీమత్ కల్గరాభరణదా
తీక్షవ ప్రవరీచద్దచమేయెదభజే.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం: 57.
2. ప్రముఖ చారిత్రక పరిశోధకులు ఈమని శివనాగిరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 10. కళ్యాణపురం

చర్లగుడిపాడు (గురజాల మండలం) గ్రామానికి అతిదగ్గరలో కళ్యాణపురం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** చర్లగుడిపాడు గ్రామం వికీపీడియా.

## 11. గుండాల, మాల్యగండ్ల

క్రీ.శ. 1516 బసవనాయని బెల్లంకొండవారిపాలెం (మాచర్ల మండలం) శాసనంలో గుండాల తిరుమలదేవరకు నాగులవరం (మాచర్ల మండలం) నకు దక్షిణాన ఉన్న గుండాల, మాల్యగుండ్ల గ్రామాల్ని దానం ఇచ్చినట్లు ఉంది.

ఆధారం: ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక, 2015, అక్టోబరు. పుట: 44.

## 12. ఉబ్బేపల్లి

క్రీ.శ. 1223 కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199-1262) గామాలపాడు (దాచేపల్లి మండలం) శాసనంలో ఉబ్బేపల్లి స్వయంభూఃదేవర దానప్రసక్తి ఉంది. 14వ శతాబ్ది దాచేపల్లి శాసనంలో కూడా ఉబ్బేపల్లి ప్రసక్తి ఉంది. ఈ శాసనాలలో గ్రామహద్దులు తెలియపరచలేదు.

క్రీ.శ. 1391 తంగెడ శాసనంలో ఉచ్చపల్లి గ్రామ ప్రస్తావన ఉంది.

ఉచ్చపల్లి - ఉబ్బేపల్లి ఒకటేనా! అన్న విషయం పరిశోధన చేయవలసివుంది. దాచేపల్లికి ఉత్తరంగా ఉబ్బేపల్లి ఉండేదని నా అభిప్రాయం.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 60, 70.
2. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 565.

## 13. కొలయపాడు, చెంకమల్లునిపాడు

క్రీ.శ. 1103 సత్రశాల శాసనంలో మల్లవోలు (మాచవరం మండలం) పాలకుడు మందడి రేవినాయకుడు జెట్టిపాలెం దగ్గర సత్రశాల (రెంటచింతల మండలం)లో మూడు శివాలయాలు (బిజ్జేశ్వర, ముక్తేశ్వర, రేవేశ్వర) నిర్మించి, కొలయపాట, చెంకమల్లునిపాట పొలాలు దానం చేసినట్లు ఉంది. పాట అనే పదం కాలక్రమేణా పాటి, పాడుగా మారుతుంది. చెంకమల్లునిపాటకు పాలువాయి (రెంటచింతల మండలం) ఒకవైపు హద్దుగా కనిపిస్తుంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 181.

# 14. పులిచింతల ప్రాజెక్టు వలన ఖాళీ అయిన మాచవరం మండల గ్రామాలు

**1. వెల్లంపల్లి** : క్రీ.శ. 1373 తంగెడ శాసనంలో వెల్లంపల్లి (వెలుమపల్లి) ప్రస్తావన ఉంది.

**2. గోవిందపురం** : ఈ గ్రామంలో ప్రాచీన గౌతమేశ్వర (శివ) ఆలయం ఉంది.

**3. వేమవరం** : కొండవీడు రెడ్డిరాజ్య పాలకుడైన అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) పేరిట ఈ గ్రామం ఏర్పాటై ఉండొచ్చు. ఈ గ్రామంలో ప్రాచీన చిదంబర రామలింగేశ్వరాలయం ఉంది.

**4. రేగులగడ్డ** : కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1289 - 1323) పాలనలో క్రీ.శ. 1312లో స్థానికపాలకుడైన అ...దేవ మహారాజు రేగులగడ్డ గ్రామ మధ్యమున వల్లభదేవరను ప్రతిష్ఠించాడు. క్రీ.శ. 1373 తంగెడ శాసనంలో రేగులగడ్డ (రేంకులగడ్డ) ప్రస్తావన ఉంది.

**5. (న)ల్లపల్లి** : విజయనగరచక్రవర్తి సదాశివరాయలు పాలన (క్రీ.శ.1542-1576) లో క్రీ.శ. 1561లో తంగెడ పాలకుడైన పెమ్మసాని తిమ్మానాయనింగారి అనుమతితో పెదసూ(ర)య్య (న)ల్లపల్లి కేశవమూర్తి ఆలయాన్ని పునర్నిర్మాణం చేయించాడు. నల్లపల్లి గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 73, 74.
2. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 557.

## 15. బయ్యనపాడు, ఉచ్ఛపల్లి

క్రీ.శ. 1391 తంగెడ శాసనంలో కొండవీడు పాలకుడైన కుమారగిరిరెడ్డి పాలన (క్రీ.శ. 1386 - 1402) లో తంగెడ పాలకుడు చొక్కన సింగన అనంతగిరి నరసింహస్వామికి తంగెడ సమీపంలోని ఈ దిగువ పేర్కొన్న 15 గ్రామాలలో భూమిని దానంగా ఇచ్చినట్లు ఉంది. వాటిలో మూడు అదృశ్యగ్రామాలు.

**1. గోగులపాట** : (గోగులపాడు, గురజాల మండలం)

**2. దాసపల్లి** : (దాచేపల్లి, మండలకేంద్రం)

**3. పినగార్లపాట** : (చినగార్లపాడు, కారంపూడి మండలం)

**4. కర్లపాట** : (కరాలపాడు, పిడుగురాళ్ళ మండలం)

**5. బయ్యనపాట** : (బయ్యనపాడు) అదృశ్యగ్రామం

**6. ఆకరాజుపల్లి** : (ఆకురాజుపల్లి) అదృశ్యగ్రామం. మాచవరం మండలం కొత్తపాలెందగ్గర. (ప్రత్యేకవ్యాసం ఉంది).

**7. కొత్తపల్లి** : (కొత్తపాలెం, మాచవరం మండలం)

**8. కాచవరం** : (కారంపూడి మండలం)

**9. తక్కెళ్ళపాట** : (తక్కెళ్ళపాడు, దాచేపల్లి మండలం)

**10. చింతపల్లి** : (కారంపూడి మండలం)

**11. తుమ్మలచెరువు** : (పిడుగురాళ్ళ మండలం)

**12. అనుంగుబల్లి** : (అలుగుమల్లిపాడు, దాచేపల్లి మండలం)

**13. గార్లపాట** : (పెదగార్లపాడు, దాచేపల్లి మండలం)

**14. బూదవాడి** : (బూదవాడ, గురజాల మండలం)

**15. ఉచ్ఛపల్లి** : (అదృశ్యగ్రామం) దాచేపల్లి పరిసరాలలో ఉండవచ్చని అంటున్నారు. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 565.

## 16. పింగళి

పిన్నెల్లి (మాచవరం మండలం) గ్రామానికి ఉత్తరంగా కృష్ణానది తీరాన 'పింగళి' ఉండేది.

క్రీ.శ. 1163 పింగళి శాసనంలో గురజాల ప్రభువు అనుగురాజు శ్రేయస్సు కోరి అమరేశ్వరపండితుడి నలుగురు కుమారులు పింగళిగ్రామ రామేశ్వరమహాదేవాలయ అఖండదీపానికి 50 మేకలను దానం చేసినట్లు ఉంది.

కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199-1262) క్రీ.శ. 1223 గామాలపాడు (దాచేపల్లి మండలం) శాసనంలో 'పింగళి తెరువు'(బాట) ప్రస్తావన ఉంది.

క్రీ.శ. 1292 పింగళి శాసనంలో మడపల్లి పురాధిపతి (బొ)ల్లనాయనింగారు పింగళి భీమనాథ ఆలయాన్ని పునర్నిర్మించి పింగళి గ్రామాన రేగడిపొలం దానంగా ఇచ్చినట్లు ఉంది.

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1289 - 1323) క్రీ.శ. 1299, క్రీ.శ. 1311 ఒప్పిచర్ల (కారంపూడి మండలం) శాసనాలలో కాకతీయ గజసాహిణి గుండయనాయకుడు (క్రీ.శ. 1299 - 1311) గురజాల, పింగళి క్షేత్రాలకు పాలకుడని తెలుపబడింది.

క్రీ.శ. 1341? పింగళి శాసనంలో అల్లాడనాయనింగారు తన తండ్రి నబ్బెయనాయనింగారికి, తన తోడబుట్టినవారికి పుణ్యంగా పింగళి రామనాథాలయానికి స్వర్ణకలశాన్ని దానంగా ఇచ్చినట్లు ఉంది.

కొండవీడు పాలకుడైన అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) క్రీ.శ. 1364లో కొర్రపాడు (మేడికొండూరు మండలం) గ్రామస్థుడు సోమశేఖర మహాపాత్రుని కుమారులైన సోమరాజయ్య, వీరభద్రప్పలకు పింగళిగ్రామం అగ్రహారంగా దానం ఇచ్చారు. అందువలన వారి ఇంటిపేరు పింగళి గా స్థిరపడింది. వీరు భారద్వాజసగోత్రులు. వారిలో కొందరు వలస పోయి కృష్ణానదికి ఆవల గోకరాజుపల్లె (వీరులపాడు మండలం, కృష్ణాజిల్లా) గ్రామాన్ని నిర్మించుకున్నారు.

క్రీ.శ. 1373 తంగెడ శాసనంలో అనవేమారెడ్డి పాలన (క్రీ.శ. 1364-1386) లో అవుభళనాథునిదేవలెంక తంగెడ గోపీనాథస్వామికి తంగెడ పొలాన పింగళి

సందు కట్టను వెలిచేను పుట్టెడును మాచమరెడ్డి పుణ్యంగా ఇచ్చినట్లు ఉంది.

క్రీ.శ. 1394 తంగెడ శాసనంలో కుమారగిరిరెడ్డి (క్రీ.శ. 1386-1402) కి పుణ్యంగా తంగెడ గోపీనాథస్వామికి తంగెడ సందు పింగళి పొలాన ఇచ్చిన చేను అని ఉంది.

క్రీ.శ. 14వ శతాబ్ది తంగెడ శాసనంలో కుమారగిరిరెడ్డి పాలన (క్రీ.శ. 1386-1402) లో తంగెడ పాలకుడైన చొక్కన సింగన, మరికొందరు తంగెడ గోపీనాథస్వామికి చేసిన దాన ప్రస్తావనలో గోపినేనింగారు పింగళి తంగెడసంద కట్టున అని ఉంది.

పింగళి గ్రామస్థుడు గోకనామాత్యుడు తమ పూర్వుడని, తమ బంధువులు పలనాడు, పాకనాడులలో ఉన్నారని, 16వ శతాబ్దికి చెందిన పింగళి సూరన (నంద్యాల దగ్గర పెదకానాల గ్రామస్థుడు) తన 'ప్రభావతీ ప్రద్యుమ్నము' కావ్యంలో చెప్పుకున్నాడు.

17వ శతాబ్దికి చెందిన కాకునూరి అప్పకవి (కామేపల్లి, బెల్లంకొండ మండలం) తన 'అప్పకవీయం'లో తంగెడసీమలోని నాగులేరుకి తూర్పుగా, పింగళికి దక్షిణంగా కామేపల్లి ఉందని చెప్పాడు.

గోకరాజుపల్లె గ్రామస్థుడు పింగళి వెంకటకృష్ణారావు తమ పూర్వులు రచించిన శ్రీసీతాపతిశతకము (1907) పునర్ముద్రణలో పింగళి గ్రామం ఉనికిని సాహిత్యాధారాలతో నిరూపించారు.

కృష్ణానదికి ఆవల తెలంగాణలో అడ్లూరు (మల్లారెడ్డిగూడెం మండలం, సూర్యాపేటజిల్లా) గ్రామంలో పింగళి ఇంటిపేరు కల రెడ్లు ఉన్నారు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 155.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 60.
3. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 472.
4. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 488, 500.
5. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 549.

6. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 139, 140.
7. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 557.
8. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 566.
9. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 567.
10. పీఠిక, ప్రభావతీ ప్రద్యుమ్నము పింగళి సూరన, పద్యం: 13, 18, 19.
11. పీఠిక, అప్పకవీయం కాకునూరి అప్పకవి, పద్యం: 101.
12. శ్రీసీతాపతిశతకము, సంపాదకుడు: పింగళి వెంకటకృష్ణారావు, విజయవాడ, 2007. పుట. 12-39.

## 17. మత్కుబల్లి (ముతుకుమల్లి)

16వ శతాబ్ది గన్నవరం (మాచర్ల మండలం) శాసనంలో నాగార్జునకొండ పాలకుడైన వెలుగోటి నరసప్ప మత్కుబల్లి గ్రామంలో రామరాజు శంకరంగారి గణపరాజుకు భూమి దానం ఇచ్చినట్లు ఉంది. నేడు గన్నవరంలో మత్కుబల్లి (ముతుకుమల్లి) కలిసిపోయింది. గన్నవరం గ్రామస్థులు మాత్రం ఈ ప్రాంతాన్ని ముతుకుమల్లి అని ప్రత్యేకంగా పిలుస్తారు.

గన్నవరం శాసనంలోనే 'కొత్తఊరు' గ్రామ ప్రస్తావన ఉంది. మాచర్ల మండలంలో ఉన్న కొత్తూరు ఈ కొత్తఊరు కావచ్చు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 168.
2. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

'మతుకుమల్లి' పేరుతో శావల్యాపురం మండలంలో కూడా ఓ గ్రామం ఉంది. ఈ గ్రామాన్ని క్రీ.శ. 1116లో కొణిదెన (ప్రకాశంజిల్లా) పాలకుడు కన్నరదేవచోడ మహారాజు బాపట్ల భావనారాయణస్వామి దేవస్థానానికి సర్వకరపరిహారంగా దానం చేసినట్లు ఆ దేవాలయ ఉత్తరప్రాకారమందలి శిలాశాసనం తెలియజేస్తుంది. నాడు ఈ గ్రామం పేరు 'మధుకంబల్లి'.

**ఆధారం:** బాపట్ల శ్రీభావనారాయణస్వామి ఆలయచరిత్ర, తిమ్మన శ్యామ్‌సుందర్, బాపట్ల 2016, పుట: 140-141.

## 18. అల్లువాలు, మూపరు, చువికంది

తూర్పు చాళుక్యరాజు మొదటి విజయాదిత్యుని (క్రీ.శ. 753-770) అల్లువాలు తామ్రశాసనంలో అల్లువాలు గ్రామానికి ఉత్తరాన మూపరు, దక్షిణాన జువికలు (జూలకల్లు, పిడుగురాళ్ళ మండలం), పశ్చిమాన చింతపలి (చింతపల్లి, కారంపూడి మండలం), తూర్పున చువికంది హద్దులుగా చెప్పబడినవి. అల్లువాలు, మోపరు, చువికంది నేడు లేవు. జూలకల్లు, చింతపల్లి అల్లువాలు గ్రామహద్దులుగా అప్పటి రీతిగా ఇప్పుడు లేవు. జూలకల్లు, చింతపల్లి స్థలమార్పు ఇందుకు కారణం. అలవాల (అల్లువాలు) ఇంటి పేరుతో రెడ్డి కులస్థులు పల్నాడుప్రాంతంలో అధికసంఖ్యలో ఉన్నారు.

**ఆధారం:**

1. ఎపిగ్రాఫియా ఆంధ్రికా, 3వ భాగం. పుట: 3
2. ఎపిగ్రాఫియా ఇండికా, 35వ భాగం, సీరియల్ నెం. 36.
3. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 19. మలిదేవపాడు, కంబాలపాడు

వెల్దుర్తి మండలం ఉప్పలపాడు గ్రామానికి దక్షిణదిశలో ఒక కి.మీ. దూరంలో మలిదేవపాడు, కంబాలపాడు ఉండేవి. ఆ గ్రామాలు అంటురోగాల బారినపడి అదృశ్యమయ్యాయంటారు. ఉప్పలపాడు గ్రామస్థులు ఆ ప్రాంతాన్ని మలిదేవపాడు పొలాలు, కంబాలపాడు పొలాలని పిలుస్తారు. మలిదేవపాడు పొలాలలో ఉన్న ప్రాచీన శివాలయంలో ఉప్పలపాడు గ్రామస్థులు ఏడాదికోసారి పూజలు నిర్వహిస్తారు. ఉప్పలపాడు తూర్పుదిశలో పాటిదిబ్బలపై ఓ శిథిలాలయం ఉంది. అక్కడ కూడా ఓ గ్రామం ఉండేదంటారు. మలిదేవపాడును మల్లేపల్లి అని కూడా పిలిచేవారు.

**ఆధారం:** ఉప్పలపాడు (వెల్దుర్తి మండలం) గ్రామస్థులు సిరికొండ చక్రపాణి ఇచ్చిన సమాచారం.

## 20. వజ్రాలపాడు

శిరిగిరిపాడు (వెల్దుర్తి మండలం) గ్రామానికి దక్షిణాన 6 కి.మీ. దూరంలో వజ్రాలపాడు ఉండేది. ఇక్కడ ఒక చెరువు, శివాలయం, ఆంజనేయస్వామి ఆలయం ఉన్నాయి. సమీప గ్రామస్థులు ఈ చెరువును వజ్రాలపాడు చెరువు అంటారు. శివ, ఆంజనేయ ఆలయాలలో పూజాదికాలు నిర్వహిస్తారు. ఇటీవల చెంచులు కొందరు వజ్రాలపాడు అదృశ్యగ్రామ పరిసరాల్లో వజ్రాలపాడుతండ అను గ్రామాన్ని నిర్మించుకున్నారు. వజ్రాలపాటి ఇంటిపేరుగల కొన్ని కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** శిరిగిరిపాడు గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 21. భట్రువారిపల్లె పరిసర అదృశ్యగ్రామాలు

కారంపూడి మండలం శంకరాపురం గ్రామపరిధిలో గాదెవారిపల్లె, భట్రువారిపల్లె, ఇనపరాజుపల్లె, కాచవరం ఉండేవి. శంకరాపురం భట్రువారిపల్లె గ్రామంలో కలిసిపోయింది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో శంకరాపురం కనిపిస్తుంది. అలాగే శంకరాపురం దగ్గర కాడిబోయినపల్లి, మేడిబోయినపల్లి ఉండేవి. ఇప్పుడు లేవు. వాటి హద్దులు గుర్తింపబడలేదు. భట్రువారిపల్లె గ్రామంలో ఉన్న ఆంజనేయస్వామిని కాడిబోయినపల్లి ఆంజనేయస్వామి అని భక్తులు కొలుస్తారు. వెల్దుర్తి మండలంలో కూడా శంకరాపురం అదృశ్యగ్రామం కలదు.

**ఆధారం:** శంకరాపురం గ్రామ పూర్వసర్పంచ్ చితిరాల అంకారావు
ఇచ్చిన సమాచారం.

## 22. యాపకంపల్లి

గురజాల మండలం గొట్టిముక్కల మరియు సమాధానపురం గ్రామాలకు చేరువలో కృష్ణానదీతీరాన యాపకంపల్లి ఉండేది. కృష్ణానది ఆవలి ఒడ్డున ఉన్న ముదిమాణిక్యం (నల్లగొండజిల్లా, తెలంగాణ) రేవు ద్వారా దొంగలు తరచు వచ్చి యాపకంపల్లి గ్రామాన్ని దోచుకునేవారు. దొంగలభయంతో ప్రజలు గ్రామాన్ని ఖాళీ చేశారు. అక్కడ వేంకటేశ్వరస్వామి ఆలయం, అనేక మొండిగోడలు దర్శనమిస్తుంటాయి. పంటపొలాలు గొట్టిముక్కల, సమాధానపురం గ్రామాల పొలాలలో కలిసిపోయాయి. కారంపూడి మండలంలో కూడా యా(వే)పకంపల్లి పేరుతో గ్రామం ఉంది.

**ఆధారం:** గొట్టిముక్కల గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 23. యక్కలపాలెం

మండలకేంద్రమైన గురజాలకు తూర్పున ఉన్న అంబాపురం (గురజాల మండలం) సమీపంలో యక్కలపాలెం ఉండేది. యక్కలపాలెం పొలాలు పల్లిగుంట (గురజాల మండలం), గంగవరం (గురజాల మండలం) పొలాలలో కలిసిపోయాయి. అంబాపురంలో ఓ బజారును యక్కలపాలెం బజారుగా పిలుస్తారు. యక్కల ఇంటిపేరుగల వైశ్యులు పల్నాడు ప్రాంతంలో ఉన్నారు.

పలనాటి జమీందార్లు రామరాజు మంత్రప్ప దేశాయి వంశీయులు 18వ శతాబ్దిలో తమ ఇలవేల్పు అంబ పేరున అంబాపురం గ్రామాన్ని నిర్మించినట్లు చెబుతారు.

**ఆధారం:**

1. పలనాటి చరిత్ర, రావిపాటి లక్ష్మీనారాయణ, రావిపాడు, నరసరావుపేట, 1953. పుట: 50, 51.
2. గురజాల గ్రామస్థులు జమ్మిగుంపుల రామారావు ఇచ్చిన సమాచారం.

## 24. వీరలక్ష్మీపురం

మండలకేంద్రమైన కారంపూడికి ఉత్తర వాయవ్యంగా ఒప్పిచర్ల (కారంపూడి మండలం) గ్రామానికి అతి చేరువలో వీరలక్ష్మీపురం ఉండేది. రెవిన్యూ రికార్డులలో, గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు. వీరలక్ష్మీపురం గ్రామస్థులు కారణాంతరాల వలన ఆ గ్రామాన్ని వీడి కారంపూడి, గురజాల రహదారిలో లక్ష్మీపురం అను కొత్త గ్రామాన్ని నిర్మించుకున్నారు.

**ఆధారం:** లక్ష్మీపురం (కారంపూడి మండలం) గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 25. నెయ్యూరు (ఎయ్యూరు)

కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199 - 1262) కాలంలో కాయస్థ గంగయ సాహిణి (క్రీ.శ. 1244-1258) పానగల్లు (తెలంగాణ)-మార్జవాడి (కోలారు? కర్ణాటక) ప్రాంతాల పాలకుడు. అతనికి మంత్రి, దుర్గి(గుంటూరుజిల్లా) ప్రాంత పాలకుడైన నామదేవ పండితుడు తన తండ్రి వాయిపండితుడి పేర క్రీ.శ. 1251 లో దుర్గిలో వంకేశ్వరదేవరను ప్రతిష్ఠించి కృష్ణానది సమీపాన నాగార్జునికోట (నాగార్జునకొండ) తూర్పున 'నెయ్యూరు' గ్రామాన్ని, చెరువును ఏర్పరిచాడు. నెయ్యూరు గ్రామానికి ఉత్తరాన ఎర్రగుట్ట, దక్షిణాన ఏలేశ్వరం (సాగర్ ప్రాజెక్ట్ లో ముంపు గ్రామం) వెళ్లేదారి, నైఋతిన నింగల్లుగుట్ట, పశ్చిమాన నాగార్జునికోటలోనారిగుట్ట, వాయవ్యాన దరిసవాగు, మిగిలిన అన్ని దిక్కులలో రాళ్ళగుట్టల వంటి చిన్నకొండలు సరిహద్దులుగా పై శాసనంలో చెప్పబడ్డాయి.

**ఆధారం:**

1. కాయస్థ రాజులు, సంపాదకుడు: భిన్నూరి నరసింహశాస్త్రి, హైదరాబాద్, 1999, పుట: 60.
2. పిడుగురాళ్ళ వాస్తవ్యులు నాగార్జునకొండ పిచ్చయ్య ఇచ్చిన సమాచారం.

## 26. అక్కలవరం

కండ్లగుంట (వెల్దుర్తి మండలం) గ్రామానికి పశ్చిమాన 4 కి.మీ. దూరంలో అక్కలవరం ఉండేది. ఇంతకు మించి సమాచారం లభించలేదు.

**ఆధారం:** కండ్లగుంట గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 27. బుగ్గపాడు

రెంటచింతల మండలం మల్లవరం గ్రామానికి దక్షిణదిశలో కృష్ణానదికి చేరువలో బుగ్గపాడు ఉండేది. ఇక్కడి నీటి ఊట (బుగ్గ) వలన బుగ్గపాడు అయింది. అప్పట్లో ఈ గ్రామం 12 ఊర్లకు కేంద్రంగా ఉండేదట. కృష్ణకు ఆవలి ఒడ్డు చిట్యాల (తెలంగాణ) రేవుకు వెళ్ళటానికి బుగ్గపాడు ముఖద్వారం. బుగ్గపాడు అదృశ్య కారణాలు తెలియవు.

**ఆధారం:** మల్లవరం గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 28. తాడుట్ల

కృష్ణానదికి దక్షిణదిశలో తాడుట్ల ఉండేది. బోదనం (బెల్లంకొండ మండలం) గ్రామానికి పశ్చిమానున్న చిట్టడవి, చెన్నాయపాలెం (మాచవరం మండలం) గ్రామానికి తూర్పునున్న చిట్టడవి తాడుట్ల గ్రామానికి సరిహద్దులు. ఇక్కడ చిన్న కోట కూడా ఉంది. అందులో శాసనాలు ఏమీ లేవు. ఇది పూర్వం సైనికకేంద్రము/ తనిఖీకేంద్రము (స్కందవారము/కందవారము) కావచ్చు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. ఏనాడో అదృశ్యమైన తాడుట్ల గ్రామం పులిచింతల ప్రాజెక్టులో మునిగిపోయింది.

**ఆధారం:** మోర్జంపాడు (మాచవరం మండలం) గ్రామస్థులు
కట్టెబోయిన వెంకటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 29. బోయపల్లి

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1289–1323) క్రీ.శ. 1298 శిరిగిరిపాడు శాసనంలో బోయపల్లి ప్రసక్తి ఉంది. కానీ హద్దులు చెప్పలేదు. శిరిగిరిపాడుకు కొంత దూరంలో లోయపల్లి ఉంది. లోయపల్లి, బోయపల్లి ఒకటేనా? పరిశోధన చేయవలసివుంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 184.

## 30. మెదెగల

క్రీ.శ. 1555 చర్లగుడిపాడు (గురజాల మండలం) శాసనంలో మెదెగల గ్రామప్రసక్తి ఉంది. ఈ గ్రామ సరిహద్దులు కానరావు. మెదెగలను మోదుగల/మోదుగులగా భావించినచో ఈ గ్రామం 5వ శతాబ్దికి ఉన్నట్లు గుంటూరుజిల్లా చరిత్రగ్రంథాలలో ఉంది. మోదుగుల ఇంటిపేరుతో రెడ్లు, శాలివాహన (కుమ్మరి) మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 41.
2. గుంటూరుజిల్లా సమగ్ర చరిత్ర సంస్కృతి, సంపాదకుడు:
   మాజేటి సోమశేఖరరావు, గుంటూరు, 2004, 1వ భాగం, పుట: 298.

## 31. కలస

నాగార్జునసాగర్ ప్రాజెక్ట్ లో భాగంగా కలస గ్రామాన్ని పూర్తిగా తొలగించవలసి వచ్చింది. ఈ గ్రామ సరిహద్దులు తెలియవు. ఈ గ్రామాన్ని తిరిగి ఎక్కడ నిర్మించారో తెలియవలసివుంది.

**ఆధారం:** బెల్లంకొండవారిపాలెం (మాచర్ల మండలం) గ్రామస్థులు
వట్టికొండ జయరామయ్య ఇచ్చిన సమాచారం.

## 32. గురజాల పరిసర అదృశ్యగ్రామాలు

18వ శతాబ్ది పలనాటి పాలకుడు రామరాజు మంత్రప్పదేశాయి వంశీయులు గురజాల శివారులో త్రిపురసుందరిపురం, వెంకమాంబాపురం, నరసమాంబాపురం గ్రామాలు నిర్మించి బ్రాహ్మణులకు అగ్రహారాలుగా దానమిచ్చాడు. ఈ గ్రామాల హద్దులు తెలియవు. ఈ గ్రామాలు అదృశ్యమయ్యాయో లేక వేరే పేరుతో మనుగడలో ఉన్నాయో తెలియదు. త్రిపురసుందరిపురమే జంగమేశ్వరపురం (గురజాల మండలం)గా మారిందని అంటున్నారు.

**ఆధారం:** పల్నాటి చరిత్ర, రావిపాటి లక్ష్మీనారాయణ, రావిపాడు, నరసరావుపేట 1953, పుట: 51.

## 33. రామచంద్రునిపాడు

చర్లగుడిపాడు (గురజాల మండలం) గ్రామానికి తూర్పున 2 కి.మీ. దూరంలో యర్రవాగు సమీపాన రామచంద్రునిపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. చర్లగుడిపాడు గ్రామస్థుల్లో తూర్పు రామచంద్రునిపాడు పొలాలు అనే వాడుక ఉంది.

**ఆధారం:** చర్లగుడిపాడు గ్రామస్థులు వేముల చలమయ్య ఇచ్చిన సమాచారం.

## 34. వేమగిరి

గుత్తికొండ (పిడుగురాళ్ళ మండలం) గ్రామానికి దక్షిణంగా వేమగిరి ఉండేది. గ్రామం అదృశ్యమైనప్పటికీ ఇక్కడ ఉన్న చెరువును వేమగిరి చెరువు అంటారు. నేడు కొన్ని చెంచు కుటుంబాలు అక్కడ నివాసముంటున్నాయి.

**ఆధారం:** పిడుగురాళ్ళ వాస్తవ్యులు నాగార్జునకొండ పిచ్చయ్య ఇచ్చిన సమాచారం.

## 35. హనుమంతునిపాడు, వీరభద్రపురం

వెల్దుర్తి మండలం గొట్టిపాళ్ళ గ్రామానికి పశ్చిమాన 6 కి.మీ. దూరంలో హనుమంతునిపాడు ఉండేది. గోల్కొండ పాలకుడు అబుల్ హసన్ తానీషా (క్రీ.శ. 1672-1687) సేనాని అయిన అక్కన్న పల్నాడు పర్యటనలో (క్రీ.శ. 1674) హనుమంతునిపాడు, వీరభద్రాపురం గ్రామాలను నిర్మించి మాచర్ల వీరేశ్వర (వీరభద్ర) స్వామికి ఇచ్చాడు. హనుమంతునిపాడు గురించి కొంత సమాచారం తెలిసినప్పటికీ వీరభద్రపురం జాడే తెలియలేదు. గొట్టిపాళ్ళ-కృష్ణాపురం (అదృశ్యగ్రామం) మధ్యనున్న జెర్రివాగు (ప్రసూతనది) కు ఉత్తరాన హనుమంతుని పాడు, దక్షిణాన వీరభద్రపురం ఉండేవని వినికిడి.

హనుమంతునిపాడు గురించి తెలియని కొందరు అక్కడ ఉన్న ఆంజనేయస్వామిని కృష్ణాపురం ఆంజనేయస్వామిగా పిలుస్తారు.

**ఆధారం:**

1. పల్నాటి చరిత్ర, రావిపాటి లక్ష్మీనారాయణ, రావిపాడు, నరసరావుపేట మండలం, 1953, పుట: 49.
2. పాతగుంటూరు వాస్తవ్యులు చిరతనగండ్ల సోమేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 36. సబ్బెయపల్లి

క్రీ.శ. 1111 మాచర్ల శాసనంలో సబ్బెయపల్లి గ్రామం నాగులేరు నదికి తూర్పుదిశలో ఉన్నట్లు చెప్పబడింది. హద్దులు మాత్రం ఆ శాసనంలో తెలుపలేదు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 66.
2. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 37. వేముల

క్రీ.శ. 1111 మాచర్ల శాసనంలో, క్రీ.శ. 1267 తాళ్ళపల్లి (మాచర్ల మండలం) శాసనంలో వేముల ప్రసక్తి ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. వేముల ఇంటి పేరు కల కొన్ని కులాలవారు మాచర్లలో ఉన్నారు. మాచర్లకు దగ్గరలోనే వేముల గ్రామం ఉండేదని అనుకోవచ్చు. ఇంకా పశువేముల (మాచర్ల మండలం), దరివేముల (దుర్గి మండలం) గ్రామాలు పల్నాడులో ఉన్నాయి.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్స్:10, 40, సీరియల్ నెం. 66, 189
2. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 38. సింగరుట్ల అగ్రహారం

కారంపూడి మండలం పేట సన్నిగండ్ల గ్రామానికి దక్షిణ ఆగ్నేయంగా సింగరుట్ల ఉండేది. సింగరుట్ల కొండలలో లక్ష్మీనరసింహస్వామి ఆలయం ఉంది. ఆ ఆలయంలో నిత్యపూజలు జరుగుతున్నాయి. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ప్రభుత్వ రెవిన్యూ రికార్డుల్లో సింగరుట్ల పొలాలు కనిపిస్తాయి. సింగరుట్ల నరసింహస్వామి గుహామార్గంలో ఓ వింత చింతచెట్టు ఉంటుంది. ఆ చెట్టు మొదలు పైకి, నడుము భూమిలోకి ఉంటుంది. క్రీ.శ. 1318, క్రీ.శ. 19వ శతాబ్ది శాసనాలలో సింగరుట్ల నరసింహస్వామి ప్రస్తావన ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40,
సీరియల్ నెం. 182, 183.

## 39. దద్దనాలపాడు (దద్దనాలగుట్ట)

దుర్గి (మండలకేంద్రం)కి దక్షిణంగా, కోలగుట్ల (దుర్గి మండలం) గ్రామానికి ఆగ్నేయంగా దద్దనాలపాడు ఉండేది. దుర్గి, కోలగుట్ల గ్రామస్థులు నేటికీ ఆ ప్రాంతాన్ని దద్దనాల పొలాలు అనే పిలుస్తారు. (రాజాంతఃపుర స్త్రీలు సతీసహగమనం చేసిన ప్రాంతాన్ని దగ్ధనాల అనేవారట)

**ఆధారం:** కోలగట్ల గ్రామస్థులు బిట్టు వెంకటేశ్వర్లు ఇచ్చిన సమాచారం.

## 40. జిట్టగామాలపాడు

దాచేపల్లి మండలం గామాలపాడు గ్రామానికి అతి దగ్గరగా జిట్టగామాలపాడు ఉండేది. నాయకురాలు నాగమ్మ జన్మస్థలం ఈ ఊరేనని ప్రతీతి. ఇక్కడున్న శివాలయాన్ని నాగమ్మే కట్టించిందని అంటారు. శాసనాలలో గామాలపాడు ప్రస్తావన ఉందిగాని జిట్టగామాలపాడు కనిపించదు. చిట్టి(చిన్న) చిట్టగా, జిట్టగా మారుతుంది కనుక జిట్టగామాలపాడు గ్రామాన్ని చిన్నగామాలపాడు అనుకోవచ్చు.

**ఆధారం:** పిడుగురాళ్ళ వాస్తవ్యులు నాగార్జునకొండ పిచ్చయ్య ఇచ్చిన సమాచారం.

## 41. గంద్రకోట

కర్నూలుజిల్లా శ్రీశైలక్షేత్రానికి ఈశాన్యద్వారం ఏలేశ్వరం (తెలంగాణ). నాగార్జునసాగర్ నిర్మాణసమయంలో ఈ గ్రామాన్ని ఖాళీ చేయించారు. ఏలేశ్వరంలో కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199 -1262) రాజగురువు విశ్వేశ్వర శివదేశికుడు (శివదేవయ్య) గోళకీమఠమును నిర్మించాడు. క్రీ.శ. 1262 మల్కాపురం(తుళ్ళూరు మండలం, గుంటూరుజిల్లా) శాసనంలో విశ్వేశ్వర శివదేశికునకు గణపతిదేవచక్రవర్తి పల్లినాడు విషయం (పలనాడు)లోని 'కంద్రకోట' (గంద్రకోట) గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు ఉంది.

కాకతీయ గణపతిదేవచక్రవర్తి కాలంలో పానుగల్లు (నల్లగొండజిల్లా, తెలంగాణ) – మార్జవాడి (కోలారు?కర్ణాటక) మధ్యనున్న పలనాడు (గుంటూరుజిల్లా), ఏరువనాడు (మార్కాపురం, ప్రకాశంజిల్లా) సకిలిసీమ (సగిలేరు ప్రాంతం, పోరుమామిళ్ళ, కడపజిల్లా) ములికినాడు (రాయచోటి ప్రాంతం, కడపజిల్లా), బాణవాడి (కలకడ, మదనపల్లి ప్రాంతం, చిత్తూరుజిల్లా), మెరసనాడు (కోలారు ప్రాంతం, కర్ణాటక) మొదలగు ప్రాంతాలను గంగయసాహిణి మేనల్లుడు కాయస్థ జన్నిగదేవ (క్రీ.శ. 1258 – 1269) పాలించేవాడు. శ్రీశైలం (కర్నూలుజిల్లా) క్షేత్రానికి తూర్పు ద్వారంగా త్రిపురాంతకం (ప్రకాశంజిల్లా) ఉంది. క్రీ.శ. 1259 త్రిపురాంతక శాసనంలో కాయస్థ జన్నిగదేవ త్రిపురాంతకస్వామికి పలినాంటి (పలనాడు), గంద్రకోట, అనుంగురాజుపల్లి గ్రామాలను దానంగా ఇచ్చినట్లు ఉంది.

మాచర్ల మండలం కొత్తపల్లి వద్ద ఉన్న చెరువును గంద్రకోట చెరువు అని స్థానికులు అంటారు. కావున గంద్రకోట గ్రామం అక్కడే ఉండేది. కొత్తపల్లి గ్రామకరణాలు గంద్రకోట ఇంటిపేరు కలిగినవారే. పలనాటి వీరచరిత్రలో గంద్రకోట ప్రస్తావన ఉంది. అనుంగురాజుపల్లి ఇప్పుడు అలుగురాజుపల్లి (మాచర్ల మండలం)గా మారింది.

**ఆధారం:**


1. కాకతీయ సంచిక, సంపాదకులు: డా॥మారేమండ రామారావు, 1999, పుట: 413.
2. త్రిపురాంతక దేవాలయ శాసనములు, సంపాదకులు: భిన్నూరి నరసింహశాస్త్రి, హైదరాబాద్, 1984, పుట: 107.
3. మైదుకూరు (కడపజిల్లా) వాస్తవ్యులు తవ్వా ఓబుల్‌రెడ్డి ఇచ్చిన సమాచారం.

# 42 నాగార్జునకొండ

శ్రీపర్వతం అనబడే విజయపురియే నాగార్జునకొండ. ఇది శ్రీపర్వతపు చివరిభాగం. పురాణాలలో ఈ పర్వతం నాగపర్వతంగా ప్రసిద్ధి చెందింది. సతీదేవి అగ్నికి ఆహుతి ఐన పిదప శంకరులు ఈ పర్వతంపై తపస్సు చేసాడట. త్రేతాయుగంలో సూర్యవంశ చక్రవర్తి ఇక్ష్వాకు పుత్రుడు దండుడు దక్షిణభారతంలో కొంత ప్రాంతాన్ని పాలించేవాడు. అతడు ఒక రోజు భార్గవమహర్షి పుత్రిక 'అరజ'ను బలాత్కరించబోయాడు. అందుకు ఆగ్రహించిన భార్గవమహర్షి దండుని రాజ్యంలో నిప్పుల వర్షం కురుస్తుందనీ, రాజ్యం అరణ్యం కాగలదని శపించాడు. అక్కడ నివాసముండే నాగులు తమను రక్షించవలసిందిగా మహర్షిని ప్రార్థించగా నాగపర్వతం (నాగార్జునకొండ)ను తన శాపానికి మినహాయించాడు. నాగజాతి ఈ పర్వతంపై నిలిచి తమ ప్రాణాలను రక్షించుకుంది. నాటి దండుని రాజ్యమే ఆంధ్ర, తెలంగాణ, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా, మహారాష్ట్రలలో ఉన్న నేటి దండకారణ్యము. ద్వాపర యుగంలో దీనికి సంబంధించి మరో గాథ ఉంది. అనేక యాగాలలో నెయ్యిని స్వీకరించిన అగ్నిదేవునికి అజీర్తి చేసింది. దాని నివారణ కోసం అగ్నిదేవుడు సకల ఔషధ నిలయమైన ఖాండవవనాన్ని దహించాలనుకున్నాడు. ఇది తెలిసిన ఇంద్రుడు అగ్నిని అడ్డుకున్నాడు. దాంతో అగ్ని కృష్ణార్జునులను శరణు కోరాడు. నాగజాతి తాము అనాదిగా ఖాండవవనంలో ఉంటున్నామని తమను కాపాడవలసిందిగా కృష్ణార్జులను కోరారు. కృష్ణార్జునులు నాగజాతిని నాగపర్వతంపై చేర్చారు. అర్జునుడు, నాగకన్య ఉలూచిల కుమారుడు నాగార్జునుడు (కుమారస్వామి మిత్రుడు) నాగులకు రక్షణగా ఈ పర్వతంపై ఉండుట వలన ఇది నాగార్జునపర్వతం అని పురాణ నానుడి. చారిత్రకంగా ఇది ప్రసిద్ధ బౌద్ధక్షేత్రము. ఆచార్య నాగార్జునుడు ఇక్కడ విద్యాపీఠాన్ని నెలకొల్పి బౌద్ధ బోధనలు చేసాడని, చైనా, నేపాల్, టిబెట్ తదితర దేశాలనుండి విద్యార్థులు ఇక్కడకు వచ్చి విద్య నభ్యసించారని చారిత్రక ఆధారాలు ఉన్నాయి. శాతవాహనులకు ఉపరాజధాని, ఇక్ష్వాకులకు రాజధాని, రెడ్డిరాజులు, గజపతులు, విజయనగర పాలకులకు నాగార్జునకొండసీమగా ఈ ప్రాంతం ప్రసిద్ధి. ఇప్పుడు ఇక్కడ బౌద్ధస్తూపం, మ్యూజియం ఉన్నాయి.

## 43. పెందోట

పాతపుల్లారెడ్డిగూడెం(మాచర్ల మండలం) గ్రామానికి దక్షిణాన కృష్ణానది పెద్దమలుపు వద్ద పెందోట గ్రామం ఉండేది.

విశ్వబ్రాహ్మణ కులపురాణంలో పెందోట ప్రసక్తి ఉంది. పెందోట ప్రసిద్ధ శిల్పక్షేత్రము. 12వ శతాబ్దపు ఏలేశ్వర (తెలంగాణ) శాసనంలో గురజాల పాలకుడైన అనుగురాజు ఏలేశ్వరస్వామికి పెందోట, రాచమల్లునిపల్లి (రచ్చమల్లెపాడు, వెల్దుర్తి మండలం) గ్రామాలను దానంగా ఇచ్చినట్లు ఉంది. క్రీ.శ. 1320లో నేమాని చినవీచయప్రెగ్గడ త్రిపురాంతకదేవరకు పెందోట గ్రామసుంఖం, సర్వమాన్యం సమర్పించారు. క్రీ.శ. 1560 ఒంటిమిట్ట (కడపజిల్లా) తామ్రశాసనంలో విశ్వబ్రాహ్మణులు? ఒంటిమిట్ట దొహరిపానయ కొడుకు యల్లయ్య (గుఱ్రంకొండ పాలకుడు?) తమ బిరుదావళిలో తాము పెందోట పురాధీశ్వరులమని చెప్పుకున్నారు. రావెళ్ళ ముద్దుకృష్ణమనాయుడు క్రీ.శ. 1653లో పెందోట పాలకుడుగా ఉన్నాడు. విశ్వబ్రాహ్మణులలో బాణాల వంశీయులు తమ బిరుదావళిలో తాము పెందోట పురాధీశ్వరులమని చెప్పుకున్నారు. విశ్వబ్రాహ్మణుడైన ధవలేశ్వర మార్కండేయ భూపాలుడు పెందోట రాజధానిగా పాలించాడు. అతని ఆస్థానకవులు తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి రచించిన నాగరఖండం గ్రంథాన్ని తమ రాజుకు అంకితం ఇచ్చారు. నాగరఖండం పెందోటచరిత్రకు ముఖ్య ఆధారం. గోల్కొండ పాలకుడు మహమ్మద్ కులీ కుతుబ్ షా (క్రీ.శ. 1580-1612)కాలంలో ధవలేశ్వరమార్కండేయప్రభువు పెందోటను పాలించాడు.

సమీప కృష్ణానదిలో కలిసే వాగును పెందోటవాగు అని స్థానికులు అంటారు. పెందోటకు ఆవలి ఒడ్డు ఏలేశ్వరం(తెలంగాణ) ఉండేది.

సీ॥ శాలివాహన శక సంఖ్యాకములునగు
పదియేను వందలపై నెనిమిది
వత్సరంబులలోన వసుధాస్థలంబున
కుతుబుషాహీ నిజాం కుతలనాథు
ప్రాభవవేళ మార్కండేయ భూపతి

ధవళేశ్వరాన్వయభవుడు నగుచు
సకల దిశా వ్యాప్త సాంద్ర సుధా స్వచ్ఛ
కీర్తి పరంపరాస్ఫూర్తి నలరి
సురుచిరంబైన పెండోటపురిని నిలిచి
విశ్వకర్మాన్వయాంబుధి వెలయఁజేసి
సప్త సంతానములంగాంచి సాధు వృత్తి
సుకవివర్యులు భళియని స్తుతులొనర్ప
ధరణి పాలింపుచుండెను ధర్మనిరతి.

**ఆధారం:**

1. గుంటూరు వైభవం, అమరావతి మహోత్సవ నిర్వహణ కమిటి, 2002, పుట: 29-33.
2. నల్లగొండజిల్లా శాసనాలు, 1994, వాల్యూమ్: 2, సీరియల్ నెం. 81.
3. కమ్మవారిచరిత్ర, కొత్తభావయ్యచౌదరి, సంగంజాగర్లమూడి, తెనాలి మండలం, 2013, పుట: 368.
4. త్రిపురాంతక దేవాలయ శాసనాలు, భిన్నూరి నరసింహశాస్త్రి, హైదరాబాద్, 1984, పుట: 151.
5. కడప శిలాశాసనములు వగైరా, సంపాదకులు: నేలటూరు వెంకటరమణయ్య, 1912. పుట: 225, 226.

## 44. సీతారామపురం (మైన్స్)

పిడుగురాళ్ళ సమీపాన సీతారామపురం ఉండేది. అక్కడ సున్నపు గనుల తవ్వకం హెచ్చుగా జరిగేది. ఈ ప్రాంతంలోనే న్యూ పిడుగురాళ్ళ రైల్వేజంక్షన్ స్టేషన్ కొత్తగా ఏర్పడింది. నడికుడి (దాచేపల్లి, గుంటూరుజిల్లా)- శ్రీకాళహస్తి (చిత్తూరుజిల్లా) రైల్వే మార్గమునకు ఈ స్టేషను కీలకమైంది.

**ఆధారం:** పిడుగురాళ్ళ వాస్తవ్యులు నాగార్జునకొండ పిచ్చయ్య ఇచ్చిన సమాచారం.

## 45. కృష్ణాపురం

గొట్టిపాళ్ళ (వెల్దుర్తి మండలం) గ్రామానికి పడమరగా 7 కి.మీ. దూరంలో కృష్ణానదికి చేరువగా కృష్ణాపురం ఉండేది. క్రీ.శ. 1835-1850 మధ్య కొందరు దోపిడీలు, స్మగ్లింగ్ వంటి కార్యకలాపాలను చేపట్టడంతో క్రీ.శ. 1902 లో ప్రభుత్వం ఈ గ్రామాన్ని ఖాళీ చేయించింది. దీనికి దగ్గరలో కృష్ణాపురం ఆంజనేయస్వామిగా పిలువబడే హనుమంతునిపాటి ఆంజనేయస్వామిని చూడవచ్చు.

**ఆధారం:** గంగులగుంట (వెల్దుర్తి మండలం) వాస్తవ్యులు కొలుకుల ఆంజనేయులు ఇచ్చిన సమాచారం.

## 46. బోయపాడు

గుంటూరు, ప్రకాశం జిల్లాల సరిహద్దు దావుపల్లి (వెల్దుర్తి మండలం) గ్రామానికి పడమరగా 7 కి.మీ. దూరంలో బోయపాడు ఉండేది. నేటికీ కొన్ని మట్టిగోడలు ఇక్కడ దర్శనమిస్తాయి. బోయపాటి ఇంటిపేరుగల కమ్మ కులస్థులు గుంటూరు జిల్లాలో ఉన్నారు

**ఆధారం:** గంగులగుంట (వెల్దుర్తి మండలం) వాస్తవ్యులు కొలుకుల ఆంజనేయులు ఇచ్చిన సమాచారం.

## 47. బైరపల్లి

క్రీ.శ. 12వ శతాబ్ది శిరిగిరిపాడు (వెల్దుర్తి మండలం) శాసనంలో 'బైరపల్లి గ్రామ రెడ్లు కూడలి శ్రీరామేశ్వరదేవర' కు భూమి దానం ఇచ్చినట్లు ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 185.

## 48. రుతుంపల్లి

కృష్ణానది తీరాన తూర్పుదిశన పాతపుల్లారెడ్డిగూడెం (మాచర్ల మండలం) గ్రామానికి దక్షిణదిశగా 2 కి.మీ. దూరంలో రుతుంపల్లి ఉండేది. నాగార్జునసాగర్ ప్రాజెక్టులో భాగంగా ఈ గ్రామాన్ని ఖాళీ చేయించారు. పుల్లారెడ్డిగూడెం మాదిరి రుతుంపల్లి పేరుతో మరో గ్రామం నిర్మించలేదు.

**ఆధారం:** మాచర్ల వాస్తవ్యులు వేముల శ్రీనివాసరావు ఇచ్చిన సమాచారం.

## 49. గుడిపాడు

కండ్లగుంట (వెల్దుర్తి మండలం) గ్రామానికి ఉత్తరదిశలో ఉన్న గుడిపాడు చెరువుకు రెండు కి.మీ. దూరంలో తూర్పుగా గుడిపాడు ఉండేది. ఈ గ్రామం తగలబడిపోయింది. కండ్లగుంట గ్రామస్థులు గుడిపాడు గురించి చెబుతారు. కొందరు గుడిపాడు చెరువువద్ద గుడిపాటి చెరువు అను పేరుతో ఓ చిన్న చెంచుగూడెం నిర్మించుకున్నారు. గుడిపాటి ఇంటిపేరుగల కొన్ని కుటుంబాలు గుంటూరు జిల్లాలో ఉన్నాయి

**ఆధారం:** కండ్లగుంట గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 50. కొలుములపాలెం (విలీనగ్రామం)

పిడుగురాళ్ళ మండలంలో ఉన్న గుత్తికొండ (గుచ్ఛాద్రి) సమీప పర్వతాలు రాగి, ఇనుము ఖనిజాలకు ప్రసిద్ధి. పూర్వం గుత్తికొండ సమీపాన కొందరు కంసాలులు సమీప పర్వతాలలో ముడిఖనిజాన్ని సేకరించి కొలుములు పెట్టి వస్తువులు తయారుచేసేవారు. కొలుములు పెట్టిన ప్రాంతం కావున ఆ ప్రాంతానికి కొలుములపాలెం అని పేరు వచ్చింది. కొలుములపాలెం గుత్తికొండ గ్రామంలో కలిసిపోయింది.

**ఆధారం:** పిడుగురాళ్ళ వాస్తవ్యులు నాగార్జునకొండ పిచ్చయ్య
ఇచ్చిన సమాచారం.

## 51. నిదానంపాడు

అడిగొప్పుల (దుర్గి మండలం) గ్రామ సమీపాన నిదానంపాడు ఉండేది. దీనికి సంబంధించిన ఓ పురాణగాథ ప్రచారంలో ఉంది. కైలాసంలో ఒకనాడు నందీశ్వరుడు నాట్యం చేస్తుండగా ఆ నాట్యాన్ని చూసి పార్వతిదేవి నవ్విందట. అది చూసిన నందీశ్వరుని తండ్రి శిలాదమహర్షి తన పుత్రుని నాట్యవిన్యాసం చూసి నవ్వినందుకు పార్వతిదేవికి అదే రూపంవల్ల నీలాపనిందలు వచ్చుగాక అని శపించాడట. శాపకారణంగా పార్వతీదేవి భూలోకంలో యాగంటి ఇంటిపేరు కలిగిన కమ్మవారింట సుగుణమ్మ, రామయ్య దంపతులకు పుత్రికగా జన్మించింది. పార్వతీదేవి పేరు ఈ యుగాన శ్రీలక్ష్మి. ఆమెకు నలుగురు అన్నలు. శ్రీలక్ష్మి బాల్యంలో ఉండగా ఓ రోజు దాహాన్ని తట్టుకోలేక గోమూత్రం త్రాగింది. ఫలితంగా ఆమెకు మాయాగర్భం వచ్చింది. దాంతో యాగంటి రామయ్య కుటుంబంమీద నింద పడింది. అవమానభారంతో శ్రీలక్ష్మి అన్నలు ఆమెను అంతమొందించేందుకు కుట్ర పన్నారు. పొలంలో పనికి వెళ్ళిన అన్నలకు భోజనం తీసుకువెళ్లిన ఆమెను ప్రత్తికట్టె వాము ఎక్కించి ప్రత్తికట్టెలు సరిచేయమన్నారు.ఆమె వాము ఎక్కి ప్రత్తికట్టెలు సరిచేస్తుండగా, ముగ్గురు అన్నలు చివరివాడిని ప్రక్కకు తోసి ఆ వాముకు నిప్పుపెట్టారు. ఆ వాములో దగ్ధమవుతున్న శ్రీలక్ష్మి జరిగిన ఘోరం తెలుసుకుంది. తన చివరి అన్నను తప్ప మిగిలిన ముగ్గురిని శపించి అగ్నికి ఆహుతి అయింది. దాంతో నిదానంపాడు గ్రామం నశించింది. ఇప్పుడు నిదానంపాటి శ్రీలక్ష్మి పేరంటాళ్లు కొలుపులు ప్రతి ఆదివారం అట్టహాసంగా నిర్వహిస్తారు. క్రీ.శ. 1297 దుర్గి శాసనంలో నిదానంపాడు (నిధినంపాడు) ప్రస్తావన ఉంది.

**ఆధారం:**

1. మన పల్నాడు, పుట: 64, 65.

2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 482.

## 52. దామెరపాడు (దామర్లపాడు)

రెంటచింతల మండలంలో ఉన్న తుమ్మకోట గ్రామానికి ఉత్తర వాయవ్యంగా కృష్ణానది తీరాన చిట్టడవిలో దామెరపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. వరదల కారణంగా మునిగిపోయి ఉండవచ్చని అంటారు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు. దామెరపాడు ఆంజనేయస్వామికి తుమ్మకోటలో ఆలయం నిర్మించారు.

**ఆధారం:** తుమ్మకోట గ్రామస్థులు షేక్ సైదా ఇచ్చిన సమాచారం.

## 53. తమ్మిడిపల్లె

క్రీ.శ. 1308 కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1289-1323) గొట్టిపాళ్ళ శాసనంలో గొట్టిపాళ్ళ (వెల్దుర్తి మండలం) మాతంగేశ్వర మహాదేవరకు మాచయనాయనింగారు (క్రీ.శ. 1298-1308) తమ్మిడిపల్లె పొలాన్ని దానంగా ఇచ్చినట్లు ఉంది. శాసనంలో హద్దులు తెలుపలేదు. ప్రకాశంజిల్లా అడవుల్లో తమడిపల్లె పేరుతో ఒక గ్రామం ఉన్నదని కొందరు అన్నారు. ఆ ఊరికి గొట్టిపాళ్ళ చాలా దూరం.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 94.

## 54. చింతలపాలెం, యర్రబాలెం (విలీనగ్రామాలు)

ఒప్పిచర్ల (కారంపూడి మండలం) సమీపాన చింతలపాలెం, యర్రబాలెం ఉండేవి. ఒప్పిచర్లలో ఈ రెండు గ్రామాలు కలిసిపోయాయని అంటారు. దుర్గి మండలంలో కూడా యర్రబాలెం గ్రామం ఉంది.

**ఆధారం:** పాతగుంటూరు వాస్తవ్యులు చిరతనగండ్ల సోమేశ్వరరావు
ఇచ్చిన సమాచారం.

## 55. శంకరాపురం

ఉప్పలపాడు (వెల్దుర్తి మండలం) గ్రామానికి తూర్పుదిశలో పాటిపై శంకరాపురం ఉండేది. స్థానిక ఉప్పలపాడు గ్రామస్థులు పాటిమీద ఉన్న దేవాలయాల్లో నేటికీ పూజాదికాలు నిర్వహిస్తారు. శంకరాపురం అదృశ్యమవుతున్న తరుణంలో కొందరు గ్రామస్థులు ఉప్పలపాడు చేరుకుని ఓ పేటకు శంకరాపురం పేరు పెట్టారని చెబుతారు. కారంపూడి మండలం భట్టువారిపల్లె వద్ద కూడా శంకరాపురం అదృశ్యగ్రామం కలదు.

**ఆధారం:** ఉప్పలపాడు వాస్తవ్యులు సిరికొండ చక్రపాణి ఇచ్చిన సమాచారం.

## 56. సీతానగరం, నేకునాంబాద్

చంద్రవంకనది ఎత్తిపోతల జలపాతం నుండి ఉత్తరంగా 3 కి.మీ. దూరం ప్రయాణించి కృష్ణానదిలో కలుస్తుంది. కృష్ణానది తీరాన చంద్రవంకనదికి పశ్చిమాన 3 కి.మీ. దూరంలో సీతానగరం, నేకునాంబాద్ ఉండేవి. క్రీ.శ. 1896 మ్యాపులో ఈ గ్రామాలను చూడవచ్చు. వరదల్లో ఈ గ్రామాలు కొట్టుకుపోయినట్లు సమీప గ్రామస్థులు చెపుతుంటారు.

**ఆధారం:** పాతగుంటూరు వాస్తవ్యులు చిరతనగండ్ల సోమేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 57. అయ్యనవాలు (అయ్యనవోలు?)

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి కాలం (క్రీ.శ. 1289-1323) లో క్రీ.శ. 1313 శ్రీశైలం శాసనంలో శ్రీశైల మల్లికార్జునస్వామికి పల్లినాటిలోని అయ్యనవా(లు) గ్రామం దానంగా ఇచ్చినట్లు ఉంది. నేడు పలనాడులో అయ్యనవాలు లేదు. వినుకొండ తాలూకా బొల్లాపల్లి మండలంలో అయ్యనపాలెం గ్రామం ఉంది. (వినుకొండ తాలూకాలో కొంత పల్నాటి ప్రాంతం ఉండేది)

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 504.

## 58. ఆకురాజుపల్లి (ఆకరాజుపల్లి)

కాకతీయ గణపతిదేవచక్రవర్తి పాలన (క్రీ.శ. 1199-1262) లో క్రీ.శ. 1209 ఆకరాజుపల్లి (ఆకురాజుపల్లి) శాసనంలో ప్రోలభీమానాయుడు తన తల్లిదండ్రులు, తన ప్రభువు పుణ్యం కొరకు పలినాంటిలోని ఆకరాజుపల్లి గ్రామాన్ని త్రిపురాంతకస్వామికి దానంగా ఇచ్చినట్లు ఉంది.

క్రీ.శ. 1373 తంగెడ శాసనంలో కొండవీడు రాజ్యపాలకుడు అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) తంగెడ గోపీనాథస్వామికి ఆకురాజుపల్లి (ఆకరాజుపల్లి) గ్రామంలో బేతినేని పొలం దానంగా ఇచ్చినట్లు ఉంది.

ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. కొత్తపాలెం గ్రామస్థులు కొందరు ఆకురాజుపల్లి హద్దులు చెబుతారు. ఆకురాజుపల్లి గ్రామస్థులు సమీపంలో కొత్తపాలెం (మాచవరం మండలం) గ్రామాన్ని నిర్మించుకున్నారు. నాగార్జునసాగర్ బ్రాంచి కాలువను ఆకురాజుపల్లి మేజరు కాలువగా పిలుస్తారు. ప్రభుత్వ రెవిన్యూ రికార్డుల్లో ఈ ప్రాంతం ఆకురాజుపల్లి పేరుతోనే ఉంది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. ఆకురాజుపల్లి ఆంజనేయస్వామి ఆలయం పిడుగురాళ్ళ-దాచేపల్లి రహదారిలో బ్రాహ్మణపల్లి (పిడుగురాళ్ళ మండలం) వద్ద ఉంది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 114.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 557

## 59. నందాపురం

క్రీ.శ. 1269 దుర్గి (మండలకేంద్రం) శాసనంలో కాకతీయ సామంతుడు, పానుగల్లు - మార్జువాడి పాలకుడు కాయస్థ జన్నిగదేవ (క్రీ.శ. 1258-1269) కాలంలో దుర్గి 'గోపాలస్వామిని నందాపురం అగ్రహారీకులు సవదరం మల్లపరాజు కుమారుడు కరణము నామ..య ప్రతిష్ఠ' చేసెను. ఇప్పుడు ఈ ప్రాంతంలో నందాపురం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షిన్స్. వాల్యూమ్: 10, సీరియల్ నెం. 422.

## 60. వరికపూడి

వెల్దుర్తి మండలంలో జెర్రివాగు కృష్ణానదిలో కలిసే ప్రాంతాన వరికపూడి ఉండేది. కృష్ణానది బ్యాక్ వాటర్ తగ్గినప్పుడు కొన్ని ఆలయాలు ఈ ప్రాంతాన కనిపిస్తాయి. ఇక్కడే వరికపూడి గ్రామం ఉండవచ్చు. ప్రభుత్వంవారు కృష్ణానదిపై ఎత్తిపోతల ప్రాజెక్టుకు 'వరికపూడిసెల'గా పేరుపెట్టారు.

**ఆధారం:** మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 61. మేడిపల్లి

క్రీ.శ. 1665 కారంపూడి (మండలం కేంద్రం) శాసనంలో చెన్నకేశవస్వామికి అనేక గ్రామాల్లో భూమిని దానంగా ఇచ్చినట్లు ఉంది. వాటిలో మేడిపల్లి ప్రస్తావన ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. శాసనాన్ని బట్టి కారంపూడి పరిసరాలలోనే మేడిపల్లి ఉండేదని ఖచ్చితంగా చెప్పవచ్చు. మేడిపల్లి ఇంటిపేరుతో కొన్ని కుటుంబాలు పల్నాడు ప్రాంతంలో ఉన్నాయి.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 26, సీరియల్ నెం. 583.

## 62. పెద్దపాడు, రాగిపాడు (రావిపాడు?)

వెల్దుర్తి మండలం మండాది- రచ్చమల్లపాడు రహదారిలో పెద్దపాడు, రాగిపాడు ఉండేవి. పెద్దపాడు మండాదికి ఉత్తరాన ఉండేది. సాక్షిగా వెంకటేశ్వరాలయం ఉంది. నేటికీ పెద్దపాడు ఆలయం అనే పిలుస్తారు.

రాగిపాడు మండాదికి పడమరగా, చింతలవాగుకు తూర్పుగా ఉండేది. సాక్షిగా రాగిపాటి ఆంజనేయ ఆలయం ఉంది. ఈ గ్రామాలు అదృశ్యం కావటానికి అంటురోగాలు కారణం అని సమీప గ్రామస్థులు చెబుతారు.

**ఆధారం:** పాతగుంటూరు వాస్తవ్యులు చిరతనగండ్ల సోమేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 63. శివునిబావి

దావుపల్లి (వెల్దుర్తి మండలం)గ్రామానికి రెండు కిలోమీటర్ల దూరంలో, అటవీప్రాంతంలో శ్రీశైలం (కర్నూలుజిల్లా) రహదారి ప్రక్కనే శివునిబావి ఉండేది. సాక్షిగా శివాలయం ఉంది. శ్రీశైలం కాలిబాటన వెళ్లే భక్తులకు ఈ ప్రాంతం విడిది కేంద్రం. కృష్ణదేవరాయల కాలంలో భక్తుల సౌకర్యార్థం అక్కడ బావిని త్రవ్వించారు.

**ఆధారం:** మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్ బాబు ఇచ్చిన సమాచారం.

## 64. తుమ్మేపల్లి, కాసారం (విలీనగ్రామాలు)

మాచర్ల పట్టణానికి 4 కి.మీ దూరంలో ఉన్న రాయవరం (మాచర్ల మండలం) గ్రామానికి తూర్పుగా తుమ్మేపల్లి, పడమరగా కాసారం ఉండేవి. రాయవరంలో తుమ్మేపల్లి, కాసారం(కాచవరం) పూర్తిగా కలిసిపోయాయి. గ్రామస్థులు ఇప్పటికీ ఆయా ప్రాంతాలను తుమ్మేపల్లి, కాసారం అనే పిలుస్తారు. తుమ్మేపల్లి ఇంటి పేరుగల వైశ్యులు మాచర్లలో ఉన్నారు.

**ఆధారం:**

1. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్ బాబు ఇచ్చిన సమాచారం.
2. రాయవరం వాస్తవ్యులు చవ్వాకుల శ్రీను ఇచ్చిన సమాచారం.

## 65. బోయంబ్రోలు

క్రీ.శ. 1111 మాచర్ల చెన్నకేశవాలయ శాసనంలో బోయంబ్రోలు ప్రస్తావన ఉంది. అసలు బోయంబ్రోలు గ్రామమా, ఇంటిపేరా? పరిశీలన చేయవలసి ఉంది. కొందరు బోయంబ్రోలు గ్రామాన్ని కంబంపాడు (మాచర్ల మండలం) గా భావిస్తారు.

**ఆధారం:**

1. మాచర్ల శ్రీలక్ష్మీచెన్నకేశవస్వామివారి ఆలయచరిత్ర, పావులూరి సతీష్‌బాబు, మాచర్ల, 2021, పుట: 154, 158
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 66.

## 66. ఎర్రగుంటలపాడు

క్రీ.శ. 1299 ఒప్పిచర్ల (కారంపూడి మండలం) శాసనంలో 'ఎర్రగుంటలపాడు గ్రామబాట (తెరువు)' ఉంది. పల్నాడు ప్రాంతంలో నేడు ఎర్రగుంటలపాడు గ్రామం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షిన్స్. వాల్యూమ్: 10, సీరియల్ నెం. 488.

## 67. త్లొంఱూరు

'మొదటి జయసింహవల్లభుని మాచెర్ల శిలాశాసనము' (క్రీ.శ. 7వ శతాబ్ది మాచర్ల శాసనం) అనే వ్యాసంలో మల్లంపల్లి సోమశేఖరశర్మ శాసనపాఠాన్ని వివరిస్తూ అందులో ఉన్న 'త్లొంఱూరు' అనే పదాన్ని గ్రామము పేరు అని భావించాడు. అసలు త్లొంఱూరు గ్రామమా, ఇంటిపేరా? దాని అర్థమేమి? పరిశీలన చేయవలసివుంది.

**ఆధారం:**

1. మాచర్ల శ్రీలక్ష్మీచెన్నకేశవస్వామివారి ఆలయచరిత్ర, పావులూరి సతీష్‌బాబు, మాచర్ల, 2021, పుట: 171.
2. మొదటి జయసింహవల్లభుని మాచెర్ల శిలాశాసనము మల్లంపల్లి సోమశేఖరశర్మ, భారతి (మాసపత్రిక) 1946, ఆగస్టు. పుట: 182-186.

## 68. సాశనపుంబ్రోలు

12వ శతాబ్ది వెల్దుర్తి (మండలం కేంద్రం) శాసనం (తేదీ తెలియదు) లో 'సాశనపుంబ్రోలి రడ్డిగడ్లకు నివేద్యమునకు నిచ్చిన నాలుగు మడ్లు' అని ఉంది. సాశనపుంబ్రోలు గ్రామమా, ఇంటిపేరా? పరిశీలన చేయవలసివుంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 195.

# పొన్నూరు తాలూకా

1. పొన్నూరు మండలం
2. కాకుమాను మండలం
3. పెదనందిపాడు మండలం

## 1. బొద్దులూరివారిపాలెం

పాలపర్రు (పెదనందిపాడు మండలం) గ్రామానికి తూర్పు ఈశాన్యదిశలో పాలపర్తి కాలువ (వర్వ కాలువ) ఆవల బొద్దులూరివారిపాలెం ఉండేది. గ్రామకరణాలు బొద్దులూరివారే. ఇప్పటికీ అక్కడ ఉన్న చెరువును పాలెపుచెరువు అంటారు. క్రీ.శ. 1876 కరవు వల్ల ఈ గ్రామం అదృశ్యమయ్యింది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 1, పుట: 34.
2. పాలపర్రు గ్రామచరిత్ర, దొప్పలపూడి జానకిరామయ్య, పాలపర్రు, 2001, పుట: 5

## 2. నంగినేని అక్కన్నపాలెం

పాలపర్రు (పెదనందిపాడు మండలం) గ్రామానికి పడమరగా తేళ్ళ పేరయ్య (వర్రె పేరయ్య) చెరువు తూర్పుకట్ట దిగువన నంగినేని అక్కన్నపాలెం ఉండేది. క్రీ.శ. 1876 కరవు వలన ఈ గ్రామం అదృశ్యమయ్యింది. నంగినేని ఇంటిపేరుగల కమ్మ కులస్థులు పాలపర్రు గ్రామంలో ఉన్నారు.

**ఆధారం:** పాలపర్రు గ్రామచరిత్ర, దొప్పలపూడి జానకిరామయ్య, పాలపర్రు, 2001, పుట: 5, 6.

## 3. నెడుంపాటికంద్రిక

పాలపర్రు (పెదనందిపాడు మండలం) గ్రామానికి ఆగ్నేయదిశలో, వనంతోట పరిధిలో దుర్గప్రాంతాన నెడుంపాటికంద్రిక ఉండేది. క్రీ.శ. 1790 వరదలకు మునిగిపోయింది.

**ఆధారం:** పాలపర్రు గ్రామచరిత్ర, దొప్పలపూడి జానకిరామయ్య, పాలపర్రు, 2001, పుట: 6.

## 4. గొర్లపాడు

పాలపర్రు (పెదనందిపాడు మండలం) గ్రామానికి ఉత్తరపొలిమేర హద్దు మంచినీటిబావి (పెదబావి) వద్ద గొర్లపాడు ఉండేది. పాలపర్రు, రాజుపాలెం (పెదనందిపాడు మండలం) గ్రామాల మధ్య ఈ అదృశ్యగ్రామం తమదేననే వివాదం చాలా కాలంగా ఉంది. ప్రస్తుతం గొల్లాడడొంక (గొర్లపాడు) గా పిలవబడుతున్న ఈ ప్రాంతం నల్లమడ (ఓగేరు) వాగు తీరాన ఉంది.

**ఆధారం:** పాలపర్రు గ్రామచరిత్ర, దొప్పలపూడి జానకిరామయ్య, పాలపర్రు, 2001, పుట: 6, 69.

## 5. గెలెకడిపల్లి

తూర్పు చాళుక్యుల పెదచెరుకూరు (పర్చూరు మండలం, ప్రకాశంజిల్లా) శాసనం (తేదీ తెలియదు) లో త్రివిక్రమ(వామన)స్వామికి త్రిపురములు (మూడు గ్రామాలు) దానమిచ్చిన ప్రస్తావన ఉంది. కసుకుర్రు (పొన్నూరు మండలం), కొండపాటూరు (కాకుమాను మండలం), ఇనగర్తి(పాడు) గ్రామాలను త్రిపురములు అని అంటారు. చినఇటికంపాడు (పొన్నూరు మండలం), గోపాపురం (బాపట్ల మండలం) గ్రామాల మధ్య ఇనగర్తిపాడు ఉండేది. ఆ శాసనంలోనే ఇనగర్తిపాడుకి ఉత్తరంగా గెలెకడిపల్ల(పల్లి) గ్రామం ఉన్నట్లు చెప్పబడింది. బోడిపాలెం (కాకుమాను మండలం) గ్రామానికి ఆగ్నేయంగా చినఇటికంపాడు (పొన్నూరు మండలం) గ్రామానికి వాయవ్యంగా గెలెకడిపల్లి గ్రామం ఉండవచ్చు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 6, సీరియల్ నెం. 202.
2. ఆంధ్రదేశ భూగోళసర్వస్వము, సంపాదకుడు: ఖండవల్లి లక్ష్మీరంజనం, 1976, పుట: 436, 437.

## 6. ఇనగర్తిపాడు (ఇనుగుర్తిపాడు)

చినఇటికంపాడు (పొన్నూరు మండలం) గ్రామాన్నే నందూరు ఇటికంపాడు అంటారు. చినఇటికంపాడు నుండి గోపాపురం (బాపట్ల మండలం) వెళ్ళే దారిలో, చినఇటికంపాడు గ్రామానికి దక్షిణ నైఋతిగా, గోపాపురం గ్రామానికి ఈశాన్యంగా ఓ దిబ్బ ఉంది. అదే ఇనగర్తిపాడు. నేడు ఈ దిబ్బ ప్రభుత్వ అధీనంలో ఉంది. ఇనగర్తిపాడు గ్రామాన్ని విష్ణువర్ధనమహారాజు పెదచెరుకూరు (పర్చూరు మండలం, ప్రకాశంజిల్లా) త్రివిక్రమస్వామికి దానం ఇచ్చాడు. ఇనగర్తిపాడు గ్రామకరణాలు భావరాజువారు. తర్వాత వారి ఇంటిపేరు పూండ్లగా మారింది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 202.
2. చినఇటికంపాడు గ్రామస్థులు పన్నాల సత్యనారాయణమూర్తి ఇచ్చిన సమాచారం.

## 7. వల్లూరు పరిసర అదృశ్యగ్రామాలు

వల్లూరు (కాకుమాను మండలం) గ్రామానికి చేరువలోని జాలుపాలెం, కట్టెపూడి, కాజాపేట గ్రామాలు అదృశ్యమయ్యాయి. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

కాజాపేట: వల్లూరుకు ఉత్తరం?

జాలుపాలెం-చినలింగాయపాలెం (కాకుమాను మండలం) నుండి డొంకబాట?

కట్టెపూడి - లింగంగుంట్లపాలెం (కాకుమాను మండలం) నుండి డొంకబాట?

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3,
పుట: 109, 110.

## 8. కొమ్మమూరు (కుమ్మమూరు)

వల్లభరావుపాలెం (పొన్నూరు మండలం) గ్రామానికి వాయవ్యాన 3 కి.మీ. దూరంలో మద్రాసు కాలువ (బకింగ్‌హామ్ కెనాల్) వద్ద కొమ్మమూరు ఉండేది. ఆ గ్రామంలో పృథ్వీశ్వరాలయం ఉండేది. పృథ్వీశ్వరస్వామి అభిషేకజలం పృథ్వీకాలువగా సమీప తుంగభద్ర (కొల్లిమర్ల డ్రెయిన్) లో కలిసేది. ఆ ప్రాంత రైతులకు పృథ్వీ కాలువ అని వాడుక ఉంది.

కొమ్మమూరు గ్రామం అదృశ్యమవ్వడానికి ఓ జానపదం నేపథ్యంగా ఉంది. ఓ వరుడు పెండ్లిబట్టలతో కొమ్మమూరు గ్రామానికి చేరుకుంటాడు. అప్పటికే బాగా చీకటి పడిపోయింది. అతని వెంట ఓ నవ వధువు పసుపు బట్టలతో 'నాథా, నాథా' అంటూ ఆయన వెంటపడుతూ అదే గ్రామానికి చేరుకుంటుంది. ఊరి పెద్దలు అది గమనించి, వారిద్దరినీ ఆరా తీస్తారు. వరుడు "అయ్యా! నేను పెళ్లిచేసుకున్న వెంటనే నా భార్యతో చిన్న మనస్పర్థ ఏర్పడింది. దాంతో పెళ్లిపీటల మీద నుండి లేచి ఇలా వస్తుండగా ఈవిడెవరో 'నాథా, నాథా' అంటూ నా వెంట పడుతోంది. ఈ పెళ్లిబట్టలతో ఉన్న మహిళ దెయ్యం అని నా అనుమానం" అంటాడు. ఆ మహిళ "అయ్యా! వీరే నా భర్త. చిన్న గొడవతో అలిగి ఇలా వచ్చాడు. దెయ్యం దెయ్యం అంటూ నన్ను ఆటపట్టిస్తుంటాడు" అని చెబుతుంది. దాంతో ఆ గ్రామ పెద్దలు 'మీ సమస్యకు తీర్పును రేపు చెబుతాము, మీరిద్దరూ ఈ రాత్రికి ఇక్కడే బస చేయండి' అని వారిద్దరికీ ఒక గదిని కేటాయిస్తారు. తెల్లవారుజామున గ్రామస్థులు కొందరు ఆ బస దగ్గరకు వచ్చి చూడగా వరుడు మరణించి ఉంటాడు. వధువు కనిపించదు. దాంతో గ్రామస్థులు ఎంతో పశ్చాత్తాపపడతారు. 'ఆ వరుడు ఎంతగా చెప్పినా మనం వినకపోతిమే' అని బాధపడతారు. 'మన కొమ్మమూరు గ్రామానికి ఏదో అరిష్టం చుట్టుకున్నట్లుంది. త్వరలోనే గ్రామం నాశనమవుతుంది' అని వారిలోవారు మథనపడి ఆ గ్రామపెద్దలు ఆత్మహత్య చేసుకుంటారు. జరిగిన ఈ సంఘటనను తెలుసుకున్న గ్రామస్థులు భయంతో గ్రామాన్ని వీడి ఇతర గ్రామాలకు వలస వెళ్లిపోతారు. దాంతో ఆ గ్రామం అదృశ్యమైపోయింది.

నాటి పృథ్వీశ్వరాలయ జాడ కానరాదు. కొమ్మమూరు ఇప్పుడు పంటపొలాలుగా మారిపోయింది. మద్రాసు కాలువను ఈ ప్రాంత వాసులు కొమ్మమూరు కాలువ అంటారు. అప్పాపురం (కాకుమాను మండలం) గ్రామానికి సరిహద్దులో కొమ్మమూరు ఉన్నట్లు అప్పాపురం కైఫియత్తు తెలియజేస్తుంది. గరికపాడు (కాకుమాను మండలం) కైఫియత్తులో ఆ గ్రామ సరిహద్దులలో కొమ్మమూరు చెరువు తట్టున అని ఉంది. రేటూరు (కాకుమాను మండలం) కైఫియత్తులో కూడా గ్రామ సరిహద్దులలో కొమ్మమూరు పొలిమేర అని ఉంది. కొమ్మమూరు గ్రామకరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు కోనవారు, కొటికలపూడివారు; పాకనాటివారైన చికితసగోత్రులు కొణిదంబాకవారు. కొమ్మమూరు ఇంటిపేరు కల బ్రాహ్మణులు పొన్నూరు ప్రాంతంలో ఉన్నారు.

క్రీ.శ. 1393 పొన్నూరు సాక్షి భావనారాయణస్వామి దేవాలయ శాసనంలో కొమ్మమూరు ప్రసక్తి ఉంది. క్రీ.శ. 669 కొణికె (కోనంకి, పిడుగురాళ్ళ మండలం) తామ్రశాసనంలో కుమ్మమూరు (కొమ్మమూరు) ప్రస్తావన ఉంది.

**ఆధారం:**

1. ఎపిగ్రాఫియా ఇండికా, 31వ భాగం, సీరియల్ నెం. 12.
2. మెకంజీ సంపుటము. 246. పుట: 7.
3. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 3, 37, 103.
4. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 13.
5. శ్రీ ఓంకారేశ్వర ఆలయచరిత్ర, కోన రాధాకృష్ణమూర్తి, వల్లభరావుపాలెం, 1988. పుట: 14-19.

## 9. శివరాముని బుచ్చన్నపాలెం

పుసులూరు (పెదనందిపాడు మండలం) గ్రామానికి చేరువలో శివరాముని బుచ్చన్నపాలెం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 202.

## 10. గరువుగుంట

మామిళ్ళపల్లి (పొన్నూరు మండలం), దండమూడి (పొన్నూరు మండలం) రహదారిలో గరువుకుంట అనే చెరువుంది. చెరువు పక్కన గ్రామం ఉండేదని, దాని పేరు గరువుగుంట అని పెద్దలు అంటారు. నీరు తగ్గినప్పుడు చెరువు(గరువుగుంట)లో కొన్ని బావులు, పాతకాలపు కుండపెంకులు కనిపిస్తుంటాయి. గరువుగుంట సమీప పొలంలో బావిని తవ్విస్తుండగా ఆలయగోపురం కనిపించిందని, పొలం యజమాని బావిని పూడ్పించేశాడని పుకారు ఉంది. గరువుగుంటవద్ద పూర్వం పిచ్చికుంట్లవారు ఉండేవారు.

**ఆధారం:** మామిళ్ళపల్లి గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 11. గరికపాడు పరిసర అదృశ్యగ్రామాలు

గరికపాడు (కాకుమాను మండలం) సమీపంలో వెసనపాడు, చింతలచెరువు వారిపాలెం, కాననపూడివారిపాలెం, జలీల్‌ఖానునిపాలెం (డొంకబాటలో) అను గ్రామాలుండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 37

## 12. కొండపాటూరు పరిసర అదృశ్యగ్రామాలు

కొండపాటూరు (కాకుమాను మండలం) సమీపాన భాస్కరయ్యపాలెం, బయటవాండ్లపాలెం గ్రామాలుండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 21.

## 13. కొండ్రాజుపాడు, నందికుంటకాశికాలవారిపాడు

రేటూరు (కాకుమాను మండలం) గ్రామానికి ఈశాన్యదిశలో కొండ్రాజుపాడు ఉండేది. ఇది జైన నివాసం. త్రిలోచనపల్లవమహారాజు పాలనలో ఈ ప్రాంతానికి వచ్చిన కాశీ బ్రాహ్మణులకు కొండ్రాజుపాడు జైనులకు జరిగిన వివాదం వలన కొండ్రాజుపాడు అదృశ్యమయ్యింది. నందికుంటకాశికాలవారిపాడు రేటూరుకు పడమర ఉండవచ్చు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 100, 101.

## 14. దొడ్డివారిపాలెం

పాంద్రపాడు (కాకుమాను మండలం) గ్రామానికి తూర్పు మురుగుకాలువ (వాగు) వద్ద దొడ్డివారిపాలెం ఉండేది. దొడ్డి ఇంటిపేరుతో కమ్మ, కాపు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** ఉప్పరపాలెం (పొన్నూరు మండలం) గ్రామస్థులు గోవాడ సాంబయ్య ఇచ్చిన సమాచారం.

## 15. పెద్దికేశవులుపాలెం

వల్లూరు (కాకుమాను మండలం) గ్రామానికి తూర్పుదిశలో పెద్దికేశవులుపాలెం గ్రామం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. పెద్ది ఇంటిపేరు కల కమ్మ కులస్థులు కాకుమాను మండలంలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 109.

## 16. జులాయిపాలెం

వల్లూరు (కాకుమాను మండలం) గ్రామానికి దక్షిణంగా జులాయిపాలెం గ్రామం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 110.

## 17. గుంటుపల్లివీరన్నపాలెం

వరగాని (పెదనందిపాడు మండలం) గ్రామానికి ఉత్తరదిశలో గుంటుపల్లివీరన్నపాలెం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. గుంటుపల్లి ఇంటిపేరు గల కమ్మ కులస్థులు ప్రత్తిపాడు, పెదనందిపాడు మండలాలలో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 1, పుట: 84

## 18. పిచ్చికలపాలెం

తెలగాయపాలెం (కాకుమాను మండలం) గ్రామానికి చేరువలో పిచ్చికలపాలెం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. పిచ్చికలపాలెంను పచ్చిక (గొడ్లమేత)ల పాలెంగా భావించాలి.

**ఆధారం:** దొప్పలపూడి (పొన్నూరు మండలం) గ్రామస్థులు ఉప్పల బసవేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 19. రామచంద్రపురం

కట్టెంపూడి (పొన్నూరు మండలం) అడ్డరోడ్డు ఆర్చి ఎదురుగా ఉన్న దొప్పలపూడి (పొన్నూరు మండలం) రహదారిలో రామునికుంట వద్ద రామచంద్రపురం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. నూజెండ్ల మండలం పువ్వాడ గ్రామం వద్ద కూడా రామచంద్రపురం అదృశ్యగ్రామం కలదు.

**ఆధారం:** దొప్పలపూడి (పొన్నూరు మండలం) గ్రామస్థులు ఉప్పల బసవేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 20. రాజవోలు

బొప్పుడి (బొబ్బిలిపట్నం) పాలకుడు బొబ్బిలిదేవమహారాజు కొందరు జైనులకు అన్నపర్రు (పెదనందిపాడు మండలం) సమీపాన భూమిని ఇచ్చాడు. వారు రాజవోలు గ్రామాన్ని నిర్మించుకున్నారు. జైనులు రాజవోలు నుండి వెళ్లిపోయాక ఆ ప్రాంతం దిబ్బగా మారింది. కాలక్రమేణా దక్షిణాది నుండి చిరమన (అన్నసముద్రంపేట మండలం, నెల్లూరుజిల్లా) గ్రామస్థులు అన్నంరాజు, చిగిలిరాజు, కోనంరాజు అను అన్నదమ్ములు ఇక్కడకు వచ్చి పెద్దవాడైన అన్నంరాజు పేరుతో అన్నపర్రు గ్రామాన్ని నిర్మించారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 4.

# రేపల్లె తాలూకా

1. రేపల్లె మండలం
2. భట్టిప్రోలు మండలం
3. నగరం మండలం
4. నిజాంపట్నం మండలం
5. చెరుకుపల్లి మండలం

## 1. ఉద్దండవేమవరం

క్రీ.శ. 1712? కొండవీడుసీమను జమీందార్లకు పంచినప్పుడు పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం) సమితిలోని 48 గ్రామాలలో ఉద్దండవేమవరం (రేపల్లె తాలూకా) ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. స్వయంభట్ల వేమవరం (భట్టిప్రోలు మండలం) ఇదే సమితిలో ఉంది. గుంటూరుజిల్లాలోని ఫిరంగిపురం, మాచవరం మండలాలలో కూడా వేమవరం గ్రామాలున్నాయి. అలాగే పొన్నపల్లి (చెరుకుపల్లి మండలం), ఆలపాడు (చుండూరు మండలం) గ్రామాలకు కూడా ప్రతినామం వేమవరం. రాజులు గ్రామాలను దానం చేసేటప్పుడు గ్రామం పేరు మార్చి తమ పేరో, తమకిష్టులైనవారి పేరో పెట్టేవారు. వారి రాచరికం అంతరించిన తర్వాత ఆయా గ్రామాలకు కొన్నిచోట్ల పాత పేర్లే వ్యవహారంలోకి వచ్చేవి.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: , పుట: 186

## 2. దక్షిణ కొంపల్లె

అయిలవరం (భట్టిప్రోలు మండలం) గ్రామ సమీపాన దక్షిణ కొంపల్లె ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. అయిలవరం గ్రామాన్ని అయిలారం అని కూడా అంటారు. గుంటూరుజిల్లాలో అయిలవరం గ్రామం మరోచోట ఉన్నదేమో పరిశీలన చేయాలి.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: , పుట: 65.

## 3. నిజాంపట్నం పరిసర అదృశ్యగ్రామాలు

నిజాంపట్నం వద్ద అనేక పాలెములు ఒకానొకప్పుడు ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. కుమ్మరివాండ్లపాలెం, నక్కలవాండ్లపాలెం, గంగులవాండ్లపాలెం, గొల్లపాలెం, కొత్తకర్లపాలెం, దిండిపాలెం మొదలగు గ్రామాల సమాచారం తెలియవలసివుంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 213.

## 4. భైరవపాలెం (భైరవేశ్వరం)

గుళ్ళపల్లి (చెరుకుపల్లి మండలం) సమీపాన భైరవేశ్వరం ఉండేది. దగ్గరలో అనేక గుళ్ళు ఉండుట వలన గుళ్ళపల్లికి ఆ పేరు వచ్చింది. గుళ్ళపల్లిలో ఉన్న కాలభైరవస్వామిని పెదన (కృష్ణాజిల్లా) గ్రామస్థుడు శింగరాజు మల్లేశం తీసుకువెళ్లాడు. 2012? లో గుళ్ళపల్లికి దక్షిణాన నూకాలమ్మ ఆలయ పునర్నిర్మాణంలో ఓ రాగిరేకు లభించింది. అందులో గ్రామం పేరు భైరవపాలెం అని ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 159-161.
2. గుళ్ళపల్లి వాస్తవ్యులు కాటూరి నాగేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 5. భట్టిప్రోలు పరిసర అదృశ్యగ్రామాలు

కొండవీదు దండకవిలె వరస కరణీకపట్టికలో పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం), అళ్ళమూడి (భట్టిప్రోలు మండలం), దర్శి, జిల్లేపల్లి (నగరం మండలం), కొల్లివాయి, పల్లెకోన (భట్టిప్రోలు మండలం), ముద్దనంపాడు, రావి అనంతవరం (రేపల్లె మండలం), తూర్పు వేమవరం (స్వయంభట్ల వేమవరం, భట్టిప్రోలు మండలం) మొదలైన గ్రామాలున్నాయి. ఈ గ్రామాలలో దర్శి, ముద్దనంపాడు, కొల్లివాయి నేడు కనిపించవు.

దర్శి కరణాలు వెలనాటివారైన ఆత్రేయసగోత్రులు. వీరి ఇంటిపేరు తెలియలేదు. అళ్ళమూడి, పల్లెకోన గ్రామాలకు కూడా వీరే కరణాలు.

ముద్దనంపాడు, రావి అనంతవరం కరణాలు వెలనాటివారైన కాశ్యపసగోత్రులు. ఇంటి పేరు తెలియదు. కొల్లివాయి గ్రామకరణాలు వెలనాటివారైన ఆత్రేయసగోత్రులు పుర్మివారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 42.

## 6. శివంగులపాలెం

రాచూరు (భట్టిప్రోలు మండలం) జమీందారుకి ఓ వ్యాధి వచ్చిందట. ఎందరు వైద్యులు ప్రయత్నించినా ఆ వ్యాధిని నయం చేయలేక పోయారట. చివరకు వేదాల వంశీయులైన ఇద్దరు సోదరులు వచ్చి ఆ విచిత్రవ్యాధిని నయం చేసారట. జమీందారు సంతృప్తి చెంది వారికి కొంత ధనాన్ని ఇవ్వబోగా వారు తీసుకోడానికి తిరస్కరించారట. తదనంతరం రాచూరు జమీందారు జంగన్న మాణిక్యాలరావు తమ పూర్వులకు వైద్యం చేసిన వేదాల వంశస్థులను పిలిపించి ఐదు ఊర్లు( క్రీ.శ. 1785) దానం చేసినట్లు కథనం. అందులో పెద్దవరం (నగరం మండలం) వేదాల తిరు వేంకటేచార్యులుకు, శివంగులపాలెం (భట్టిప్రోలు మండలం) వేదాల నరసింహాచార్యులుకు ఇచ్చారు. శివంగులపాలెం గ్రామంలో నివసించేవారికి వృద్ధి ఉండదనే భావనతో గ్రామస్థులందరూ గ్రామాన్ని వీడడంతో ఆ గ్రామం 2018 లో అదృశ్యమయ్యింది. ఐలవరం (భట్టిప్రోలు మండలం) గ్రామానికి ఉత్తరంగా శివంగులపాలెం పొలాలు ఉంటాయి. గుంటూరుజిల్లా పాతమ్యాపులో శివంగులపాలెం కనిపిస్తుంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా సమగ్ర చరిత్ర, ప్రధాన సంపాదకుడు: మాజేటి సోమశేఖరరావు, 2008. పుట: 420. .
2. పెద్దవరం రంగనాయకస్వామి ఆలయ అర్చకులు, దిట్టకవి వంశీయులు ఇచ్చిన సమాచారం.

## 7. పరిశపాడు

క్రీ.శ. 1712 జమీందారీ పాలనలో పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం) సమితిలో కోనేటిపురం (భట్టిప్రోలు మండలం) గ్రామానికి దగ్గరగా పరిశపాడు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. ప్రభుత్వ రెవిన్యూ రికార్డుల్లో ఈ గ్రామం పేరు ఇప్పటికీ ఉంది.

**ఆధారం:** రేపల్లె చరిత్ర, మన్నె శ్రీనివాసరావు, రేపల్లె, 2018. పుట: 451.

## 8. అనంతవరం

రేపల్లె మండలంలో ఉన్న ఉప్పూడి-గుడ్డికాయలంక గ్రామాల మధ్యలో అనంతవరం ఉండేది. ఆ గ్రామంలో ఉన్న రంగనాయకస్వామిని రేపల్లె జమీందారు పొన్నూరు భావనారాయణ ఆలయానికి చేర్చాడు. పొన్నూరు అమరావతి జమీ లో కలిసిన తర్వాత వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు ఆ రంగనాయకస్వామిని చేబ్రోలు గ్రామంలో ప్రతిష్ఠించాడు. రేపల్లె మండలంలో మరో అనంతవరం ఉంది. అది రావి అనంతవరం. చేబ్రోలు మండలంలో మీసరగడ్డఅనంతవరం అనే గ్రామం కూడా అదృశ్యమైనది.

**ఆధారం:** రేపల్లె చరిత్ర, మన్నె శ్రీనివాసరావు, రేపల్లె, 2018. పుట: 451.

## 9. నాదెళ్ళవారిపాలెం

మంత్రిపాలెం (నగరం మండలం) గ్రామానికి చేరువగా అల్లపర్రు (నగరం మండలం) పంచాయితీలో నాదెళ్ళవారిపాలెం ఉండేది. గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. నాదెళ్ళ (నాదెండ్ల) ఇంటిపేరుతో బ్రాహ్మణ, కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:** రేపల్లె చరిత్ర, మన్నె శ్రీనివాసరావు, రేపల్లె, 2018. పుట: 451.

## 10. మండపాక

రేపల్లె తాలూకాలో లభించిన తామ్రశాసనంలో విష్ణువర్ధనమహారాజుకు ఖడ్గసహాయం చేసిన పుంనాడీశ్వరశర్మకు మండపాక అగ్రహారం దానం ఇచ్చినట్లు ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు. పశ్చిమగోదావరిజిల్లా తణుకు వద్ద ఒక మండపాక గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 2.

## 11. తూర్పు కొమరవోలు

కొండవీడు పాలకుడు అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) ప్రతి సోమవారం మోర్తోట గ్రామం (రేపల్లె మండలం) ముక్తేశ్వరస్వామిని దర్శించుకునేవాడు. అక్కడ అయన అనేక ఉత్సవాలను నిర్వహించాడు. ఒక రోజు భోజన సమయాన కొమరయ్య అను బంటు తన గురువు కోగంటివారి ప్రేరణతో అనవేమారెడ్డిని కలిసి కొంత భూమిని దానం చేయవలసిందని కోరగా ప్రభువు సమ్మతించి, తన భోజనం అయ్యే లోపు ఎంత భూమి తిరుగుతావో అంత భూమి దానం చేస్తానని చెప్పాడు. కొమరయ్య గుర్రంపై కామరాజుగడ్డ (రేపల్లె మండలం) మోర్తోట గ్రామాల వద్ద చతురస్రాకృతిలో 12 కుచ్చెళ్ళ భూమి తిరిగి హద్దులుగా తమలపాకులు వేశాడు. అనవేమారెడ్డి కొమరయ్యకు ఆ భూమిని దానం చేశాడు. కోగంటివారు శిష్యుని పేర కొమరయ్యపాలెం నిర్మించి, గ్రామ పెత్తందార్లుగా తన శిష్యులు మైనేని ఇంటిపేరు గల కమ్మవారిని ఉంచాడు. అదియే తూర్పు కొమరవోలు. ఇప్పుడా గ్రామం లేదు. నిజాంపట్నం మండలంలో ఓ కొమరవోలు, చిలకలూరిపేటలో కలిసిపోయిన (పడమటి) కొమరవోలు ఉన్నాయి.

కుచ్చెల అంటే 3ఎకరాల 40సెంట్లు భూమి.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 216, 217.

## 12. మందపాడు

పెనుమూడి (రేపల్లె మండలం) గ్రామ సమీపాన మందపాడు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. మేడికొండూరు మండలంలో కూడా మందపాడు గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64

## 13. మావలూరు, కంచెకవ్వపూడి

తూర్పు చాళుక్య వంశీయుడైన మొదటి అమ్మరాజు (క్రీ.శ. 922-928) పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం) తామ్రశాసనంలో పెదపులివర్రు సరిహద్దులుగా తూర్పున మావలూరు, దక్షిణాన కంచెకవ్వపూడి, పశ్చిమాన గొరవపుండి, ఉత్తరాన వెలంతూరు గ్రామాలను పేర్కొన్నాడు. మావలూరు, కంచెకవ్వపూడి గ్రామాల అదృశ్యకారణాలు తెలియవు. పశ్చిమాన గొరవపుండి గ్రామాన్ని నేటి గొరిగపూడి (భట్టిప్రోలు మండలం) గా భావించాలి. ఈ గ్రామం పెదపులివర్రుకి పశ్చిమాన కాకుండా ఆగ్నేయంగా ఉంది. అంటే గొరిగపూడి గ్రామ స్థలమార్పు జరిగి వుంటుందని భావించాలి. ఉత్తర హద్దుగా ఉన్న వెలంతూరు (వెల్లటూరు, భట్టిప్రోలు మండలం) ఇప్పటికీ పెదపులివర్రుకి ఉత్తరంగానే ఉంది.

విషయే పులివర్రు నామ గ్రామోమాన్నికృత్య
శాసనారూఢో సర్వాకాపరిహారోదత్తా ఇతి విదితం ఆ
స్తువాః! అస్య అవధయాః పూర్వతః (మొదటి/తూర్పు)
మావలూరు సీమ దక్షిణతః కంచెకవ్వపూడి సీమ।
పశ్చిమతః (పడమర) గొరవపుండి సీమ
ఉత్తరతః వెలంతూరు సీమ (ప్రాంతం)

**ఆధారం:**


1. పెదపులివర్రుగ్రామచరిత్ర, ముక్తేవి శేషాచార్యులు, పెదపులివర్రు, 2003. పుట: 170.
2. చావలి (వేమూరు మండలం) గ్రామస్థులు విష్ణుమొలకల లీలాసుబ్రహ్మణ్యం ఇచ్చిన సమాచారం.

## 14. బూళికపల్లి

కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో అరవపల్లి (రేపల్లె మండలం), నల్లూరు (రేపల్లె మండలం), బూళికపల్లి, జయవరం, అద్దవరం, రాచూరు (భట్టిప్రోలు మండలం), వోలేరు (భట్టిప్రోలు మండలం) మొదలగు గ్రామాలున్నాయి. వీటిలో బూళికపల్లి, జయవరం అదృశ్యమయ్యాయి. బూళికపల్లి కరణాలు పెసరువాయులవారు భారద్వాజసగోత్రులు. జయవరం, అద్దవరం గ్రామాలకు కరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు శానంపూడివారు. అద్దవరం గ్రామమే నేటి పెద్దవరం (నగరం మండలం) కావచ్చు?

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 42.

## 15. జయవరం

పల్లెకోన (భట్టిప్రోలు మండలం) గ్రామానికి చేరువలో జయవరం ఉండేది. ఈ ప్రాంతం జమీందారుల అధీనంలో ఉన్నప్పుడు పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం) సమితి 48? గ్రామాలలో జయవరం గ్రామం ఉంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఈ గ్రామకరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు శానంపూడివారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 42.
2. రేపల్లె చరిత్ర, మన్నె శ్రీనివాసరావు, రేపల్లె, 2018. పుట: 451.

## 16. నవనిధానపట్టణం

కోట గణపాంబ (క్రీ.శ. 1241-1264) పాలనలో నిజాంపట్నం వద్ద నవనిధానపట్టణం ఉండేది. (ఈ పట్టణాన్ని త్రిలోచనపల్లవమహారాజు నిర్మించాడు). తూర్పుసముద్రం (బంగాళాఖాతం) పొంగినప్పుడు నవనిధానపట్టణం కొట్టుకుపోయింది. ప్రజలు తిమ్మభూపాలపట్టణంలో తలదాచుకున్నారు. తిమ్మభూపాలపట్టణం నేడు లేదు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 174

## 17. తిమ్మభూపాలపట్టణం

కళింగదేశానికి చెందిన చంద్రవంశీయుడు తిమ్మభూపాలుడు అను రాజు నిజాంపట్నం వద్ద తన పేరుతో తిమ్మభూపాలపట్టణం నిర్మించాడు. ఇది సముద్రంలో కొట్టుకుపోయిన నవనిధానపట్టణానికి తూర్పుగా ఉండేది. తిమ్మభూపాలుడు ఈ పట్టణంలో మదనగోపాలస్వామి ఆలయం నిర్మించాడు. క్రీ.శ. 1630లో తిమ్మభూపాలపట్టణం కూడా సముద్రంలో మునిగిపోయింది. మిగిలినవారు నిజాంపట్నంలో తలదాచుకున్నారు. గోపరాజు రామన్న క్రీ.శ. 1145? లో తిమ్మభూపాలపట్టణం మిరాశిని యల్లాప్రగడ యల్లంరాజుకు ఇచ్చాడు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 174.

## 18. ఔడపాంగుల, వ్రేంకటి

కృష్ణాజిల్లా గణపేశ్వరం (నాగాయలంక మండలం) శాసనంలో కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199 - 1262) బంధువు, గజసేనాని జాయపసేనాని గణపేశ్వరదేవర అఖండదీపం కొరకు కొన్ని గ్రామాలలో భూమి దానం ఇచ్చినట్లు ఉంది. వాటిలో దోనపూడి (దోనేపూడి, కొల్లూరు మండలం), కారమూర (కారమూరు, రేపల్లె మండలం), కేతేపల్లి (క్రైతేపల్లి, రేపల్లె మండలం), ఔడపాంగుల, వ్రేంకటి గ్రామాలు ఉన్నాయి. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** దివిసీమ సర్వస్వం, యద్దనపూడి విఠల్ గోపాలరావు, యద్దనపూడి, మొవ్వ మండలం, కృష్ణాజిల్లా, 2018 పుట: 50.

# సత్తెనపల్లి తాలూకా

1. సత్తెనపల్లి మండలం
2. మేడికొండూరు మండలం
3. ఫిరంగిపురం మండలం
4. పెదకూరపాడు మండలం
5. క్రోసూరు మండలం
6. అచ్చంపేట మండలం
7. రాజుపాలెం మండలం
8. బెల్లంకొండ మండలం
9. ముప్పాళ్ళ మండలం

## 1. ఇనుమనగుండ్ల (యినుమనగుండ్ల)

కొండవీడు దండకవిలె వరస కరణీకరపట్టికలో సన్నెకండ్లపాడు (కన్నెకండ్ల, పెదకూరపాడు మండలం), ములుకుట్ల (ముస్పాపురం, పెదకూరపాడు మండలం) ఇనుమనగుండ్ల, బాలెమఱ్రు (క్రోసూరు మండలం) ఇలా ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 36.

## 2. పినపాడు, రంగవరంకుంట

పెదకూరపాడు (మండలకేంద్రం) గ్రామానికి దగ్గర్లో పినపాడు, రంగవరంకుంట ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. తెనాలి పట్టణంలో పినపాడు అనే గ్రామం కలిసిపోయినది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65.

## 3. అల్లిపురం

ముస్లిం పరిపాలనకాలంలో పెదపణిదం (సత్తెనపల్లి మండలం) గ్రామానికి తూర్పు ఈశాన్యదిశలో 2 కి.మీ దూరంలో అల్లిపురం ఉండేది. ఆ ప్రదేశంలో కొన్ని శిథిల విగ్రహాలున్నాయి. పెదపణిదం గ్రామస్థుల వాడుకలో 'అల్లిపురం డొంక' ఉంది. పెద పణిదం, అల్లిపురం మధ్యలో ఉన్న గండివాగు ఆ సమీపంలో ఉన్న యద్దువాగులో కలుస్తుంది. అల్లిపురం సమీపంలో దద్దనాల అనే గ్రామం కూడా పూర్వం ఉండేదంటారు.

**ఆధారం:** పెద పణిదం గ్రామస్థులు పంచుమర్తి సత్యనారాయణ ఇచ్చిన సమాచారం.

## 4. ములుకుట్ల

గోల్కొండ నవాబు అబుల్ హసన్ తానీషా (క్రీ.శ. 1672-1687) పాలనలో పాటిబండ్ల (పెదకూరపాడు మండలం) జాగీరుగా ఇమామ్‌ఖాన్ ఉండేవాడు. అయన తన పెద్దకుమారుడు ముస్త్యాఖాన్‌కి పాటిబండ్ల సమీపంలో ములుకుట్ల గ్రామాన్ని ఇచ్చి ముస్సాపురం (పెదకూరపాడు మండలం) గా పేరు మార్చాడు. మెకంజీ రికార్డుల్లో ముస్సాపురంను యస్సాపురంగా పేర్కొన్నాడు. అది ముద్రణాదోషం. మునుకుట్ల, ములుకుట్ల ఇంటిపేర్లతో ఆంధ్రదేశాన అనేక బ్రాహ్మణ కుటుంబాలున్నాయి. కొండవీడు దండకవిలె వరస గ్రామకరణీకపట్టికలో కూడా పెదకూరపాడు మండలంలో ఉన్న గారపాడు, కన్నెకండ్ల తరువాత ములుకుట్ల వస్తుంది. అక్కడే ఇప్పుడు ముస్సాపురం గ్రామం ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 36, 66.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 159.

## 5. దక్షిణ గంగవరం, ఉత్తర గంగవరం

కొర్రపాడు (మేడికొండూరు మండలం) గ్రామ సమీపాన దక్షిణ గంగవరం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. ఉత్తర గంగవరం కూడా కొర్రపాడు, పెదకూరపాడు గ్రామాల దగ్గర ఉండేదని కొండవీడు దండకవిలె కరణీకర పట్టిక ద్వారా తెలుస్తున్నది. ఈ దక్షిణ, ఉత్తర గంగవరాలకు కరణాలు నందవరీకులైన గౌతమసగోత్రులు. గురజాల మండలంలో కూడా గంగవరం గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 36, 46, 64

## 6. బొడ్డుపల్లి

శ్రీనాథకవి చాటువులలో తన పంటను గొడ్డేరు (యద్దువాగు) ప్రవాహం ముంచివేసిందని, ఆ ఊరు బొడ్డుపల్లి అని చెప్పాడు. సత్తెనపల్లి తాలూకాలో ప్రవహించే యద్దువాగు అమరావతికి చేరువలో కృష్ణానదిలో కలుస్తుంది. పెదపలకలూరు (గుంటూరు రూరల్ మండలం) గ్రామకరణాలు బొడ్డుపల్లివారు వైదికులు. గుంటూరుజిల్లాలో బొడ్డుపల్లి ఇంటిపేరుగల బ్రాహ్మణులు ఉన్నారు. బొడ్డుపల్లి అమరావతి వద్ద కృష్ణానది గర్భంలో ఒక లంక అని నోరి నరసింహశాస్త్రి తన కవిసార్వభౌముడు పుస్తకం లో తెలిపాడు.

**శ్రీనాథుని చాటువు:** కృష్ణవేణమ్మ గొనిపోయెనింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేదు నూర్లు.

**ఆధారం:**

1. శ్రీనాథుని చాటువులు, సంపాదకుడు: కోడూరు ప్రభాకరరెడ్డి, ప్రొద్దుటూరు, కడపజిల్లా, 2005, పుట: 25.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 42.

## 7. శానంపూడి

మందపాడు (మేడికొండూరు మండలం) గ్రామ సమీపాన శానంపూడి ఉండేది ఈ గ్రామహద్దులు తెలియవు. క్రీ.శ. 1558లో మంగళగిరి నరసింహస్వామికి శానంపూడి గ్రామంలో కొంత భూమిని దానంగా ఇచ్చారు. శానంపూడి కరణాలు కౌండిన్యసగోత్రులు సంపుటంవారు. శావల్యాపురం మండలంలో కూడా శానంపూడి గ్రామం ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65, 33
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 120.

## 8. యర్రవరం

కొండవీటిసీమ దండకవిలె వరస కరణీకపట్టికలో పేరేచర్ల (మేడికొండూరు మండలం), పెదపలకలూరు (గుంటూరు రూరల్ మండలం) గ్రామాల దగ్గరలో యర్రవరం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. పేరేచర్ల గ్రామకరణాలు మౌద్గల్యసగోత్రులు పెసరవాయులు (కొసరునాయలు?). వారే యర్రవరం గ్రామానికి కూడా కరణాలు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 34, 35.

## 9. యాబలూరు

క్రీ.శ. 1592? నాడు కొండవీడు అమీన్‌గా వచ్చిన ఉల్ ముల్క్ ముల్లగూరు అగ్రహారంతోపాటు యాబలూరు గ్రామాన్ని, అక్కడున్న శివ, కేశవ ఆలయాలను ధ్వంసం చేశాడు. యాబలూరు ప్రాంతంలోనే వేములూరుపాడు (ఫిరంగిపురం మండలం) ఏర్పడింది. యాబలూరు పొలంలో ఉల్ ముల్క్ తన పేరుతో అమీనాబాద్ (ఫిరంగిపురం మండలం) గ్రామాన్ని నిర్మించాడు. యాబలూరు కరణాలు వెలనాటివారైన గౌతమసగోత్రులు యాబలూరువారు, వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు దాంతివారు. యాబలూరు ఇంటిపేరుకల బ్రాహ్మణులు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 30
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 31, 32.

## 10. వసంతలపాడు

అబ్బూరు (సత్తెనపల్లి మండలం) గ్రామానికి నైఋతిదిశలో వసంతరాయుడు అను లింగమూర్తిని ప్రతిష్ఠ చేసి, ఆలయాన్ని నిర్మించి, వసంతలపాడు గ్రామాన్ని ఏర్పాటుచేశారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 121.

## 11. కంచరపేట

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) కాలంలో బెల్లంకొండ పాలకుడు పరుచూరి పాపానాయనింగారు క్రీ.శ. 1554 లో క్రోసూరు (మండలకేంద్రం) గ్రామ దక్షిణదిశ నాలుగు రోడ్ల కూడలి యందు సంత పెట్టించి, పరిపాలనకై అధికారులను నియమించారు. నేటి వరకు ఆ సంత జరుగుతూనే ఉంది. తొలుత శుక్రవారం ఈ సంత జరిగేది. ప్రస్తుతం సోమవారం జరుగుతుంది. ఈ సంతపేటకు ఉత్తరభాగాన కంచర కులస్థులు కంచరపేట అను గ్రామాన్ని నిర్మించారు. ఈ గ్రామం ఇప్పుడు లేదు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 143.

## 12. చిలుకూరు

నందిగామ (సత్తెనపల్లి మండలం) గ్రామానికి సమీపాన చిలుకూరు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఆ గ్రామానికి చెందిన పంటపొలాలు నందిగామలో కలిసిపోయాయి. నందిగామ, చిలుకూరు గ్రామాలకు కరణాలు పాకనాటివారైన చికితసగోత్రులు కొణిదెంబాకవారు. కరవు వల్ల వీరు తమ హక్కును అమ్ముకుని వేరే ప్రాంతానికి వెళ్లిపోయారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 171.

## 13. శంకరలింగంమఠం (శంకరలింగంపాడు)

సత్తెనపల్లి పట్టణానికి వాయువ్యదిశలో శంకరలింగంమఠం ఉండేది. యద్దువాగు వరదలో ఈ గ్రామం కొట్టుకుపోయింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 223.

## 14. వెలంటూరు

ఇప్పుడు సత్తెనపల్లి ఉన్న ప్రాంతంలో వెలంటూరు ఉండేది. చందోలును రాజధానిగా పాలించిన వెలనాటి కులోత్తుంగ గొంక చోడరాజు (క్రీ.శ. 1130-1160) బంటు మల్లు (మట్ల) నాయకుడు క్రీ.శ. 1138 లో తన అన్న పొలినాయకుడి ధర్మంగా కొండపడమటి సీమలో వెలంటూరులో త్రికోటేశ్వరస్వామిని ప్రతిష్ఠించి, ఆలయాన్ని కట్టించి, అదే గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. సత్తెనపల్లికి పశ్చిమాన వెలంటూరు ఉండేదంటారు. ఈ గ్రామం యద్దువాగు వరదలో కొట్టుకుపోయింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 222, 223.

## 15. నివాసపాడు

సంక్రాంతిపాడు (నాదెండ్ల మండలం) గ్రామానికి రెండు కిలోమీటర్ల దూరంలో నివాసపాడు ఉండేది. సమీప రైతాంగం ఈ ప్రాంత పొలాలను నివాసపాడు పొలాలు అంటారు. స్థానిక బచ్చుల సుబ్బారావు పొలంలో లభించిన ఆంజనేయస్వామి విగ్రహానికి ఆలయం నిర్మించారు. ఆ ఆలయానికి దక్షిణంగా 5 ఎకరాల చెరువు ఉంది. ఆ చెరువును నాగులచెరువు అంటారు. ఆ చెరువులో నాగకన్యలు జలకాలాడేవారట. అందుకే ఆ పేరు.

**ఆధారం:** ఫిరంగిపురం మండల గ్రామాల చరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 90.

## 16. దేచవరప్పాడు

తొండపి (ముప్పాళ్ళ మండలం) గ్రామానికి ఉత్తరంగా, మాదల (ముప్పాళ్ళ మండలం) గ్రామానికి పశ్చిమంగా దేచవరప్పాడు ఉండేది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఈ గ్రామం శిథిలమయ్యాక గ్రామస్థులు మాదల గ్రామానికి చేరుకున్నారు. 1979 గుంటూరుజిల్లా దేవదాయ ఆలయపట్టిక ప్రకారం దేచవరప్పాడులో వీరాంజనేయస్వామి ఆలయం ఉండేది. ఇప్పుడు ఎక్కడ ఉందో తెలియదు.

**ఆధారం:** మాదల గ్రామస్థులు వంగిపురం లక్ష్మీకాంతం ఇచ్చిన సమాచారం.

## 17. తక్కెళ్ళపాడు పరిసర అదృశ్యగ్రామాలు

ఫిరంగిపురం మండలం తక్కెళ్ళపాడు గ్రామాన్ని పెదతక్కెళ్ళపాడు అంటారు. ఇక్కడే చినతక్కెళ్ళపాడు, చెముళ్ళకుంటి, పడమటి జంపని గ్రామాలు ఉండేవి. ఈ గ్రామహద్దులు తెలియవు. చినతక్కెళ్ళపాడు గ్రామకరణాలు వెలనాటివారైన హరితసగోత్రులు చిలకావారు. చెముళ్ళకుంటి గ్రామకరణాలు వెలనాటివారైన కౌశికసగోత్రులు చెముళ్ళకుంటివారు, పడమటి జంపని గ్రామకరణాలు భారద్వాజసగోత్రులు గోవాడవారు. చెముళ్ళకుంటి జెముళ్ళకంటి (తుముళ్ళకంటి?) గా నామాంతరం చెందే అవకాశం ఉంది. పెదతక్కెళ్ళపాడు విశ్వేశ్వరాలయంలో ఉన్న శాసనం ప్రకారం చినతక్కెళ్ళపాడు ఆంజనేయస్వామిని సవరం అన్నాపాత్రులు చేయించారు. శాసన సమయం తెలియదు.

ఆధారం:

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 30.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 293.

## 18. రాజుపాలెం

పూర్వం చింతపల్లి(అచ్చంపేట మండలం) గ్రామంలో ఒకరి ఇంట సత్తెమ్మ జన్మించింది. తదుపరి ఆమె వయసుకు రాగానే మాదిపాడు(అచ్చంపేట మండలం) గ్రామంలోని కొరివి కుటుంబంలో ఓ మూగ వానికి ఇచ్చి వివాహం జరిపించారు. అనంతరం మెట్టించివారు మూగవాని భార్య సత్తెమ్మను చులకనగా చూడగా, ఆమె తన తండ్రి ద్వారా తన భర్తతో వెళ్ళి చింతపల్లిలో కాపురం పెట్టినది. ప్రతిరోజు సమీప రాజుపాలెం గ్రామం వెళ్ళి పాలు, పెరుగు అమ్ముకొనుచూ జీవనం సాగించేది. ఓసారి రాజుపాలెం గ్రామస్థులకు ఓ వింతవ్యాధి వచ్చినది. వారికి సోదిలో సత్తెమ్మను బలి ఇచ్చెనచో ఆ వ్యాధి నయమవుతుందని చెప్పారు. ఈ విషయం గ్రామస్థులు సత్తెమ్మకు తెలపగా ఆమె ఒప్పుకుంటుంది. రాజుపాలెం గ్రామంలో ఓగోతిలో నిలువుగా సత్తెమ్మను పూడ్చి పైన అఖండ దీపంపెట్టి ఆ గ్రామస్థులు దాటుకొనివెళ్ళారు.

అంతటితో వారి వ్యాధి నయం అయినది. ఈ విషయం తెలిసిన సత్తెమ్మ భర్త అక్కడికి చేరుకొనగా ఆమె శిలగాఉన్నది. భర్తకు మాటలు వచ్చాయి. అక్కడే సత్తెమ్మ ఆలయం నిర్మించారు.

అయితే రాజుపాలెం గ్రామం ఎందుకు అదృశ్యమైనదో సరైన కారణం తెలయలేదు. ఇదే ఊరిలో సుమారు 1812లో మెకంజీదొర 13వ శతాబ్దినాటి శాసనం సేకరించారు. రాజుపాలెం(మండల కేంద్రం)అనే మరో గ్రామం కూడా సత్తెనపల్లి తాలూకాలో ఉన్నది.

**ఆధారం:** సత్తెమ్మతల్లి విడియో కార్యక్రమం

## 19. కోళ్లూరు

కోళ్ళూరు కృష్ణానది తీరాన ఉండేది. ఇది వజ్రాలకు ప్రసిద్ధి. ప్రపంచప్రసిద్ధిగాంచిన కోహినూర్ వజ్రం లభించింది ఇక్కడే. పులిచింతల ప్రాజెక్టులో భాగంగా కోళ్లూరు (బెల్లంకొండ మండలం) గ్రామం ఖాళీ చేయించారు. చుట్టూ కొండలు ఉండుట వలన కొండలూరు అని, కోయలు ఇక్కడ అధికసంఖ్యలో ఉండుట వలన కోయలూరు అని, కోడలు ఊరు అని, కాలక్రమేణా కోళ్లూరు అనే పేరు వచ్చిందని అంటారు. ఇక్కడ ప్రసిద్ధి చెందిన ఆంజనేయస్వామి ఆలయం ఉంది. ఓ వికలాంగశిల్పి ఆంజనేయస్వామిని రూపొందించాడట. 2012లో ఈ గ్రామం మొత్తం ఖాళీ అయ్యింది. సత్తెనపల్లి – పిడుగురాళ్ళ మార్గంలో బెల్లంకొండ అడ్డరోడ్డు వద్ద కోళ్లూరు ఆంజనేయస్వామికి ఆలయాన్ని నిర్మించి, అందులో ప్రతిష్టించారు. 2008లో నేను (రచయిత) కోళ్లూరు ఆంజనేయస్వామి ఆలయాన్ని దర్శించుకోడానికి వెళ్లినపుడు ఈ ఊర్లో నాలుగు శిలాశాసనాలు కనిపించాయి. పులిచింతల ప్రాజెక్టు కారణంగా అత్యంత విలువైన ఆ శాసనాలను అక్కడే కృష్ణానదిలో వదిలివేయడం చరిత్రపై మనకున్న నిర్లక్ష్యాన్ని తెలియజేస్తుంది.

**ఆధారం:** బెల్లంకొండ మండల ప్రాభవము, భూక్యా చిన వెంకటేశ్వర్లు,
గుంటూరు, 1999. పుట: 57.

## 20. కయ్యూరు

క్రీ.శ. 1171 సిరిపురం (మేడికొండూరు మండలం) శాసనంలో స్థానిక రామేశ్వరదేవరకు కయ్యూరు సమీప భూమిని దానంగా ఇచ్చినట్లు ఉంది. ఇప్పుడు కయ్యూరు గ్రామం లేదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 177

## 21. కామేపల్లి

కృష్ణానది తీరాన ఉన్న కామేపల్లి (బెల్లంకొండ మండలం) గ్రామం వరదల్లో కొట్టుకుపోయింది. కొందరు గ్రామస్థులు పిడుగురాళ్ళ వద్ద కామేపల్లి గ్రామాన్ని నిర్మించు కున్నారు?. మరికొందరు గ్రామస్థులు తిరిగి కృష్ణ ఒడ్డున కామేపల్లి గ్రామాన్ని నిర్మించు కున్నారు. క్రీ.శ. 16వ శతాబ్ది? లో దూపాటి (ప్రకాశంజిల్లా) పాలకుడు సాయపనేని వెంకటపతి కృష్ణాతీరాన కామేపల్లి అగ్రహారాన్ని కాకునూరి అప్పకవి పూర్వీకులకు దానంగా ఇచ్చాడు. కాకునూరి అప్పకవి తన అప్పకవీయం గ్రంథంలో తల్లిదండ్రులు కామేపల్లి వాస్తవ్యులని చెప్పుకున్నాడు.

'...కృష్ణయామ్య తీరమున బ్రహ్మాశ్రమమున దండకాటవి నంధ్రాభిధాన పుణ్యదేశమున శ్రీగిరీశాన్యదిశను గొండవీటి పడమట దంగెడ విషయముననుగామెపల్లిని గోపాల ధామముననుు...'

భావము: ..కృష్ణానది తీరాన బ్రహ్మాశ్రమాన దండకారణ్యంలో ఆంధ్రదేశాన శ్రీశైల క్షేత్రానికి ఈశాన్య దిక్కున, కొండవీడు పడమరనున్న తంగెడసీమలోని కామేపల్లి కృష్ణాలయములో..

2012లో పులిచింతల ప్రాజెక్టు నిర్మాణకారణంగా కామేపల్లి గ్రామాన్ని ఖాళీ చేయవలసివచ్చింది. ఇప్పటికి కృష్ణాతీరాన ఓ చిన్న కొండపై కామేపల్లి వరద వేణుగోపాలస్వామి శిథిలాలయం ఉంది. ఈ ఆలయంలో మూడు శాసనాలు ఉన్నాయి.

**ఆధారం:** అప్పకవీయం, కాకునూరి అప్పకవి, కామేపల్లి,
బెల్లంకొండ మండలం, 1922, పుట: పీఠిక 5

## 22. మొగలుట్ల, కొంపల్లి

బెల్లంకొండ మండలంలో ఉన్న పాపాయపాలెం, మన్నెసుల్తాన్‌పాలెం గ్రామాల సమీపాన బుగ్గమల్లేశ్వరం ఆలయముంది. ఇక్కడున్న బుగ్గ (ఊటగుంట) ద్వారా 200 ఎకరాల పొలం సాగయ్యేది. ఈ బుగ్గమల్లేశ్వరం వద్ద మొగలుట్ల ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

క్రీ.శ. 1219 మొగులుట్ల శాసనంలో కోట బేతరాజు (కాకతీయ గణపతిదేవచక్రవర్తి చిన్నల్లుడు) పుణ్యలోకప్రాప్తికి అతని భార్య గణపాంబ మొగులుట్ల, పిల్లుట్ల (మాచవరం మండలం) గ్రామాలను రుద్రిపెద్దింగారికి దానంగా ఇచ్చినట్లు ఉంది. ఈ గ్రామానికి తూర్పున అడ్డపుగట్టు, ఆగ్నేయం ఇనుపగనుల పెద్దకొండ, దక్షిణాన ఎర్రవాగు, నైఋతియందు భోగపతికొండ, పడమరగా శిలాసుషిరం (క్వారీ), వాయవ్యాన పిల్లుట్ల, కొంపల్లి, ఉత్తరాన దెయ్యంకుంట, ఈశాన్యాన బొల్లిరాయి (శ్వేతశిలాపర్వతం) హద్దులుగా ఉన్నాయి. కొంపల్లి జాడ తెలయదు.

క్రీ.శ. 1273 అమరావతి శాసనంలో కాకతీయ రుద్రమదేవి (క్రీ.శ. 1262-1289) కొండనతవాడిలోని మెగల్లు అగ్రహారాన్ని చిన్నసోమరాజు అల్లుడు రుద్రయ్యకు ఇచ్చినట్లు ఉంది. కొండనతవాడి ప్రాంతం అచ్చంపేట, బెల్లంకొండ, రాజుపాలెం, క్రోసూరు? మండలాలలో ఉంది. వుట్ల (ఉట్ల) అంటే నీటిఊట కావున మెగల్లు, మొగులుట్ల ఒకటే. మొగులుట్ల గ్రామాన్ని మెగలురేగడ, మొగలుగుట్ల అని కూడా అంటారు.

**ఆధారం:**

1. బెల్లంకొండ మండల ప్రాభవము, భూక్యా చిన వెంకటేశ్వర్లు, గుంటూరు, 1999. పుట: 49.
2. మన్నెసుల్తాన్‌పాలెం గ్రామస్థులు కంకర నరసింహారెడ్డి ఇచ్చిన సమాచారం.
3. ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యూమ్: 4, పుట: 93 - 103
4. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 6, సీరియల్ నెం. 237.

## 23. గుడిబండ

బెల్లంకొండ మండలంలో ఉన్న మన్నెసుల్తాన్‌పాలెం- వెంకటాయపాలెం గ్రామాల మధ్య గుడిబండ ఉండేది. సమీపంలో ఉన్న రామలింగాలబండపై వున్న శివాలయ,రామాలయ ఉత్సవాలను గుడిబండ గ్రామస్థులు నిర్వహించేవారు. ఇక్కడి శివాలయంలో నంది జీవనందిగా ప్రసిద్ధి. గుంటూరుజిల్లాలో గుదిబండి ఇంటిపేరుకల రెడ్లు అనేకులు ఉన్నారు. గుడిబండ ఇంటిపేరు గుదిబండ/గుదిబండిగా మారినది. సూర్యాపేట (తెలంగాణ), అనంతపురం, చిత్తూరు జిల్లాలలో కూడా గుడిబండ గ్రామాలు ఉన్నాయి.

**ఆధారం:** మన్నెసుల్తాన్‌పాలెం గ్రామస్థులు కంకర నరసింహారెడ్డి ఇచ్చిన సమాచారం.

## 24. కేతవరం

కృష్ణాతీరాన ఉన్న కేతవరం (బెల్లంకొండ మండలం) గ్రామం 12వ శతాబ్దికే ఉన్నట్లు చారిత్రక ఆధారాలున్నాయి. పులిచింతల ప్రాజెక్టులో భాగంగా ఈ గ్రామాన్ని ఖాళీ చేయించారు. ధరణికోట (అమరావతి) పాలకుడు మొదటి కోట కేతరాజు (క్రీ.శ. 1148-1156) పేరిట కేతవరం గ్రామం ఏర్పడినట్లు చెబుతారు. ఈ గ్రామంలో కొన్ని శాసనాలు రికార్డు అయ్యాయి. కేతవరంకోటకు రెడ్డిరాజులకాలం నుండి ప్రత్యేక పాలకులు ఉండేవారు. క్రీ.శ. 1515లో కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1529) కేతవరం పాలకుడు పూసపాటి రాచిరాజును ఓడించాడు. పూసపాటి రాచిరాజు కేతవరం పాలకుడనే విషయం కామేపల్లి (బెల్లంకొండ మండలం) వేణుగోపాలస్వామి ఆలయుశాననంలో ఉందని పెద్దలు చెబుతారు. సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) పాలనలో కేతవరం పాలకుడుగా శ్రీనాథరాజు రామయ్యదేవ (క్రీ.శ. 1552) ఉండేవాడు. ఆనాడు కేతవరం జలవర్తక కేంద్రం.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 13.

## 25. ఉన్నవగురప్పపాలెం

పెదకూరపాడు (మండలకేంద్రం) గ్రామానికి ఉత్తరాన ఉన్నవ గురప్ప తన పేరుతో గ్రామాన్ని నిర్మించాడు. గురప్పపాలెంకి ఉత్తరాన కామినేని నారాయణ తవ్వించిన చెరువు (కుంట) ఉండేది. ఉన్నవ ఇంటిపేరుకల కమ్మ కులస్థులు పెదకూరపాడులో ఉన్నారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 182, 184.

## 26. దరియాపురం

పెదకూరపాడు (మండలకేంద్రం) గ్రామానికి నైఋతిదిశలో దరియాపురం ఉండేది. నిజాం నవాబుల కాలంలో పెదకూరపాడు పాలకుడైన దర్యాఖాన్ సర్దార్ తన పేరుతో పెదకూరపాడు నైఋతి భాగాన ఒక కి.మీ. దూరంలో దర్యాపురం గ్రామాన్ని నిర్మించాడు. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 182, 183.

## 27. ఆముదాలపల్లి

కొమెరపూడి (సత్తెనపల్లి మండలం) గ్రామానికి పశ్చిమాన ఆముదాలపల్లి ఉండేది. ఇంతకు మించి వివరాలు లేవు. నిజాంపట్నం మండలంలో కూడా ఆముదాలపల్లి ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 138.

## 28. అణ్ణసంమూడి

క్రీ.శ. 1376 అమీనాబాద్ (ఫిరంగిపురం మండలం) శాసనంలో స్థానిక ముల్లగూరమ్మ ఆలయ సరిహద్దుల ప్రస్తావనలో ఆలయానికి ఉత్తరంగా అణ్ణసంమూడి గ్రామం ఉన్నట్లు చెప్పబడింది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 214

## 29. పడమర చింతలపూడి, లక్ష్మీదేవిపాడు

చోడరాజు ఐదుగురు బోయసోదరులకు కొంత భూమి దానంగా ఇచ్చాడు. వారిలో పెద మక్కెడు పెదమక్కెన (సత్తెనపల్లి మండలం) గ్రామాన్ని, చిన మక్కెడు చినమక్కెన (పెదకూరపాడు మండలం) గ్రామాన్ని, లింగడు లింగంగుంట్ల (పెదకూరపాడు మండలం) గ్రామాన్ని, గన్నెడు గన్నెపూడి (సత్తెనపల్లి మండలం) గ్రామాన్ని, చింతడు చింతలపూడి గ్రామాల్ని నిర్మించుకున్నారు. వీరి సోదరి లక్ష్మి పేరుమీద లక్ష్మీపాలెం (లక్ష్మీదేవిపాడు) గ్రామాన్ని నిర్మించారు. చింతలపూడి గ్రామానికి భీమవరపువారు, మంగెనపూడివారు, మక్కెనవారు కరణాలు. వాసిరెడ్డివారి జమీలో చింతలపూడి ఉండేది. చింతలపూడి, లక్ష్మీదేవిపాడు అదృశ్య గ్రామాల సమాచారం లభించలేదు. పెదమక్కెన – గన్నెపూడి గ్రామాల మధ్య చింతలపూడి ఉండేది.

గుడిపూడి (సత్తెనపల్లి మండలం) నుండి చింతలపూడి డొంక అని వాడుక ఉంది. పడమర చింతలపూడిగా పిలిచే ఈ గ్రామ కరణాలు కాశ్యపసగోత్రులు కేతలవారు. వీరు కౌండిన్యసగోత్రులు కాటూరి మంత్రిరాజుకి తమ మిరాశి (హక్కు)ని విక్రయించుకున్నారు.

గుంటూరుజిల్లాలో పొన్నూరు మండలం, దుగ్గిరాల మండలంలో కూడా చింతలపూడి గ్రామాలున్నాయి.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 50.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 25, 26.

## 30. రామగుళ్ళపాడు

సంక్రాంతిపాడు (నాదెండ్ల మండలం) గ్రామానికి ఉత్తరదిశలో 2 కి.మీ. దూరంలో సర్వే నెంబర్ 360 లోని పొలాల వద్ద రామగుళ్ళపాడు ఉండేది. ఇక్కడి పొలాలను స్థానిక రైతాంగం రామగుళ్ళపాడు పొలాలు అంటారు. ఈ పొలాలు రేపూడి (ఫిరంగిపురం మండలం) గ్రామ రెవిన్యూలో రేపూడి గ్రామానికి పడమర నైఋతిగా ఉంటాయి.

**ఆధారం:** ఫిరంగిపురం మండల గ్రామాలచరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 91.

## 31. తియ్యగూరవారిపాలెం

వేమవరం (ఫిరంగిపురం మండలం) గ్రామానికి వాయవ్యదిశలో ఒక కి.మీ. దూరంలో తియ్యగూర ఇంటిపేరు కలిగిన రెడ్లు తియ్యగూరవారిపాలెం నిర్మించుకున్నారు. ఇప్పుడు ఆ గ్రామం అదృశ్యమయింది. తియ్యగూర ఇంటిపేరు గల రెడ్లు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

గుండ్లకమ్మనది (ప్రకాశంజిల్లా) తీరాన ఉన్న వేమవరం (బల్లికురవ మండలం) నుండి తియ్యగూర రెడ్లతో పాటు వేమవరపు అంకమ్మతల్లి కూడా వచ్చింది. అందువల్ల వేమవరం గ్రామానికి ఆ పేరు వచ్చింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 225.

## 32. పోతినపాడు

పెదపణిదం (సత్తెనపల్లి మండలం) గ్రామానికి దక్షిణాన పోతినపాడు ఉండేది. అలాగే ఉత్తరాన పచ్చికలగుంట గ్రామం ఉండేది.

**ఆధారం:** పెదపణిదం గ్రామస్థులు పంచుమర్తి సత్యనారాయణ ఇచ్చిన సమాచారం.

## 33. సూరమాంబపురం

కొండవీటి రెడ్డిరాజ్య పాలకుడు పెదకోమటి వేమారెడ్డి పుత్రుడైన రాచవేమారెడ్డి (క్రీ.శ. 1420–1424) తన తల్లి (ధరణికోట పాలకుడు దంతలూరి గన్నభూపాలుని కుమార్తె) అయిన సూరాంబిక పేరున క్రీ.శ. 1409 లో సూరమాంబపురం గ్రామాన్ని, సంతాన సాగరం అను చెరువును, జగనొబ్బగండ అను కాలువను నిర్మించాడు. ఇప్పుడు ఆ గ్రామం లేదు. ఫిరంగిపురం గ్రామానికి తూర్పు ఆగ్నేయంగా ఉండేది. సంతానసాగరం చెరువు అమీనాబాద్ (ఫిరంగిపురం మండలం) మల్కాచెరువేమో పరిశీలన చేయవలసి ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 23, 24.
2. కొండవీడు కైఫియత్తు–2020. పుట: 55. మోదుగుల రవికృష్ణ, గుంటూరు.
3. శాసన మణిమంజరి, జయంతి రామయ్యపంతులు, 2018, పుట: 120, 121.

## 34. శ్రీరంగపురం

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542–1576) దక్షిణ తాళ్ళూరు లేక 113 తాళ్ళూరు (ఫిరంగిపురం మండలం) గ్రామ పొలములో 50 తూపలు (50 కుచ్చెళ్ళు) భూమిని కంద్రిక చేసి (విడదీసి) శ్రీరంగపురం అను పేరు పెట్టి 5 వైష్ణవ కుటుంబాలకు దానంగా ఇచ్చాడు. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 58.

## 35. నరగొడ్లపాడు, దేవరపాడు

విజయనగరచక్రవర్తి సదాశివరాయులు (క్రీ.శ. 1542-1576) చిలకమర్రి వల్లభాచార్యులకు క్రీ.శ. 1543 లో గోవాడ (అమృతలూరు మండలం), క్రీ.శ. 1544లో చినకూరపాడు (లంకెలకూరపాడు, ముప్పాళ్ళ మండలం), క్రీ.శ. 1545లో అనుమర్లపూడి (పెదకాకాని మండలం) గ్రామాలను దానంగా ఇచ్చాడు. చిలకమర్రి వంశీయులు గోవాడ అగ్రహారీకుల వద్ద ఉన్న తామ్రపత్రాల ప్రకారం లంకెలకూరపాడు గ్రామానికి నైఋతిదిశలో నరగొడ్లపాడు, ఉత్తరదిశలో దేవరపాడు గ్రామాలున్నాయి. ఇప్పుడు లంకెలకూరపాడు గ్రామానికి నైఋతిదిశలో గోళ్ళపాడు (ముప్పాళ్ళ మండలం), ఉత్తరదిశలో పలిదేవర్లపాడు (ముప్పాళ్ళ మండలం) గ్రామాలున్నాయి. నరగొడ్లపాడు గోళ్ళపాడుగాను, దేవరపాడు పలిదేవర్లపాడుగాను మారి ఉండవచ్చు. వీటిపై మరింత పరిశోధన చేయవలసివుంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 57.
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 195, 196.

## 36. ముల్లగూరు అగ్రహారం

క్రీ.శ. 1592 లో కొండవీడుసీమ అమీనుగా వచ్చిన ముల్క్ 'ముల్లగూరు' అగ్రహారాన్ని ధ్వంసం చేసి, తన పేరిట అమీనాబాద్ (ఫిరంగిపురం మండలం) గ్రామాన్ని, మల్కాచెరువును, మల్కామహల్‌ను నిర్మించుకున్నాడు. ఇతని ఆగడాలు భరించలేని ప్రజలు కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612) కు ఫిర్యాదు చేయగా ఆయన పవిత్రమైన మసీదులో శృంగారం చేసినందుకుగాను అమీన్‌ముల్క్ కళ్లు పీకించాడు. ముల్లగూరు అగ్రహారం సాక్షిగా చిన్నకొండపై మూలాంకురేశ్వరి అమ్మవారి ఆలయం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 31, 32.

# 37. సిద్ధిపాలెం (సిద్దాపురం)

విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1529) ఓ బోగసానికి వేల్పూరును దానమివ్వగా ఆమె మరికొంత భూమి కావాలని కోరిందట. రాయలు ఆమె పగలంతా ఎంత భూమి తిరిగితే అంత భూమి ఇస్తానని మాట ఇచ్చాడట. దురాశతో ఆమె రోకటిగుండ్ల (రోకటిగుంటవారిపాలెం, అచ్చంపేట మండలం), సిద్ధిపాలెం (సిద్దాపురం), అనంతవరం (క్రోసూరు మండలం), పెదపాడు, చినపాడు, లక్ష్మీనారాయణపురం మొదలగు గ్రామాల హద్దులన్నీ తిరిగి అలసి మరణించిందట. తర్వాత బోగసాని కుటుంబీకులకు ఆ భూమిని రాయలు దానం చేసాడట.

సిద్ధిపాలెం గ్రామస్థులు పొలం పనులు చేసుకుంటుండగా ఓ వృద్ధునికి జ్వాలా నరసింహమూర్తి స్వప్నంలో దర్శనమిచ్చి భక్తా! మేము జ్వాలా నరసింహులము, మీ ఊరికి ఆగ్నేయంగా ఉన్న పర్వత గుహల్లోకి ఇప్పుడే వచ్చి ఉన్నాము. మా దృష్టి సోకి మీ గ్రామం దగ్ధం అవుతుంది కావున మీ ఊరికి సమీప పర్వతానికి క్రోసెడు దూరంలో నివసించండి అని ఆదేశించారట. అనంతరం వృద్ధుడు నిద్రలేచి చూడగా సిద్ధిపాలెం యావత్తు అగ్నికి ఆహుతై కన్పించింది. జరిగిన విషయం తెలుసుకున్న గ్రామస్థులు స్వామి చెప్పిన విధంగానే క్రోసూరు (మండలకేంద్రం) కొండ ప్రక్కన తమ కొత్త నివాసాలను ఏర్పాటు చేసుకున్నారు. అప్పటినుండి ఆ గ్రామానికి క్రోసూరు అను పేరు వచ్చిందట. సిద్ధిపాలెం క్రోసూరుకు వాయవ్యాన ఉండేది. సిద్ధిపాలెంవద్ద ఆంజనేయస్వామి ఆలయం ఉంది.

క్రోసు అంటే రెండు మైళ్ళు. మైలు అంటే 1.60 కి.మీ.

**ఆధారం:**


1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 68, 69.
2. చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 38. పొణుకుపాడు అగ్రహారం (పొణుకుపాడుకండ్రిక)

మొగలాయి పాలనలో మేడికొండూరు పొలంలో కొంతభూమిని విడదీసి పొణుకుపాడుకండ్రిక గ్రామం నిర్మించారు. మేడికొండూరు (మండలకేంద్రం) గ్రామకరణాలైన మేడికొండూరు, తురగా, భట్టిప్రోలువారే పొణుకుపాడుకండ్రిక గ్రామానికి కూడా కరణాలు. ఈ గ్రామం సత్తెనపల్లిశాఖకు చెందిన మానూరివారి జమీలో ఉన్నప్పుడు మానూరి వెంకటేశం క్రీ.శ. 1708లో ములుకుట్ల శివన్నకు 15 వరహాలకు 'శ్రోత్రియం' గా ఇచ్చాడు. 20వ శతాబ్ది వరకు ఉన్న ఈ గ్రామం ఏ కారణంచేతనో అదృశ్యమయింది. మేడికొండూరు గ్రామానికి దక్షిణ నైఋతిలో ఈ గ్రామం ఉండేది. 'మంగళిగుంటమాన్యాలు' అని ఇప్పుడు పిలిచేవాటిని పి.కండ్రిక పొలాలు అని కూడా అంటారు. నెలకుదిటి వెంకటరావు పొలాల వద్ద ఓ జమ్మిచెట్టు, వేపచెట్టు, ఎల్లమ్మ శిలాప్రతిమ ఉన్నాయి. అక్కడ అరుగును నిర్మించారు. ఇక్కడే పొణుకుబాడు అగ్రహారం ఉండేదని భావించవచ్చు. ప్రభుత్వ రికార్డులలో పొణుకుపాడుకండ్రిక (పి.కండ్రిక) పొలాలుగానే ఈ ప్రాంత పొలాలున్నాయి.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 194, 195.
2. ఫిరంగిపురం మండల గ్రామాల చరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 88, 89.

## 39. జమ్మిపల్లి

క్రీ.శ. 1220 దుర్గిదేవిపాడు (మాదిపాడు, అచ్చంపేట మండలం) శాసనంలో మనుమకుల గోత్రీకుడైన ముచ్చెనాయకుడు తన తండ్రికి ధర్మంగా జమ్మిపల్లి మల్లికార్జునదేవరకు నిత్యనైవేద్యం కొరకు భూమిని దానంగా ఇచ్చినట్లు ఉంది. శాసనం ఉన్న ప్రదేశం మాదిపాడు కనుక జమ్మిపల్లి వెంకటాయపాలెం అటవీప్రాంతంలో ఉండివుండవచ్చు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 265.

## 40. వేగమూడి

రేపూడి (ఫిరంగిపురం మండలం) గ్రామానికి పడమరదిశలో 5 కి.మీ. దూరంలో కొండవీటివాగు, నుదురుపాడువాగు కలిసే దగ్గర వేగమూడి ఉండేది. స్థానికులు లేగమూడి అంటారు. ఇప్పుడు ఈ ప్రాంతం పొలాలుగా మారింది. చిట్టా బాపూజీరెడ్డి పొలం వద్ద ఉన్న పాటి దిబ్బలుపై గుండ్రాళ్లు, కుండ పెంకులు విస్తారంగా కనిపిస్తాయి. పూర్వం నుంచి ఉన్న పోతురాజు, గంగమ్మ ప్రతిమలకు పూజలు చేస్తారు. సంక్రాంతిపాడు (నాదెండ్ల మండలం) గ్రామానికి తూర్పున 5 కి.మీ. దూరంలో వేగమూడి గ్రామపొలాలు ఉన్నాయి. వేగమూడి గ్రామకరణాలు వెలనాటివారైన గౌతమసగోత్రులు యాబలూరివారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 30.
2. ఫిరంగిపురం మండల గ్రామాల చరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 89.

## 41. పిచ్చికలపాలెం (విలీనగ్రామం)

మేడికొండూరు (మండలకేంద్రం) గ్రామ సమీపాన పిచ్చికలపాలెం ఉండేది. త్రిలోచనపల్లవమహారాజు పాలనలో మేడి, కొండి, భవనాగి అను ముగ్గురు కళావంతులు ఉండేవారు. త్రిలోచనపల్లవమహారాజు మేడి, కొండిలకు మీరు ఎంత భూమి తొక్కుతారో అంత భూమిని కానుకగా ఇస్తాను అన్నాడు. ఆ రాజు మేడి, కొండిలు తొక్కిన (తిరిగిన) భూమిలో గ్రామాన్ని నిర్మించి కానుకగా ఇచ్చాడు. కనుక ఆ గ్రామం మేడికొండూరు అయింది. భవనాగి మేడికొండూరు గ్రామంలో బావిని తవ్వించింది. పిచ్చికలపాలెం క్రమేపి మేడికొండూరులో భాగమైపోయింది. పిచ్చికలపాలెం అంటే పచ్చిక (పచ్చి గడ్డి, గొడ్లమేత)లపాలెంగా భావించాలి.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 206.

## 42. పులిచింతల ప్రాజెక్టు వలన ఖాళీ అయిన బెల్లంకొండ మండల గ్రామాలు

1. **పులిచింతల:** ఈ గ్రామ సమీపాన వేములకొండపై వేంకటేశ్వరుని పాదాలు ఉన్నాయంటారు.
2. గొల్లపాలెం (గొల్లపేట)
3. గోపాలపురం
4. బోదనం
5. చిట్యాల
6. చిట్యాల తండ
7. కేతవరం తండ
8. యమ్మాజీగూడెం
9. చినపాకల

## 43. రాంకీపురం

క్రీ.శ. 1158 నుదురుపాడు (ఫిరంగిపురం మండలం) పద్యశాసనంలో నాదెండ్ల కొండపడమటిరాజుల బంట్లు రాంకీపుర గ్రామస్థులు బ్రమ్మనబోయడు, రాంకీబట్ల బోయడు, గాపట్ల (బాపట్ల?) బోయడు పండితులచే కీర్తించబడ్డారు. ఈ గ్రామహద్దులు తెలియవు. నుదురుపాడు పద్య శాసనాలలో ఎక్కువగా రాంకీపురం ప్రస్తావన ఉంది.

**ఆధారం:**


1. తెలుగు కవుల చరిత్ర - 1956. పుట: 272-276. నిడుదవోలు వెంకటరావు.
2. ఫిరంగిపురం మండల గ్రామాల చరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 66.

## 44. ఎకలస్‌ఖాన్‌పేట

గోల్కొండ నవాబు మహమ్మద్ కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612) సేనాని ఎకలస్‌ఖాన్ కొండవీడు పాలకునిగా ఉన్నప్పుడు కొండవీడు దక్షిణ నైఋతిదిశలో ఎకలస్‌ఖాన్‌పేట నిర్మించాడు. కొండవీడు పట్టణానికి ఉత్తరంగా చిన్న తిప్పపై ఉన్న గణపతి విగ్రహాన్ని ధ్వంసం చేసి ఎకలస్‌ఖాన్‌పేటను నిర్మించినట్లు ప్రచారముంది. ఎకలస్‌ఖాన్‌పేట హౌస్‌గణేష్ (ఫిరంగిపురం మండలం) లో కలిసిపోయిందని కొందరంటారు. క్రీ.శ. 1600లో ప్రకాశంజిల్లా అద్దంకి మండలం ధర్మవరం వద్ద ఎకలస్‌ఖాన్ తన పేరుతో గ్రామం నిర్మించాడు. ఆ గ్రామం కూడా అదృశ్యమయింది.

**ఆధారం:** కొండవీడు కైఫియత్తు 2020. పుట: 83. మోదుగుల రవికృష్ణ, గుంటూరు.

## 45. దోసపాడు

అచ్చంపేట, మాదిపాడు (అచ్చంపేట మండలం) దారిలో అచ్చంపేటకు ఉత్తర వాయవ్యంగా 2 కి.మీ. దూరంలో దోసపాడు ఉండేది. సాక్షిగా చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామానికి పడమరగా 2 కి.మీ. దూరంలో దోసపాడు చెరువు (194 ఎకరములు) ఉంది. దోసపాడు చెరువును చామర్రు మైనర్ ఇరిగేషన్ ట్యాంక్ అంటారు. ఈ చెరువు ద్వారా 300 ఎకరములు భూమి సాగులో ఉంది. దోసపాడు చెరువుకు తూర్పువైపున అప్పుడప్పుడు పురాతన కుండపెంకులు కనిపిస్తుంటాయి. అక్కడే దోసపాడు ఉండేదని భావించవచ్చు. గుంటూరుజిల్లాలో దోసపాటి ఇంటి పేరుగల కొన్ని కులాలవారు ఉన్నారు. సిరిపురం (మేడికొండూరు మండలం) గ్రామ కైఫియత్తులో ఆ ఊరి కరణంగారికి దాసపా(దు)టి వీరభద్రస్వామి ప్రసన్నులయ్యారని ఉంది. దాసపాడు, దోసపాడు ఒకటేనా? ఒకవేళ ఒకటే అయినచో సిరిపురం వీరభద్రుడు పూర్వం దోసపాడు గ్రామంలో ఉండేవారు.

**ఆధారం:** చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు
మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 46. క్రమ్మాలపాడు (కొమ్మాలపాడు?)

క్రీ.శ. 1155 పమిడిపాడు (నరసరావుపేట మండలం) శాసనంలో 'పహిందిపాటి (పమిడిపాడు) ఉత్తరసీమ క్రమ్మాలపాటి దక్షిణమున ద్రమ్మాలపాటి (దమ్మాలపాడు, ముప్పాళ్ళ మండలం) పొలములో' అని ఉంది. నేడు పమిడిపాడు గ్రామానికి ఉత్తరముగా దమ్మాలపాడు గ్రామం ఉంది. శాసన ప్రకారం దమ్మాలపాడు గ్రామానికి కూడా ఉత్తరాన క్రమ్మాలపాడు ఉండాలి. నర్సరావుపేట తాలూకాలో కొమ్మాలపాడు అనే చిన్న జమీకేంద్రం పూర్వం ఉండేది. బహుశా అది ఇదే కావచ్చు!

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 135

## 47. లక్ష్మీనారాయణపురం, చినపాడు

విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1529) ఓ భోగసానికి వేల్పూరును దానమివ్వగా ఆమె మరికొంత భూమి కావాలని కోరిందట. రాయలు ఆమె పగలంతా ఎంత భూమి తిరిగితే అంత భూమి ఇస్తానని మాట ఇచ్చాడట. దురాశతో ఆమె రోకటిగుండ్ల (రోకటిగుంటవారిపాలెం, అచ్చంపేట మండలం), సిద్ధిపాలెం (సిద్ధాపురం), అనంతవరం (క్రోసూరు మండలం), పెదపాడు, చినపాడు, లక్ష్మీనారాయణపురం మొదలగు గ్రామాల హద్దులన్నీ తిరిగి అలసి మరణించిందట. తర్వాత భోగసాని కుటుంబీకులకు ఆ భూమిని రాయలు దానం చేసాడట.

చినపాడు, లక్ష్మీనారాయణపురం అను గ్రామాలు ఇప్పుడు లేవు. ఈ గ్రామాల హద్దులు తెలియవు. ఈ గ్రామాల పేర్లు మారాయా, పూర్తిగా అదృశ్యమయ్యాయా అనే విషయం పరిశీలన చేయవలసి వుంది.

**ఆధారం:**

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 68, 69.
2. చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 48. అక్కలమ్మపురం

వేమవరం (ఫిరంగిపురం మండలం) గ్రామానికి ఉత్తరాన అక్కలమ్మపురం గ్రామం ఉండేది. ఇంతకుమించి వివరాలు లేవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 4, పుట: 226

## 49. ఫిరంగిపురం పరిసర విలీనగ్రామాలు

ఫిరంగిపురంకు ఉత్తరాన తేళ్లూరి యల్లారెడ్డిపాలెం ఉండేది. ఆ గ్రామంలో అల్లం ఇంటిపేరు కల ధనిక రెడ్లు ఉండుట వలన ఆ గ్రామం అల్లంవారిపాలెం అయింది. నేడు అల్లంవారిపాలెం కూడా ఫిరంగిపురం గ్రామ పంచాయితీలో కలిసిపోయింది.

**ఆధారం:**

1. బాలజేసు దేవాలయ శతవార్షికోత్సవ సంచిక, రామిశెట్టి శౌరయ్య, 1991, పుట: 29.
2. ఫిరంగిపురం మండల గ్రామాల చరిత్ర, భీమనాథుని శ్రీనివాస్, వేములూరిపాడు, ఫిరంగిపురం మండలం, 2018, పుట: 53.
3. ఫిరంగిపురం పంచాయితీ సమితి అభ్యుదయ సంచిక, 1972, పుట: 16.

## 50. సిరిపురం పరిసర అదృశ్యగ్రామాలు

గుంటూరుజిల్లాలో సిరిపురం (మేడికొండూరు మండలం) ఓ ప్రత్యేక గ్రామం. దీనికి కారణం పూర్వం ఈ గ్రామం 12 గ్రామాలకు కూడలి. అందుకే సిరి కలిగిన పురం సిరిపురం అని ఈ గ్రామానికి పేరు. ఇప్పటికీ 8 గ్రామాలకు కూడలిగా ఉంది. క్రీ.శ. 12వ శతాబ్ది పొదపాడు (పెదకూరపాడు మండలం) శాసనంలో సిరిపురంబు ప్రంద్రెంటి లోపలి రాపూండి, మాచసముద్రం, అకులుప్రోలు గ్రామాల ప్రస్తావన ఉంది. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 242.

## 51. బ్రహ్మపురి

క్రీ.శ. 1168 మందపాడు (మేడికొండూరు మండలం) శాసనంలో చందోలు (పిట్టలవానిపాలెం మండలం) రాజధానిగా పాలిస్తున్న వెలనాటి కులోత్తుంగ (ద్వితీయ) రాజేంద్రచోడ (క్రీ.శ. 1160-1181) ధర్మంగా కొండపడమటి ప్రాంతంలోని మండ్దాపురం (మందపాడు, మేడికొండూరు మండలం) మల్లికార్జున ఆలయానికి, పూజారులకు స్థానికపాలకుడైన మందడి నామినాయకుడు, వారి బంధువులు అనేక ప్రాంతాలలో భూమిని దానమిచ్చినట్లు ఉంది. బ్రహ్మపురి పొలంలో బ్రహ్మదేవభట్లకు కొంతభూమి దానం ఇచ్చినట్లు పై శాసనంలో ఉంది. క్రీ.శ. 1235 చేబ్రోలు (జాయపసేనాని) శాసనంలో కూడా బ్రహ్మపురి ప్రస్తావన ఉంది. క్రీ.శ. 1170 మోపర్రు(అమృతలూరు మండలం) శాసనంలో బ్రహ్మపురి మల్లన భట్ల కలదు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10,
సీరియల్ నెం. 164, 172

## 52. దేవినేనివారిపాలెం (ప్రతినామగ్రామం)

సత్తెనపల్లి మండలం కట్టావారిపాలెం గ్రామాన్ని 'దేవినేని' ఇంటిపేరుకల కమ్మ కులస్థులు నిర్మించుకొన్నారు. అప్పుడు ఈ గ్రామం దేవినేనివారిపాలెం. దేవినేని వంశీయులలో ఓ తండ్రికి తన కొడుకుతో కలహం రాగా, తండ్రి ఈ గ్రామం (దేవినేనివారిపాలెం) లో దేవినేని వారికి మగసంతానం ఉండదని శపించాడట! దరిమిలా దేవినేని వంశీయులకు చిత్రంగా ఆడ సంతానమే జన్మించారట. అప్పుడు దేవినేనివారు తమ బంధువులైన కట్టావారికి తమ ఆడపడుచులను ఇచ్చి, ఆ గ్రామాన్ని కట్టావారిపాలెంగా మార్చారు. ఆ తర్వాత దేవినేనివారికి కూడా మగ సంతానం జన్మించారట! అయితే ఆ ఊరిలో ఉన్న దేవినేని వారికి వృద్ధి లేదంటారు.

**ఆధారం:** కట్టావారిపాలెం గ్రామస్థులు కట్టా బుచ్చయ్యచౌదరి ఇచ్చిన సమాచారం.

## 53. లంకెలకూరపాడు పరిసర అదృశ్యగ్రామాలు

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) చిలకమర్రి వల్లభాచార్యులకు క్రీ.శ. 1543 లో గోవాడ (అమృతలూరు మండలం), క్రీ.శ. 1544లో చినకూరపాడు (లంకెలకూరపాడు, ముప్పాళ్ళ మండలం), క్రీ.శ. 1545లో అనుమర్లపూడి (పెదకాకాని మండలం) గ్రామాలను దానంగా ఇచ్చాడు. దాన శాసనాలలో సరిహద్దు గ్రామాల ప్రస్తావన ఉంది. అవి

1. ముప్పాళ్ళ - మండలకేంద్రం
2. కూడలి - ఎక్కడో తెలియదు
3. దేవరపల్లి - ముప్పాళ్ళ మండలం పలిదేవర్లపాడు (పంచర్లపాడు) కావచ్చు.
4. అన్నవరం - ఎక్కడో తెలియదు
5. పొలంకుపాడు (పొలుకుంబాడు) - పొనుగుపాడు పేరుతో ఫిరంగిపురం మండలంలో ఉంది.
6. గొండుపాడు (ఎక్కడో తెలియదు)
7. కారిడి (ఎక్కడో తెలియదు)
8. గార్లపల్లి - లక్కరాజు గార్లపాడు (సత్తెనపల్లి మండలం) కావచ్చు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 36.

## 54. రాతిఖండపురం

క్రీ.శ. 1524 మాదల (ముప్పాళ్ళ మండలం) సకలేశ్వరదేవర శాసనంలో రాతిఖండపురం ప్రస్తావన ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 265.

## 55. కోకల్లు, ఉప్పలపాడు (దుప్పలపాడు)

క్రీ.శ. 1182 వేల్పూరు శాసనంలో ధరణికోట రాజధానిగా పరిపాలించిన రెండవ కోట కేతరాజు (క్రీ.శ. 1182-1231) వేల్పూరు (అచ్చంపేట మండలం) రామేశ్వరదేవరకు కొండనతవాడి, దొడ్డికంద్రవాడి, కొండపడమటిప్రాంతాలలోని అనేక గ్రామాలను దానంగా ఇచ్చినట్లు ఉంది. వాటిలో కోకల్లు, ఉప్పలపాడు ఉన్నాయి.

కోటకేతరాజు తన తల్లి సుబ్బాంబికపేర కోకల్లు గ్రామాన్ని సుబ్బాంబికపురంగా పేరు మార్చాడు. ఉప్పలపాడు గ్రామం సత్తెనపల్లికి తూర్పుదిశగా ఉండేది? ఈ రెండు గ్రామాలు నేడు కనిపించవు. కొండనతవాడి ప్రాంతం అచ్చంపేట, బెల్లంకొండ, రాజుపాలెం, క్రోసూరు? మండలాలలో ఉండేది. కొండనతవాడి రాజధాని పుట్లగూడెం (అచ్చంపేట మండలం) సమీపంలోని మేదరసానిదుర్గంకొండ అని అంటారు.

కల్లు అంటే కొండ. వాడుకలో కల్లు గల్లుగా మారుతుంది. అలాగే కోకల్లు కోగల్లు అవుతుంది. అలానే కోగల్లు కోగంటిగా మారవచ్చు. కావున కోగంటిపాలెం (అచ్చంపేట మండలం) సమీపానే కోకల్లు(కోగల్లు, కోగంటి) గ్రామం ఉండవచ్చు. కోగంటి ఇంటిపేరుతో బ్రాహ్మణ, కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు. గుంటూరుజిల్లాలో అనేక ఉప్పలపాడు గ్రామాలున్నాయి. శాసనంలో సత్తెనపల్లికి ప్రాగ్దిశ (తూర్పు) దుప్పలపాడు(ఉప్పలపాడు) అని ఉంది. ఒకవేళ శాసనంలో పొరపాటు పడ్డచో, దుప్పలపాడుకు ప్రాగ్దిశ (తూర్పు) సత్తెనపల్లి అని మనము అనుకున్నచో, రాజుపాలెం మండలంలో ఉన్న ఉప్పలపాడు గ్రామం కావచ్చు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 199, 198
2. చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు
   మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 56. దుర్గిదేవిపాడు

అచ్చంపేట మండలంలో ఉన్న మాదిపాడు గ్రామం వద్ద దుర్గిదేవిపాడు గ్రామం ఉండేది. క్రీ.శ. 1220 దుర్గిదేవిపాడు శాసనంలో 'ముచ్చెనాయకుండు తమ తండ్రిగొం... ధర్మముగా జమ్మిపల్లి మల్లికార్జునదేవరకు నివేద్యానకు కుంటిమద్ది (అచ్చంపేట మండలం) తెరువు (బాట) పడమటను దీని దక్షిణాన వెలి (బయట) పొలము' ఇచ్చినట్లు ఉంది. ఈ శాసనం ప్రకారం మాదిపాడు పరిసరాలలో దుర్గిదేవిపాడు ఉండవచ్చు. మాదిపాడు సమీప అడవిలో సత్తెమ్మతల్లి ఆలయం ఉన్నది. అక్కడ రాజుపాలెం అనే అదృశ్యగ్రామం ఉండేది. 1812?లో మెంకజీదొర క్రీ.శ.1220 ముచ్చెనాయకుండు శాసనం సేకరించాడు. ఈ శాసనం గుంటూరు జిల్లా శాసనాలు పుస్తకంలో రాజుపాలెం పేరిట రికార్డు అయినది. అయితే సత్తెనపల్లి తాలూకాలో రాజుపాలెం అనే మండలకేంద్రం ఉన్నది. అచ్చంపేట మండలం మాదిపాడు అటవీప్రాంతంలో రాజుపాలెం అదృశ్యగ్రామం గురించి తెలియనివారు మండలకేంద్రమైన రాజుపాలెం శాసనమని అనుకుంటున్నారు. ఇదే శాసనం 1917లో ఆర్కియాలజీ వారు దుర్గిదేవిపాడు శాసనంగా రికార్డు చేశారు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 265.
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 12, 13.

## 57. సుదెళ్ళపాడు

అచ్చంపేట (మండలకేంద్రం)కు దక్షిణంగా ఒక కిలోమీటరు దూరంలో సుదెళ్ళపాడు ఉండేది. సాక్షిగా ఇక్కడ తొట్టివీడు వద్ద ఆంజనేయస్వామి ఆలయం ఉంది. సుదెళ్ళపాడు గ్రామం చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామానికి కూడా దక్షిణంగా ఉండేది.

**ఆధారం:** చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు
మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 58. లక్ష్మీశ్వరం

కృష్ణానది తీరాన చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామానికి ఉత్తరాన ఒక కి.మీ. దూరంలో లక్ష్మీశ్వరం ఉండేది. సాక్షిగా లక్ష్మీశ్వరశివాలయం ఉంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. కృష్ణానది వరదలు కారణం కావచ్చు.

**ఆధారం:** చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు
మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

## 59. కుప్పాయినికొండ

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు పాలన (క్రీ.శ. 1542-1576) లో కొండవీడు పాలకుడు బయాకార రామప్పయ్య (రాయసం కొండమురసయ్యకు అన్న) క్రీ.శ. 1544 జూన్ 16 నాడు బెల్లంకొండసీమలో ఉన్న కుప్పాయినికొండ గ్రామాన్ని తిరుపతి గోవిందరాజస్వామికి దానంగా ఇచ్చాడు. అద్దంకి, బెల్లంకొండ మొదలగు సీమలు కొండవీడురాజ్యంలో ఉన్నాయని ఈ శాసనం (తిరుమల శాసనాలు, 352) ద్వారా తెలుస్తున్నది. ఈ గ్రామహద్దులు తెలియవు. బెల్లంకొండసీమ సత్తెనపల్లి, పలనాడు, నరసరావుపేట తాలూకాలలో ఉండేది. విజయనగరచక్రవర్తి అచ్యుతదేవరాయలు (క్రీ.శ. 1530-1542) పాలనలో కొండవీడు పాలకుడుగా ఉన్న బాచరసుయ్య అన్న కొడుకే ఈ బయాకార రామప్పయ్య.

**ఆధారం:** దుర్గాధిపతులు, కోన వెంకట్రాయశర్మ, బాపట్ల, స్వగ్రామం పెదచెరుకూరు,
పరుచూరు మండలం, ప్రకాశంజిల్లా, 1953, పుట: 415.

## 60. కృష్ణూరు

కోటదొడ్డకేతరాజు కృష్ణూరు గోపీనాథునికి పెదపణిదం (సత్తెనపల్లి మండలం) గ్రామాన్ని దానం ఇచ్చాడు. కృష్ణూరు గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా సమగ్ర చరిత్ర, సంస్కృతి, ప్రధాన సంపాదకులు:
మాజేటి సోమశేఖరరావు, గుంటూరు, 2004. పుట: 319.

## 61. ఇఱ్ఱులూరు

క్రీ.శ. 1173 లింగంగుంట్ల శాసనంలో ఇఱ్ఱులూరు, కొండపడమటిలోని లింగంపాడు (లింగంగుంట్ల) సోమేశ్వరదేవరల ప్రస్తావన ఉంది. ఇది చిలకలూరిపేట తాలూకాలో ఉన్న లింగంగుంట్ల (చిలకలూరిపేట మండలం) కు బదులు సత్తెనపల్లి తాలూకా లింగంగుట్ల (పెదకూరపాడు మండలం) శాసనంగా రికార్డు అయిందని భావించవచ్చు. ఎందుకంటే చిలకలూరిపేట తాలూకాలో ఉన్న లింగంగుంట్ల (చిలకలూరిపేట మండలం) కు దగ్గరలో ఇర్లపాడు (నాదెండ్ల మండలం) గ్రామం ఉంది. ఇర్లపాడులో సోమేశ్వరాలయం నేటికీ ఉంది. ఇర్లపాడును శాసనాలలో ఇఱ్ఱులూరు అనేవారు.

కొండవీడు పర్వత పడమట ప్రాంతాన్ని కొండపడమటిప్రాంతం అంటారు. ఇది చిలకలూరిపేట, సరసరావుపేట, సత్తెనపల్లి తాలూకాల్లో ఉండేది. కొండపడమటి రాజధాని చిలకలూరిపేట తాలూకాలో నేటి మండలకేంద్రమైన నాదెండ్ల.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 40, సీరియల్ నెం. 241.

## 62. కంబాల (గంబాల)

12వ శతాబ్ది అమరావతి శాసనంలో కొండనతవాడిలో కంబాల ప్రస్తావన ఉంది. కొండనతవాడి ప్రాంతం అచ్చంపేట, బెల్లంకొండ, రాజుపాలెం, క్రోసూరు? మండలాలలో ఉంది. కావున కంబాల సత్తెనపల్లి తాలూకా మాదిపాడు (అచ్చంపేట మండలం) పరిసర అటవీప్రాంతంలో ఉండి ఉండవచ్చు. కంబాల ఇంటిపేరుతో రెడ్లు, కాపులు మొదలగు కులాలవారు సత్తెనపల్లి తాలూకాలో ఉన్నారు.

ఇదే శాసనంలో కొండపడమటి జీడిపూండి, గేతెపల్లి(కేతేపల్లి), దువ్వపాడు గ్రామాల ప్రస్తావన ఉంది. ఈ గ్రామాల హద్దులు తెలియవు. కొండవీడు పర్వత పడమట ప్రాంతాన్ని కొండపడమటిప్రాంతం అంటారు. కొండపడమటిప్రాంతం చిలకలూరిపేట, నరసరావుపేట, సత్తెనపల్లి తాలూకాలలో ఉండేది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 6, సీరియల్ నెం. 229.
2. వెంకటాయపాలెం (బెల్లంకొండ మండలం) గ్రామస్థులు కంబాల శ్రీనివాస్ ఇచ్చిన సమాచారం.

## 63. వెంకటాయపాలెం పరిసర అదృశ్యగ్రామాలు

**పెదపాడు** : వెంకటాయపాలెం గ్రామానికి ఉత్తరంగా 5 కి.మీ. దూరంలో పెద సింగరయ్య ఆలయానికి 2 కి.మీ. దూరంలో పెదపాడు ఉండేది.

**చినపాడు** : వెంకటాయపాలెం గ్రామానికి ఉత్తర ఈశాన్యంగా 4 కి.మీ. దూరంలో దూకుడుబొంద వద్ద చినపాడు ఉండేది.

**గుళ్ళంపాడు** : వెంకటాయపాలెం గ్రామానికి తూర్పుగా ఒక కిలోమీటరు దూరంలో గుళ్ళంపాడు ఉండేది. సాక్షిగా ఆంజనేయ ఆలయం ఉంది. దానికి తూర్పు ఆగ్నేయంగా చినసింగరయ్య ఆలయం ఉంది. ఆ పరిసరాల లో ఇప్పటికీ కొన్ని రోళ్ళు కనిపిస్తాయి.

**తిమ్మేసుపేట** : వెంకటాయపాలెం గ్రామానికి దక్షిణంగా 4 కి.మీ. దూరంలో తిమ్మేసుపేట ఉండేది. సాక్షిగా ఆంజనేయ ఆలయం ఉంది. ఈ ఆలయం వెనుక చెరువు, కొన్ని బావులు ఉన్నాయి. ఈ తిమ్మేసు పేటని తిమ్మరాజుపల్లి అని కూడా అంటారు

**ఆధారం:** వెంకటాయపాలెం (బెల్లంకొండ మండలం) గ్రామస్థులు
కంబాల శ్రీనివాస్, బాణావత్ కుటుంబరావు ఇచ్చిన సమాచారం.

## 64. కుమ్మరిపాలెం

అచ్చంపేట, మాదిపాడు (అచ్చంపేట మండలం) రహదారిలో చామర్రు మైనర్ ఇరిగేషన్ ట్యాంక్ (దోసపాడు చెరువు) కు ఆగ్నేయంగా ఒక కిలోమీటరు దూరంలో కుమ్మరిపాలెం ఉండేది.

**ఆధారం:** చామర్రు (అచ్చంపేట మండలం) గ్రామస్థులు
మద్దినేని గంగారావు ఇచ్చిన సమాచారం.

# తెనాలి తాలూకా

1. తెనాలి మండలం
2. వేమూరు మండలం
3. కొల్లూరు మండలం
4. అమృతలూరు మండలం
5. చేబ్రోలు మండలం
6. చుండూరు మండలం
7. దుగ్గిరాల మండలం
8. కొల్లిపర మండలం

## 1. దగ్గుమల్లిపాడు (దగ్గుమిల్లి)

గోవాడ (అమృతలూరు మండలం) గ్రామానికి దక్షిణదిశలో దగ్గుమిల్లిపాడు ఉండేది. ఆ గ్రామంలో సోమేశ్వర, విఘ్నేశ్వర, ఆంజనేయ ఆలయాలు ఉండేవి. జైన, బౌద్ధ నివాస కేంద్రం కూడా. 12వ శతాబ్దంలో వీరశైవ గురుదేవులైన మల్లికార్జున పండితుడు శ్రీశైలం వెళ్తూ వెలనాటి రాజధానియైన 'చందోలు' (పిట్టలవానిపాలెం మండలం) వచ్చి, రాజును దర్శించి, తన పాండిత్యప్రతిభతో జైన, బౌద్ధ పండితులను ఓడించాడు. ఆ విజయం చేకూర్చిన ఉత్సాహంతో మల్లికార్జునపండితుడి శిష్యులు (వీరశైవులు) చందోలు సమీపంలోని జైన, బౌద్ధ గ్రామాలను ధ్వంసం చేసారు. ఆ విధ్వంసకాండకు దగ్గుమల్లిపాడు తన స్వరూపాన్ని కోల్పోయింది. ఆ గ్రామం ఉందనేందుకు సాక్షిగా నేడు సోమేశ్వరాలయం మిగిలింది. 19వ శతాబ్దంలో బ్రాహ్మణకోడూరు (పొన్నూరు మండలం) వాస్తవ్యులు కోడూరి తిరుపతినాయుడు సోమేశ్వరాలయాన్ని పునర్నిర్మించారని గోవాడ గ్రామస్థులు చెబుతారు. ఆ సోమేశ్వరాలయాన్ని నేడు బాలకోటేశ్వరాలయంగా పిలుస్తారు. సమీప గ్రామస్థులు పూర్వం ఇక్కడ దగ్గుమల్లిపాడు ఉండేదని కథలుగా చెబుతారు. రెడ్డిరాజ్య ఆస్థానకవి శ్రీనాథకవి బంధువు దగ్గుమిల్లి దుగ్గన ఈ దగ్గుమల్లి (పాడు) గ్రామస్థుడేమో! పరిశీలన చేయవలసి ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 39
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 131

## 2. ధర్మపురం (విలీనగ్రామం)

వేమూరు గ్రామంలో ఉన్న ధర్మపురం పూర్వం ప్రత్యేకంగా ఉండేది. ఈ చిన్న గ్రామం కాలక్రమేణా వేమూరు (మండలకేంద్రం)లో కలిసిపోయింది. నేటికీ ఈ ప్రాంతాన్ని ధర్మపురం అని ప్రత్యేకంగా పిలుస్తున్నారు.

**ఆధారం:** వేమూరు గ్రామస్థులు అమ్మ కోనేరు లక్ష్మీప్రమీల గారు ఇచ్చిన సమాచారం.

## 3. జంట్లమ్మపాడు

పూర్వం ఆలపాడు (చుండూరు మండలం) గ్రామానికి తూర్పున 2 కి.మీ. దూరంలో జైనులు నివాసముండేవారు. వారి దేవత జంట్లమ్మతల్లి కారణంగా గ్రామానికి 'జంట్లమ్మపాడు' పేరు వచ్చింది. వారి ఆవులమందలు సమీపప్రదేశంలో ఉండడంచేత ప్రజలు ఆ ప్రాంతాన్ని 'ఆలపాడు' అనేవారు. జైనుల దేవతావిగ్రహాలు అనేకం ఈ ప్రాంతంలో బయల్పడ్డాయి. నేడు ఈ ప్రాంతమంతా పంటపొలాలుగా మారిపోయింది. కొన్ని చోట్ల జైనదేవతగా దేశమ్మతల్లిని కొలుస్తారు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 11

## 4. పెదకొండూరు పరిసర అదృశ్యగ్రామాలు

పెదకొండూరు (దుగ్గిరాల మండలం) గ్రామానికి దగ్గరలో దేచవరం, ఉత్తర పొణుకుపాడు, పడమర మంగళగిరి ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65.

## 5. అర్లపాడు

కఠెవరం (తెనాలి మండలం) గ్రామానికి పడమరగా, కోపల్లె (తెనాలి మండలం) గ్రామానికి తూర్పుగా అర్లపాడు ఉండేది. కఠెవరం గ్రామస్థులలో అర్లపాడు పొలాలు అను వాడుక ఉంది.

**ఆధారం:** కఠెవరం గ్రామస్థులు కడియాల వెంకటేశ్వరరావు
ఇచ్చిన సమాచారం.

## 6. బుట్లమ్మపాడు

ఆలపాడు (చుండూరు మండలం) గ్రామానికి పశ్చిమాన బుట్లమ్మపాడు ఉండేది. ఆ గ్రామానికి పశ్చిమాన ఓ చెరువు ఉంది. ఇంతకు మించి వివరాలు లేవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 13.

## 7. రాముపాలెం

గోల్కొండ పాలకుడైన మహమ్మద్ కుతుబ్ షా (క్రీ.శ. 1612-1626) ప్రభుత్వంలో జూపల్లి రంగపతిరావు (క్రీ.శ. 1616-1618) కొండవీడు పాలకుడు. ఓనాడు రంగపతిరావు కృష్ణానదిలో స్నానం చేసి సమీప వల్లభాపురం (కొల్లిపర మండలం) గ్రామానికి చేరుకోగా అచ్చటి బ్రాహ్మణులు ఆయనను జొన్న అక్షింతలతో ఆశీర్వదించారు. దానికి రంగపతిరావు ఆశ్చర్యచకితుడై కారణమడిగాడు. వారు తమ గ్రామంలో మాగాణిపంట లేదని అందుచేత బియ్యంతోకాక జొన్న అక్షింతలతో ఆశీర్వదించవలసి వచ్చిందని చెప్పారు. వెంటనే రంగపతిరావు ఈమని (దుగ్గిరాల మండలం), రాముపాలెం గ్రామాలలో రఘునాయకస్వామికి ఇచ్చిన మాగాణి భూములను వల్లభాపురం గ్రామంలో చేర్చాడు. రాముపాలెం ఇప్పుడు లేదు. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 58.
2. కొండవీడు కైఫియత్తు-2020. పుట: 83, 85.
   మోదుగుల రవికృష్ణ, గుంటూరు.

## 8. పొట్టపల్లి

కాకతీయులకాలంనాటి చిలుమూరు (కొల్లూరు మండలం) వేణుగోపాలస్వామి ఆలయశాసనం (తేదీ తెలియదు) లో 'పొట్టపల్లి దక్షిణమున ఆతుమూండి' అని ఉంది. ఆతుమూండి (అనంతవరం, కొల్లూరు మండలం) గ్రామానికి ఉత్తరంగా పొట్టపల్లి గ్రామం ఉండేదని తెలుస్తున్నది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 377.
2. చిలుమూరు ఉభయరామేశ్వరక్షేత్రము, సంపాదకులు:
   హరి వెంకటసుబ్బయ్యశాస్త్రి, చిలుమూరు, 1966, పుట: 34.

## 9. కొల్లూరు పరిసర అదృశ్యగ్రామాలు

పశ్చిమ చాళుక్య ప్రభువు త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్య (క్రీ.శ. 1076 – 1226) సేనాని అయిన అనంతదండపాలుడు క్రీ.శ. 1115 లో కొల్లూరు అనంతభోగేశ్వరస్వామికి దానంగా ములకలపాడు గ్రామాన్ని ఇచ్చాడు. ఈ ములకలపాడు, కొల్లూరు సమీప ముసళ్ళపాడు ఒకటేనా? అనే విషయం పరిశోధన చేయవలసివుంది. ములకలపాడు ఓగేరువాగు తీరాన ఉండేది.

మెకంజీ రికార్డులో కొల్లూరు సమీపాన 'కొప్పోడు' గ్రామం ఉన్నట్లు తెలిపారు. ఇంతకు మించి వివరాలు లేవు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 21.
2. ముచ్చట్లు, కాట్రగడ్డ బసవపున్నయ్య, తెనాలి, 2010. పుట: 30.
3. కొల్లూరు కథనం, పొణుకుబాటి వెంకటసుబ్బయ్య,
   కొల్లూరు, 2004, పుట: 48.
4. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 26.

## 10. మల్లవరపాడు

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542–1576) కాలంలో కొండవీడు పాలకుడైన సిద్ధిరాజు తిమ్మరాజు (క్రీ.శ. 1554–1561) (అళియరామరాయల మేనల్లుడు) శేకూరు (చేబ్రోలు మండలం) గ్రామాన్ని గౌరాజు వెంగళప్పకు ఇచ్చాడు. క్రీ.శ. 1561 లో గౌరాజు వెంగళప్ప శేకూరు వేంకటేశ్వరస్వామికి ఇచ్చిన దాన శాసన సరిహద్దు పట్టికలో 'శలపాడు (చేబ్రోలు మండలం) నుండి తంగెళ్ళమూడి (పెదకాకాని మండలం) పోయే కాలువ తెరువు (బాట) పడమట మల్లవరపాటి' అని వుంది. ఈ శాసనాన్ని బట్టి వీరనాయకునిపాలెం (చేబ్రోలు మండలం) గ్రామానికి పశ్చిమాన మల్లవరపాడు ఉండేది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 249.

## 11. గుంటుపల్లివారిపాలెం

చినపాలెం (దుగ్గిరాల మండలం) గ్రామ కమ్మకులస్థులు గుంటుపల్లివారు దుగ్గిరాల మండలంలో ఉన్న పెదకొండూరు-గొడవర్రు మార్గంలో గొడవర్రుకు చేరువలో గుంటుపల్లివారిపాలెం గ్రామం నిర్మించారు. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఈ ప్రాంతంలో కనిపించే రోళ్ళను 'గుంటుపల్లివారి రోళ్ళు' అంటారు.

**ఆధారం:** తెనాలి వాస్తవ్యులు ముత్తేవి రవీంద్రనాథ్ ఇచ్చిన సమాచారం.

## 12. సీతానగరం

ఈమని (దుగ్గిరాల మండలం), కుంచవరం (కొల్లిపర మండలం) గ్రామాల మధ్య సీతానగరం ఉండేది. ఇప్పుడు పంటపొలాలుగా మారిపోయింది. ఈమని, కుంచవరం గ్రామస్థుల్లో సీతానగరం వాడుక ఉంది.

**ఆధారం:** ఈమని గ్రామస్థులు పసుపులేటి శివకోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 13. గోపీనాథునికండ్రిక

విజయనగరచక్రవర్తి శ్రీరంగదేవరాయలు పాలన (క్రీ.శ. 1572-1585) లో కొండవీడు పాలకుడు శేషాద్రినాయుడు క్రీ.శ. 1578లో చావలి(వేమూరు మండలం) దక్షిణభాగాన గోపీనాథునికండ్రిక పొలాలను చావలి వేణుగోపాల స్వామికి దానంగా ఇచ్చాడు. గోపీనాథుని కండ్రిక ఎందుకు అదృశ్యమైనదో తెలియవలసివున్నది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 45.
2. చావలి గ్రామస్థులు విష్ణుమొలకల లీలాసుబ్రహ్మణ్యం ఇచ్చిన సమాచారం.

## 14. బుర్రిపాలెం పరిసర అదృశ్యగ్రామాలు

కొండవీడురాజ్యపాలకుడు అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) వద్ద చందు బుర్రినాయకుడు సేనానిగా ఉండేవాడు. అతనికి అనవేమారెడ్డి దావులూరు (కొల్లిపర మండలం) శివారు పొలంలో 40 కుచ్చెళ్ళ భూమి దానంగా ఇచ్చాడు. చందు బుర్రినాయకుడు తన పేర బుర్రిపాలెం (తెనాలి మండలం) గ్రామాన్ని నిర్మించాడు. బుర్రినాయకుడు తన వద్ద పని చేసే నలుగురు నాయకులకు కూడా కొంత భూమిని ఇచ్చాడు. వారు కూడా తమ తమ పేర్లతో తమ భూములలో గ్రామాలు నిర్మించారు. అవి వెంగయ్యపాలెం, బుట్టయ్యపాలెం, రాయకంపాడు, లింగంపాడు. ఈ గ్రామాల హద్దులు, అదృశ్యకారణాలు తెలియవు. చందు ఇంటిపేరుగల కాపులు తెనాలి ప్రాంతంలో హెచ్చుగా ఉన్నారు.

కుచ్చెల అంటే మూడు ఎకరాల నలభై సెంట్ల భూమి.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 120.

## 15. బొల్లవరం

కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో దుగ్గిరాల మండలంలో ఉన్న చిలువూరు, శృంగారపురం గ్రామాల దగ్గర బొల్లవరం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. బొల్లవర గ్రామకరణాలు శ్రీవత్సగోత్రులు. వీరి ఇంటిపేరు తెలియదు. బాపట్ల తాలూకాలో తూర్పుబొల్లవరం అనే అదృశ్యగ్రామం ఉన్నది. మూప్పాళ్ళ మండలంలో కూడా బొల్లవరం గ్రామం ఉన్నది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 40, 64.

## 16. చోడవరం, జువ్విపూడి (జూపూండి)

13వ శతాబ్ది ఈమని (దుగ్గిరాల మండలం) శాసనంలో చోడవరం గ్రామ ప్రస్తావన ఉంది. క్రీ.శ. 1236 పెనుమూలి (దుగ్గిరాల మండలం) శాసనంలో స్థానికపాలకుడు ఎఱ్ఱయలెంక జూపూండి గ్రామభూమిని పెనుంబూలి (పెనుమూలి, దుగ్గిరాల మండలం) గౌరీశ్వరదేవరకు దానం ఇచ్చినట్లు ఉంది. అనంతర కాలంలో కోనేటి అయ్యవార్లకు కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509 - 1529) పై రెండు గ్రామాలను దానం ఇచ్చాడు.

కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో దుగ్గిరాల మండలంలో ఉన్న ఈమని, చింతలపూడి (ఉత్తర చింతలపూడి) గ్రామాలకు చేరువలో చోడవరం (బోడివరం?), జువ్విపూడి (జువ్వెపూడి) ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. ఈ రెండు గ్రామాల కరణాలు వెలనాటివారైన కౌశికసగోత్రులు. వీరి ఇంటి పేరు తెలియదు. అమరావతి, పొన్నూరు మండలాలలో కూడా జూపూడి (జూపూండి) పేరిట గ్రామాలున్నాయి.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 40, 54, 64.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 509, 538.

## 17. యెక్కటల పెనుమత్రు

కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో దుగ్గిరాల మండలం పెదకొండూరు, గొడవర్రు గ్రామాల వద్ద యెక్కటల పెనుమత్రు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. ఈ గ్రామకరణాలు వెలనాటివారైన మౌద్గల్యసగోత్రులు. వీరి ఇంటిపేరు తెలియదు. వేమూరుమండలంలో కూడా పెనుమత్రు పేరుతో ఒక గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 40

## 18. మీసరగడ్డ అనంతవరం

శేకూరు (చేబ్రోలు మండలం) గ్రామానికి పశ్చిమాన మీసరగడ్డ అనంతవరం ఉండేది. ఇక్కడి పొలాలను మీసరగడ్డ అనంతవరం పొలాలుగా పిలుస్తారు. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. నేడు వీరనాయకునిపాలెం (చేబ్రోలు మండలం) గ్రామంలో మీసరగడ్డ అనంతవరం పొలాలు కలిసిపోయాయి. క్రీ.శ. 1561 శేకూరు శాసనంలో తెలియజేసిన సరిహద్దుల ప్రకారం 'అనోతవరపు(పాటి)' అని ఉంది. అది మీసరగడ్డ అనంతవరమో, కాదో పరిశీలన చేయాలి. మీసరగండ అంటే వీరత్వం సూచించే బిరుదు. 16వ శతాబ్ది మంగళగిరి శాసనంలో బుజబలరాయ అనే అతను మంగళగిరి నరసింహదేవరకు మీసరగండ అనంతవరంలో కొంత భూమి దానంగా ఇచ్చినట్లు ఉంది.

**ఆధారం:**

1. తెనాలి వాస్తవ్యులు ముత్తేవి రవీంద్రనాథ్ ఇచ్చిన సమాచారం.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 4, సీరియల్ నెం. 710.

## 19. గురువిందపల్లి (గురులిందపల్లి)

దోనేపూడి (కొల్లూరు మండలం) గ్రామానికి దక్షిణాన అద్దేపల్లి (భట్టిప్రోలు మండలం) గ్రామానికి తూర్పు ఈశాన్యంలో గురువిందపల్లి ఉండేది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో ఈ గ్రామం కనిపిస్తుంది. గురువిందపల్లి గ్రామకరణాలు తెలగాణ్యులైన పరాశరసగోత్రులు బందావారు. గజపతులు వీరికి ఆ అధికారాన్ని అప్పగించారు. బందావారికి రెడ్డిరాజులు అదేవిధంగా పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం)లో భాగాన్నిచ్చి, కందావారము అనువారికి మాత్రమే గురువిందపల్లి గ్రామకరణీకాన్ని ఇచ్చారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 79.

# 20. గొడవర్రు పరిసర అదృశ్యగ్రామాలు

క్రీ.శ. 1520లో గొడవర్రు(చేబ్రోలు మండలం), గుండవరం(చేబ్రోలు మండలం) గ్రామాలను విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509 - 1529) అన్నంభొట్ల వెంకటేశ్వరాచార్యులకు అష్టభోగసహితంగా దానం ఇచ్చాడు. దాన శాసన సరిహద్దులలో ఆడమూడి గ్రామం గొడవర్రు ఉత్తరదిశలో ఉన్నట్లు, గొడవర్రు పడమరన నల్లకుంట తటాకము కలిగి ఆడమూరు (ఆతుమూరు?) గ్రామానికి ఆగ్నేయంగా ఉన్నట్లు ఉంది. అంటే గొడవర్రు గ్రామానికి నైఋతిదిశలో ఆడమూరు (ఆతుమూరు?) ఉన్నట్లు తెలుస్తున్నది. ఆడమూడి, ఆడమూరు గ్రామాలు నేడు కనిపించవు.

"ఆడమూడి పిమత్త్వాదొరవర్త్యోత్తర పశ్చిమా తటాకాంన్నల్లకుంట్వాభ్యాం ప్రాశ్చిమాశాముపస్థితం, ఆడమూరి మహా గ్రామాదాగ్నేయం దిశేయాస్థితం"

ఈ శాసనంలో గొడవర్రు సమీపంలో ముళ్ళపూడి, వేములేశ్వరపురం (లేమల్లెపాడు, వట్టిచెరుకూరు మండలం) మొదలగు గ్రామాలున్నాయి. ముళ్ళపూడి ఇంటి పేరుతో గుంటూరుజిల్లాలో కొన్ని బ్రాహ్మణ కుటుంబాలున్నాయి. గొడవర్రు గ్రామానికి గుణవరం, కృష్ణరాయపురం అని ప్రతినామాలున్నాయా? లేక ఇవి వేరే గ్రామాలా? అనేది శాసనం శిథిలమగుటవలన తెలియడం లేదు. తెనాలి తాలూకా దుగ్గిరాల మండలంలో కూడా గొడవర్రు గ్రామం ఉంది.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 78.
2. సూర్యదేవర రవికుమార్ (గుంటూరు) ఇచ్చిన సమాచారం.
3. విష్ణుమొలకల లీలాసుబ్రహ్మణ్యం (విజయవాడ) ఇచ్చిన సమాచారం.

## 21. పిచ్చికలపాడు

క్రీ.శ. 1543 గోవాడ తామ్రశాసనంలో గోవాడ (అమృతలూరు మండలం) గ్రామానికి ఉత్తరంగా ఈ పిచ్చికలపాడు ఉండేదని తెలుపబడింది.

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) కాలపు క్రీ.శ. 1567 పెరవలి శాసనంలో పెరవలి (వేమూరు మండలం) గ్రామ పొలిమేర సరిహద్దు దక్షిణాన అమృతలూరు పొలిమేర వెంబడిని ఆ ఉత్తరం కోలిగుంట్టకు వెలి (బయట) ఆ ఉత్తరం పుట్టగుంట్టకు వెలి ఆ ఉత్తరం పిచ్చికలపాడు పడమర పొలిమేర కంభం (స్తంభం) మోమూలువూరు (మూల్పూరు, అమృతలూరు మండలం) అని ఉంది. దీన్నిబట్టి మూల్పూరు గ్రామానికి తూర్పు ఆగ్నేయంగా, పెరవలి గ్రామానికి నైఋతిగా పిచ్చికలపాడు ఉండేదని తెలుస్తున్నది. పిచ్చికలపాడును పచ్చికలపాడుగా భావించాలి.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 115.
2. గోవాడ నుండి దగ్గుమల్లి చరిత్రలోనికి, కాట్రగడ్డ బసవపున్నయ్య, గోవాడ, 2004. పుట: 66.

## 22. పులిచింతలపాలెం

మొగలాయిల కాలంలో కూచిపూడిసమితి పాలకుడు, పుల్లసాని అనే వేశ్యకు కూచిపూడి (అమృతలూరు మండలం) పొలంలో 5 కుచ్చెళ్ళ భూమి (కుచ్చెల అంటే 3ఎకరాల 40సెంట్లు) కంద్రిక (ఖండించి) చేసి హద్దు పెట్టించి ఇచ్చాడు. పుల్లసాని ఆ ప్రాంతంలో ఇల్లు కట్టుకుని కొందరు వృత్తికులాలవారికి భూదానం చేసి, చింతలు (చింతచెట్లు) నాటించినందువలన ఆ గ్రామానికి 'పుల్లసాని చింతలపాలెం' అని పేరు. కాలక్రమేణా పులిచింతలపాలెంగా మారింది.

క్రీ.శ. 1712?లో కొండవీడుసీమను జమీందార్లకు పంచినప్పుడు ఈ గ్రామం చింతపల్లి (అచ్చంపేట మండలం) జమీందారు వాసిరెడ్డి పద్మనాభుని వంతుకు వచ్చింది.

వీరి వంశానికి చెందిన వాసిరెడ్డి రామలింగన్న పులిచింతలపాలెం గ్రామాన్ని పిల్లలమర్రి శివన్న సోమయాజులుకి అగ్రహారంగా ఇచ్చాడు. పిల్లలమర్రి వంశీయులు క్రీ.శ. 1812లో ఉన్నట్లు మెకంజీ రికార్డు తెలియజేస్తున్నాయి. పులిచింతలపాలెం (వేమూరు మండలం) అదృశ్యకారణాలు తెలియవు. పిల్లలమర్రివారిలో ఓ శాఖవారికి పులిచింతలపాలెంలో వసతి చాలక తెనాలి చేరారు. వారికీ, అప్పటి తెనాలి కరణాలు తురగా (నియోగి బ్రాహ్మణశాఖ) వారికీ సరిపడలేదు. దాంతో వాసిరెడ్డివారితో అనుబంధం ఉన్న పిల్లలమర్రి శివన్న సోమయాజుల వంశీయులు తెనాలి కరణీకం పొందారు.

తెనాలి వేణుగోపాలస్వామి ఆలయధర్మకర్తలు పిల్లలమర్రివారు. పులిచింతలపాలెం కూచిపూడి (అమృతలూరు మండలం) గ్రామానికి వాయువ్యంగా, కూచిపూడి,పెదరావూరు (తెనాలి మండలం) గ్రామాలకి మధ్య ఉంది. కూచిపూడి గ్రామస్థులలో పులిచింతలపాలెం పొలాలు వాడుక ఉంది. గతానికి చిహ్నంగా 20 ఎకరాలలో పులిచింతల చెరువు ఇక్కడ ఉంది. కూచిపూడి కరణాలే పులిచింతలపాలెం గ్రామానికి కరణాలు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 78, 99.
2. కూచిపూడి గ్రామస్థులు తుమ్మల శ్రీరాములు, జాస్తి శ్రీనివాసరావు ఇచ్చిన సమాచారం.

## 23. నవురూరు

క్రీ.శ. 1153 చిలుమూరు (కొల్లూరు మండలం) శాసనంలో స్థానిక రామేశ్వరాలయానికి నవుఱూరి (నవురూరు) పొలం దానం ఇచ్చినట్లు ఉంది. ఈ శాసనంలో చిలుమూరును చునుమూరుగా పేర్కొన్నారు. మంగళగిరి మండలంలో నవులూరు పేరిట ఒక గ్రామం ఉంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 130.

## 24. బండ్లమూడిపాడు

చుండూరువద్ద బండ్లమూడిపాడు గ్రామం తొలుత జైన నివాసకేంద్రంగా ఉండేదని, తర్వాత వీరశైవుల అధీనంలోకి వచ్చి, అదృశ్యమయిందని చెబుతారు. 1938 లో కొత్తపల్లి నారికేళపల్లి (చుండూరు మండలం) వాస్తవ్యుడు యాదవులు అక్కిబాపయ్య తన పొలంలో దుక్కి దున్నుతుండగా ఒక శివలింగం కనిపించింది. అప్పట్నుంచి అక్కడి ప్రజలు ప్రతి ఏటా తిరునాళ్ళు చేయడం ప్రారంభించారు. తిరునాళ్ళ వలన తమ పైరుకు నష్టం జరుగుతుందని సమీప రైతులు వాపోగా చుండూరు గ్రామపెద్దలు గాదె నాగభూషణరెడ్డి, మోదుగుల సాంబిరెడ్డి తదితరులు ఆ పొలాన్ని కొని ఆలయాన్ని నిర్మించారు. అవే చుండూరు గుళ్ళు. చుండూరు శివరాత్రి జాతర్లు గుంటూరుజిల్లాలోనే ప్రముఖమైనవి. గుంటూరు-పొన్నూరు రహదారిలో మంచాల అడ్డరోడ్డు నుండి చుండూరు (మండలకేంద్రం) వెళ్లే మార్గంలో చుండూరు గుళ్ళను దర్శించవచ్చు.

**ఆధారం:**

1. ఆంధ్రప్రభ ప్రత్యేక సంచిక-2013. పుట: 35.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 138.

## 25. మహానందిరాజుపేట (శ్రీరంగరాయపేట)

తిమ్మరాజయ్యదేవమహారాజు అమృతలూరు (మండలకేంద్రం) దక్షిణదిశలో మహానందిరాజు పేరిట మహానందిరాజుపేట (సంత) ను నిర్మించినట్లు, జమాలెక్కలు, పరిపాలన వెనికంట్ల తిప్పన పరం చేసినట్లు క్రీ.శ. 1511లో శాసనాన్ని వేయించాడు. ఆనాడు ఈ ప్రాంతం గజపతుల పాలనలో ఉండేది. వారి కాలంలో తిమ్మరాజయ్యదేవమహారాజు లేడు. కావున సంవత్సరాన్ని చెక్కడంలో శాసనలేఖకుని పొరపాటో లేదా అమృతలూరు కైఫియత్తులోని సమాచారలోపమో లేదా అచ్చు పొరపాటుగానో భావించాలి.

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) పాలనలో సిద్ధిరాజు తిమ్మరాజు (అళియ రామరాయల మేనల్లుడు) కొండవీడు పాలకుడు కాబట్టి అమృతలూరు శాసనాన్ని అతనే వేయించాడని కచ్చితంగా చెప్పవచ్చు. విజయనగరచక్రవర్తి మొదటి శ్రీరంగరాయలు (క్రీ.శ. 1572-1585) పాలనలో కొండవీడు పాలకుడు అడపా (బొక్కసం) నాగపనాయనింగారు అమృతలూరులో ఉన్న మహానందిరాజుపేటను శ్రీరంగరాయపేటగా మార్చి క్రీ.శ. 1576లో శాసనం వేయించాడు.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 4, 5.
3. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 334.
4. అమృతలూరు అమృతచరిత్ర, పరుచూరి రంగారావు, 2002. పుట: 88..


## 26. పెద్దింటమ్మపాడు

చుండూరు (మండలకేంద్రం) గ్రామానికి ఈశాన్యంగా పెద్దింటమ్మపాడు అనే జైన గ్రామం ఉండేది. చుండూరు గ్రామస్థులు అదృశ్యమైన పెద్దింటమ్మపాడు దిబ్బకు దక్షిణ ఆగ్నేయ భాగాన 2 కి.మీ. దూరంలో దిబ్బ పోయించి, పెద్ద గాదెలలో తమ ధాన్యాన్ని (వడ్లు వగైరా) నిల్వ ఉంచడం వలన ఆ ప్రాంతానికి పెదగాదెలవర్రు (చుండూరు మండలం) అను పేరు వచ్చింది.

క్రీ.శ. 1518 ఫిబ్రవరి 26 శుక్రవారం నాడు విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509 - 1529) కృష్ణాజిల్లా, ఘంటసాల మండలం శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువుకి కొండవీడుసీమలోని పెదగాడిదపట్టు (పెదగాదెలవర్రు?) గ్రామాన్ని దానం ఇచ్చినట్లు శాసనాధారం ఉంది.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 101.
2. శ్రీకృష్ణదేవరాయల తెలుగు శాసనములు, సంపాదకులు: ఈమని శివనాగిరెడ్డి, కుర్రా జితేంద్ర, దామరాజు సూర్యకుమార్; 2010. పుట: 132, 133.

## 27. మలిపాడు

క్రీ.శ. 1214 దుగ్గిరాల (మండలకేంద్రం) శాసనంలో కుంచవరం (కొల్లిపర మండలం) గ్రామానికి ఉత్తరదిశలో మలిపాటికుంట అని ఉంది. అంటే ఆ సమీపాన మలిపాడు గ్రామం ఉండేదని తెలుస్తుంది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 261.

## 28. అర్గలపాడు

వేమూరు (మండలకేంద్రం) గ్రామానికి దక్షిణ నైరుతిదిశలో అర్గలపాడు అనే వర్తకకేంద్రం ఉండేది. దీనికి తూర్పున పాలకోడు ప్రవాహం ఉండేది. అది సముద్రం నుండి వచ్చిన ఓ ఉప్పుకాలువ. అర్గలపాడు షావుకార్లు పాలకోడు ప్రవాహం ద్వారా ఎగుమతులు, దిగుమతులు చేసి ఆర్జించిన ధనాన్ని ఆ సమీపంలోని ఓ పాటిపై నిక్షేపించి భైరవ యంత్రోద్ధారణ చేసి కాపలాగా ప్రతిష్ఠించారు. ఈ నిధి తాలూకు రహస్యాన్ని కాశీలో శాసనరూపంలో వేయించారు. కొంతకాలానికి ఈ గ్రామం అదృశ్యమయింది. కాశీలోని మణికర్ణికఘాట్‌లో కందర్పుడు అను యోగి ఆ శాసనాన్ని చదివి చోళమండలం వెళ్లి కులోత్తుంగ చోళరాజును దర్శించి ఆ నిధి రహస్యాన్ని వెల్లడించాడు. అప్పుడు చోళరాజు మందీమార్బలంతో ఆ నిధి ప్రాంతానికి చేరుకున్నాడు. భైరవుడు కాశీకి గంగాస్నానానికి వెళ్లి వచ్చే ఏడుఘడియల సమయంలో ఏనుగులు, ఒంటెలు, ఎడ్లబండ్లపై ఆ నిధిని పొలిమేర దాటించేలోగా భైరవుడు వచ్చి ఆ ఇరువురి (రాజు, యోగి)లో ఒకరు బలి అయితే ఆ నిధిని ఇస్తానని చెప్పాడు. కందర్పుడు రాజుతో ఆ నిధిని ధర్మానికి వినియోగించమని చెప్పి భైరవుడికి బలి అయ్యాడు. చోళరాజు ఆ ప్రాంతంలో బలిగుంట పేరుతో ఒక చెరువును, బ్రహ్మహత్యాదోషపరిహారంగా పెరవలి (వేమూరు మండలం) గ్రామ ఉత్తరభాగంలో కందర్పేశ్వరునికి, తూర్పుభాగంలో సుగ్రీవేశ్వరునికి, దక్షిణభాగంలో చంద్రశేఖరునికి, పడమటిభాగంలో రామేశ్వరునికి, కుడిభాగంలో కేశవునికి, ఎడమభాగంలో మాధవునికి ఆలయాల్ని నిర్మించాడు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 129.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 112, 113.

## 29. అసలవర్తిశ్రీపాడు

కొండవీడు పాలకుడైన కోనేటి తిమ్మరాజు తన ప్రభువు సదాశివరాయలు (క్రీ.శ. 1542–1576) పేర దానమిచ్చినట్లు తెలిపే కొల్లిపర (మండలకేంద్రం) తామ్రశాసనం (క్రీ.శ. 1543) లో కొల్లిపరకు నైఋతిదిశలో అసలవర్తిశ్రీపాడు ఉన్నట్లు తెలుపబడింది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. అసలవర్తిశ్రీపాడు జంటగ్రామాలు కావచ్చు.

**ఆధారం:**

1. కొల్లిపర చరితం, ప్రధానసంపాదకులు: పొణుకుమాటి వెంకటసుబ్బయ్య, తెనాలి, 2011. పుట: 49.
2. కొల్లిపర వాస్తవ్యులు ఈదా సాంబిరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 30. వెన్నవరం, బుద్దవరం (బుగ్గవరం?)

క్రీ.శ. 1543 కొల్లిపర తామ్రశాసనంలో ఈ రెండుగ్రామాలు కొల్లిపర (మండలకేంద్రం) గ్రామానికి ఈశాన్యదిశలో కృష్ణానదికి దగ్గరగా ఉన్నట్లు చెప్పబడింది.

బుద్దవరం గ్రామకరణాలు వెలనాటివారైన గౌతమసగోత్రులు తారణాలవారు. తారణాల తిమ్మరాజు బుద్దవరం గ్రామకరణీకాన్ని బోడపాటి శరభరాజు(కొల్లిపర కరణం)కు అమ్ముకున్నాడు.

**ఆధారం:**

1. కొల్లిపర చరితం, ప్రధానసంపాదకులు: పొణుకుమాటి వెంకటసుబ్బయ్య, తెనాలి, 2011. పుట: 49.
2. కొల్లిపర వాస్తవ్యులు ఈదా సాంబిరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 31. అనంతవరప్పాడు

కొల్లిపర (మండలకేంద్రం) గ్రామానికి దక్షిణాన అంతంచెరువు దగ్గర అనంతవరప్పాడు ఉండేది. అక్కడ ప్రజల్లో అనంతవరప్పాడు పొలాలు అను వాడుక ఉంది.

**ఆధారం:**

1. కొల్లిపర వాస్తవ్యులు ఈదా సాంబిరెడ్డి ఇచ్చిన సమాచారం.
2. కఠెవరం (తెనాలి మండలం) గ్రామస్థులు కడియాల వెంకటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 32. రామేశ్వరపురపుకండ్రిక

క్రీ.శ. 1777లో నందిగామ (కృష్ణాజిల్లా) జమీందారు వాసిరెడ్డి పెదరామన్న (క్రీ.శ. 1763-1783) అనేక గ్రామాలను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చినపుడు వేమూరు (మండలకేంద్రం), వరహాపురం (వేమూరు మండలం) గ్రామాల మధ్య ఉన్న కిష్టమ్మచెరువువద్ద 693 ఎకరాలు కురుగంటివారికి దానంగా ఇచ్చాడు. కురుగంటివారు కృష్ణాజిల్లా ప్రొద్దువాక అగ్రహారం (కలిదిండి మండలం) నుండి వచ్చి కిష్టమ్మచెరువువద్ద రామేశ్వరపుకండ్రిక గ్రామాన్ని నిర్మించుకున్నారు. కురుగంటివారి ఆడపిల్లలను ధారా, చివుకుల, వెంపరాల, మొదలి, కానూరి, మొదలగు ఇంటిపేర్లు కల కుటుంబాలకు ఇచ్చి ఇల్లరికపు అల్లుళ్ళను చేసుకున్నారు. ఈ ఇంటిపేర్లవారు తెనాలి ప్రాంతంలో ఉన్నారు. రామేశ్వరపుకండ్రిక అదృశ్యకారణాలు తెలియవు. ఈ గ్రామస్థులు కొందరు వేమూరులో స్థిరపడ్డారు.

**ఆధారం:** వేమూరు గ్రామస్థులు అమ్మ కోనేరు లక్ష్మీప్రమీల గారు ఇచ్చిన సమాచారం.

## 33. తూర్పు పెంచికలపూడి

పెరవలి (వేమూరు మండలం) గ్రామ సమీపాన తూర్పు పెంచికలపూడి ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. పడమర పెంచికలపూడి నక్కలగుడిపాడు గ్రామం వద్ద ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.

## 34. ఉత్తర పల్లపట్ల

ఆలపాడు (చుండూరు మండలం) గ్రామ సమీపాన ఉత్తర పల్లపట్ల ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

నిజాంపట్నం మండలంలో కూడా పల్లపట్ల గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.

## 35. కుందేవిచోరు

కూచిపూడి (అమృతలూరు మండలం) సమీపాన కుందేవిచోరు, పులిచింతలపాలెం ఉండేవి. పులిచింతలపాలెం (వేమూరు మండలం) హద్దులు తెలిసినవి. కాని కుందేవిచోరు గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.

## 36. నాగులపాడు

కొలకలూరు (తెనాలి మండలం) గ్రామసమీపాన నాగులపాడు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

పెదనందిపాడు మండలంలో కూడా నాగులపాడు గ్రామం ఉంది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64.

## 37. గుమ్ముడువెల్లి

అనవేమారెడ్డి (క్రీ.శ. 1364–1386) కొల్లూరు తామ్రశాసనంలో తాడినగరి (తాడిగిరిపాడు, కొల్లూరు మండలం) పడమటి పాలకోడు పడమటి గుమ్ముడువెల్లి దక్షిణాన బాలుపుట్టలు అని ఉంది. ఇప్పుడు ఈ ప్రాంతంలో గుమ్మడువెల్లి గ్రామం లేదు. చాటుపద్య రత్నాకరము గ్రంథంలో గుమ్మడివెల్లి కృష్ణయ్య అను కవి ఉన్నాడు.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 55.

## 38. తెనాలి పరిసర విలీనగ్రామాలు

ఆంధ్రదేశాన పెద్ద పట్టణం, ఆంధ్రా ప్యారిస్‌గా పేరుగాంచిన తెనాలికి విద్య, వాణిజ్య, సాహిత్య, నాటక, సినిమా రంగాలలో ప్రముఖస్థానం ఉంది. ఈ పట్టణంలో అయితానగర్, మల్లెపాడు, పినపాడు, చినరావూరు, సుల్తానాబాద్, ముత్తంశెట్టిపాలెం పూర్తిగా కలిసిపోయాయి. క్రీ.శ. 1314 పెనుమూలి (దుగ్గిరాల మండలం) శాసనంలో పినపాడు, చినరావూరు గ్రామాల కొంతభూమి పెనుమూలి గౌరీశ్వరదేవరకు దానంగా ఇచ్చినట్లు ఉంది. క్రీ.శ. 1405లో పినపాడు గ్రామం శ్రీశైల మల్లికార్జునదేవరకు దానం ఇవ్వబడింది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 509.
2. చారిత్రక శ్రీశైలం, కొడాలి లక్ష్మీనారాయణ. మోపర్రు, అమృతలూరు మండలం, 1967. పుట: 72.
3. తెనాలి వాస్తవ్యులు బిళ్లా జవహర్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 39. దుర్గంపూడి

పేరకలపూడి (దుగ్గిరాల మండలం) గ్రామానికి తూర్పున దుర్గంపూడి ఉండేది. క్రీ.శ. 1134 దుగ్గిరాల కేశవస్వామి శాసనంలో దుర్గంపూడి ప్రస్తావన ఉంది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. ఇప్పటికీ పేరకలపూడి గ్రామస్థుల్లో తూర్పు దుర్గంపూడి పొలాలు అనే వాడుక ఉంది. దుర్గంపూడి ఇంటిపేరుతో రెడ్డి కులస్తులు ఉన్నారు. దుర్గంపూడి కరణాలు తెలగాణ్యులైన హరితసగోత్రులు వేగివారు.

**ఆధారం:**

1. దుగ్గిరాల దర్శిని, సంపాదకులు: బిళ్లా జవహర్‌బాబు, తెనాలి, 2015, పుట: 11-14. .
2. పేరికలపూడి వాస్తవ్యులు కొడాలి సోమసుందరరావు ఇచ్చిన సమాచారం.

## 40. రాజనాలపురం

కొల్లిపర (మండలకేంద్రం) నైఋతిదిశలో రాజనాలపురం ఉండేది. కొల్లిపర గ్రామస్థుల్లో రాజనాలపుర పొలాలు అను వాడుక ఉంది. (రాజనాల అంటే వడ్లలో ఒక రకం). రాజనాలపురం కరణాలు వెలనాటివారైన కౌశికసగోత్రులు తరిగొప్పులవారు. తరిగొప్పుల విశ్వపతి తన హక్కు (మిరాశి)ని ఆరాధ్యుల లింగరాజుకు, కాశీరాజు మూర్తిరాజు కృష్ణంరాజుకు అమ్మాడు. గుంటూరులో రాజనాల ఇంటిపేరుతో కాపు కులస్థులు ఉన్నారు

**ఆధారం:**

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 64.
2. కొల్లిపర గ్రామస్థులు ఈదా సాంబిరెడ్డి ఇచ్చిన సమాచారం.

## 41. కల్లపాడు

విజయనగరచక్రవర్తి సదాశివరాయలు (క్రీ.శ. 1542-1576) పాలనలో కొండవీడు పాలకుడు సిద్ధిరాజు తిమ్మరాజు (క్రీ.శ. 1554-1561) (అళియరామరాయల మేనల్లుడు) అనుమతితో శేకూరు (చేబ్రోలు మండలం) గ్రామస్థులు గౌరాజు కోనరాజు పుత్రులైన వెంగళప్ప క్రీ.శ. 1561లో స్థానిక తిరువేంకటేశ్వరస్వామికి ఇచ్చిన భూదాన శాసనంలో చామర్లమూడి (సంగం జాగర్లమూడి, తెనాలి మండలం) పొలిమేర శేకూరు, కల్లపాడు అని ఉంది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 16, సీరియల్ నెం. 249.

## 42. బిండిపురం

దుగ్గిరాల (మండలకేంద్రం) కి దక్షిణంగా, కొలకలూరు (తెనాలి మండలం) కి ఉత్తరంగా బిండిపురం ఉండేది. ఇక్కడ ప్రవహిస్తున్న తుంగభద్రనది తీరాన బిండిపురం ఉండవచ్చు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 2019, పుట: 24.

## 43. కోడూరివారిపాలెం, గోవిందువారిపాలెం

చేబ్రోలు మండలం నారాకోడూరు గ్రామానికి అనుబంధంగా ఈ రెండు గ్రామాలు ఉండేవి. నారాకోడూరు కరణాలైన కోడూరివారి వలన కోడూరివారిపాలెం ఏర్పడి ఉండవచ్చు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 98, 99.

## 44. ములకలపల్లి

కృష్ణానదిగర్భంలో ఇసుకదిబ్బలపై చాలా గ్రామాలు ఉన్నాయి. అవి కొన్ని గుంటూరుజిల్లా, కొన్ని కృష్ణాజిల్లాకు చెందినవి. ఈ లంకగ్రామాలు ఎక్కువగా ఇంటిపేరుతోగాని, లేక సమీప పెద్దగ్రామం పేరుతోగాని ఉంటాయి. కొల్లూరు, కొల్లిపర మండలాలలో ఈ లంకగ్రామాలు ఎక్కువ. ఉదాహరణకు ఆలపాటివారు నిర్మించిన లంకగ్రామం ఆలపాటివారిలంక (కొల్లిపర మండలం), చిలుమూరు గ్రామ సమీపాన నిర్మించిన లంకగ్రామం చిలుమూరులంక (కొల్లూరు మండలం). ములకలపల్లి సహజంగానే నదిగర్భంలో ఏర్పడి ఉంటుంది. కాలక్రమేణా కృష్ణానది వరదల్లో కొట్టుకుపోయింది. మిగిలిన గ్రామస్థులు నదిగర్భంలో ములకలపల్లిలంక (కొల్లూరు మండలం) ఏర్పాటుచేసుకున్నారు. ములకలపల్లి అయిలూరు (తోట్లవల్లూరు మండలం, కృష్ణాజిల్లా) గ్రామానికి దక్షిణాన ఉన్నట్లు క్రీ.శ. 1641 అయిలూరు శాసనంలో ఉంది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 37, సీరియల్ నెం. 185.
2. ఈమని (దుగ్గిరాల మండలం) గ్రామస్థులు పసుపులేటి శివకోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 45. గార్లపాడు (అయ్యగార్లపాడు)

కొలకలూరు (తెనాలి మండలం) సమీపాన గార్లపాడు ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. తెనాలి రామలింగకవి స్వగ్రామం ఈ గార్లపాడు గ్రామమేనని నా ప్రగాఢ విశ్వాసం. ఎందుకంటే తెనాలి రామలింగకవి ఇంటిపేరు గార్లపాటి. వారు తెనాలి ప్రాంతం వారని సుస్పష్టం. తెనాలి మహిషాసురమర్దిని ఆలయంలో వారి శాసనం ఉంది.

కొందరు పెద్దలు, పరిశోధకులు తెనాలి రామలింగకవి స్వగ్రామం గుంటూరు సమీపాన తక్కెళ్ళపాడు (పెదకాకాని మండలం) శివారు అదృశ్యగ్రామమైన గారపాడు (రామచంద్రపాలెం) గ్రామంగా భావిస్తున్నారు. అయితే కొలకలూరు సమీపాన అదృశ్యమైన గార్లపాడు వారి దృష్టికి రాలేదని భావిస్తున్నాను. మెకంజీ రిపోర్టులో విలీనగ్రామ పట్టిక ఇచ్చారు. ఆ విలీనగ్రామాల మొత్తం సమీప మేజరు గ్రామానికి కేవలం 1,2 కి.మీ. దూరంలో ఉన్నాయి. కావున కొలకలూరు సమీపాన గార్లపాడు ఉండేదని కచ్చితంగా చెప్పవచ్చు.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64

## 46. గుండాపాడు

కూచిపూడి (అమృతలూరు మండలం) గ్రామానికి పశ్చిమంగా గుండాపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు.

**ఆధారం:** కూచిపూడి గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.

## 47. బొద్దులూరు

అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) కొల్లూరు తామ్రశాసనంలో బొద్దులూరు ప్రస్తావన ఉంది. విజయనగరచక్రవర్తి సదాశివరాయలు పాలన (క్రీ.శ. 1542-1576) లో కొండవీడు పాలకుడు సిద్ధిరాజు తిమ్మరాజు (క్రీ.శ. 1554-1561) (అళియరామరాయల మేనల్లుడు) చావలి (వేమూరు మండలం) వాలేశ్వరస్వామికి బొద్దులూరు (బొద్దలూరు) గ్రామాన్ని దానం ఇచ్చాడు. కొల్లూరు మండలంలోని బొద్దులూరిపాడు సమీపాన బొద్దులూరు (బొద్దలూరు) ఉండేది. బొద్దులూరి ఇంటిపేరుతో బ్రాహ్మణ, కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 44, 45
2. బొద్దులూరిపాడు (కొల్లూరు మండలం) గ్రామస్థులు నూతలపాటి నాగభూషణశాస్త్రి ఇచ్చిన సమాచారం.
3. బలిజేపల్లి (వేమూరు మండలం) గ్రామస్థులు రావెల శ్రీనివాసరావు ఇచ్చిన సమాచారం.

## 48. తాడినగరి (తాడిగిరి)

అనవేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) కొల్లూరు తామ్రశాసనంలో తాడినగరి ప్రస్తావన ఉంది. కొల్లూరు (మండలకేంద్రం)కు నైఋతిదిశలో తాడినగరి ఉండేది. ఇప్పుడు ఉన్న తాడిగిరిపాడు (కొల్లూరు మండలం) గ్రామం తాడినగరి అదృశ్యమైన తర్వాత ఏర్పడి ఉండవచ్చు! తాడిగిరి ఇంటిపేరుతో కొన్ని కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 64
2. గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 55.

## 49. కంచర్ల, అయ్యవరం

కఠెవరం (తెనాలి మండలం) గ్రామ సమీపాన కంచర్ల, అయ్యవరం ఉండేవి. నేడు కంచర్లపాలెం (తెనాలి మండలం) ఉంది. అయ్యవరం గ్రామమే కంచర్లపాలెం పక్కనున్న సోమసుందరపాలెం (తెనాలి మండలం) గ్రామమని కొందరి భావన. ఈ ప్రాంతంలో ప్రవహిస్తున్న తుంగభద్రనది వరదను కట్టడి చేసిన కఠెవరం అగ్రహారీకుడు కనకదిండి సోమన్న పేరుతో సోమసుందరపాలెం ఏర్పడిందట! కనకదిండి సోమన్న అక్కన్న, మాదన్నలకు మిత్రుడు.

ఆధారం:

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 65
2. కఠెవరం గ్రామస్థులు కడియాల వెంకటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 50. చేబ్రోలు సమితి పరిసర అదృశ్యగ్రామాలు-1

క్రీ.శ. 1712? నాడు గోల్కొండ నవాబుల ప్రతినిధి రాయరావు కొండవీడు రాజ్యాన్ని సమితులుగా విభజించాడు. నాడు చేబ్రోలు సమితిలో 28 గ్రామాలుండేవి. ఆ గ్రామాలు మంగళగిరి, తెనాలి, దుగ్గిరాల, చుండూరు, వట్టిచెరుకూరు, చేబ్రోలు మండలాల్లో ఉన్నాయి. ఆ గ్రామాలు వివిధ జమీలకు ఇవ్వబడ్డాయి. వాటిలో కొన్ని గ్రామాలు అదృశ్యమయ్యాయి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో కొన్ని గ్రామాల కరణాలు తెలియుచున్నారు.

**1. అన్నవరప్పాడు:** హద్దులు తెలియవు. రొంపిచర్ల మండలంలో కూడా అన్నవరప్పాడు గ్రామం ఉంది.

**2. కొమిరిజమూడి (పాడు):** హద్దులు తెలియవు. కరణాలు వెలనాటివారైన భారద్వాజసగోత్రులు మల్లాప్రగడవారు. కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో కోవెలమూడి (వట్టిచెరుకూరు మండలం), కొమిరిజమూడి, నారికేళపల్లి ( కొత్తపల్లి నారికేళపల్లి, చుండూరు మండలం) వరస క్రమంలో ఉన్నాయి.

**3. మొళలపూడి (మొలళపూడి):** హద్దులు తెలియవు.

**4. మట్టెగుంట:** హద్దులు తెలియవు. కరణాలు భారద్వాజసగోత్రులు మట్టెగుంటవారు.

**5. నయనవరం:** హద్దులు తెలియవు. కరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు నారాకోడూరువారు. కొండవీడు దండకవిలె వరస కరణీకపట్టికలో గొడవర్రు (చేబ్రోలు మండలం), నయనవరం, కొలకలూరు (తెనాలి మండలం) వరస క్రమంలో ఉన్నాయి. గొడవర్రు గ్రామకరణాలు వెలనాటివారైన కౌండిన్యసగోత్రులు గుండవరపువారు. గుండవరం, గొడవర్రు, నారాకోడూరు (చేబ్రోలు మండలం) సమీప గ్రామాలు.

**6. నయనవరప్పాడు:** హద్దులు తెలియవు. నయనవరం సమీప గ్రామమే నయనవరప్పాడు అయ్యే అవకాశం హెచ్చుగా ఉంది.

**7. ఆతుమూడి:** హద్దులు తెలియవు. కరణాలు శిష్ట్లా వారు, చేబ్రోలు మండలం మంచాలగ్రామ కరణాలు కూడా శిష్ట్లా వారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 2, పుట: 21, 34, 37, 54.
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 58, 59.

## 51. చేబ్రోలు సమితి పరిసర అదృశ్యగ్రామాలు-2

కాకతీయ గణపతిదేవచక్రవర్తి (క్రీ.శ. 1199-1262) పాలనలో గజసేనాని, రాజబంధువు అయిన జాయప క్రీ.శ. 1235లో చేబ్రోలు గ్రామంలో చౌడేశ్వరస్వామి ఆలయం నిర్మించాడు. పది గ్రామాలలో తటాకాలు నిర్మించాడు. వాటిలో కొన్ని గ్రామాలు అదృశ్యమైనవి.

**1. గడెవరంపూడి** - ఎక్కడో తెలియదు.

**2. నారికెడపూడి** - కొత్తపల్లి నారికేళపల్లి, చుండూరు మండలం.

**3. మంచెళ్ళ** - మంచాల, చేబ్రోలు మండలం.

**4. కోవిలంపూడి** - కోవెలమూడి, వట్టిచెరుకూరు మండలం.

**5. కొమరజంపూడి** - ఎక్కడో తెలియదు.

**6. వేజండ్ల** – చేబ్రోలు మండలం.

**7. ఊమ్మెత్తపూడి** – ఎక్కడో తెలియదు.

**8. సుద్దపూడి** – సుద్దపల్లి, చేబ్రోలు మండలం.

**9. సెరంపూడి** – సెలపాడు? చేబ్రోలు మండలం.

**10. ములకలపూడి** – ఎక్కడో తెలియదు.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 44.

## 52. చేబ్రోలు సమితి పరిసర అదృశ్యగ్రామాలు-3

12వ శతాబ్ది చేబ్రోలు శాసనంలో చేబ్రోలు కుమారస్వామికి, కొల్లూరు అనంత బోగేశ్వరస్వామికి 9 గ్రామాలలో భూమి ఇవ్వబడింది. వాటిలో కొన్ని గ్రామాలు అదృశ్యమయ్యాయి.

**1. వడ్లపూడి** – పెదవడ్లపూడి (మంగళగిరి మండలం) కావచ్చు. వడ్లమూడి? చేబ్రోలు మండలం.

**2. గుడిపూడి** – గుడివాడ? తెనాలి మండలం.

**3. కొలకలూరు** – తెనాలి మండలం.

**4. నమిలి కంబాల** – ఎక్కడో తెలియదు.

**5. కంతేరు** – తాడికొండ మండలం.

**6. కోడూరు** – ఉత్తర నారాకోడూరు గ్రామం కంతేరు సమీపాన అదృశ్యమైంది. ఇంకా నారాకోడూరు (చేబ్రోలు మండలం), సంగుపాలెం కోడూరు (పిట్టలవాని పాలెం మండలం), బ్రాహ్మణకోడూరు (పొన్నూరు మండలం) గుంటూరుజిల్లాలో ఉన్నాయి.

**7. తాళ్ళపూడి** – తాళ్ళపాలెం? పొన్నూరు మండలం.

**8. కట్టంపూడి** – కట్టెంపూడి? పొన్నూరు మండలం.

**9. చేబ్రోలు** – మండల కేంద్రము.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 41.

# 53. తెనాలి పరిసర అదృశ్యగ్రామాలు

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి పాలన (క్రీ.శ. 1289-1323) లో ఈ ప్రాంత పాలకుడు ఎఱ్ఱయలెంక స్థానిక పెనుమూలి గౌరీశ్వరదేవరకు 22 గ్రామాలలో పుల్లరి (పన్ను) దానంగా ఇచ్చినట్లు క్రీ.శ. 1314 పెనుమూలి శాసనంలో ఉంది. ఆ గ్రామాలు గుంటూరుజిల్లాలో అనేక ప్రాంతాలలో ఉన్నాయి. వాటిలో కొన్ని గ్రామాలు ఇప్పుడు లేవు.

**1. పెనుంబులువు** - పెనుమూలి, దుగ్గిరాల మండలం.

**2. ఉప్పలపాడు** - ఉప్పలపాడు గ్రామాలు గుంటూరుజిల్లాలో చాలా ఉన్నాయి. ఈ ఉప్పలపాడు గ్రామం పెదవడ్లపూడి (మంగళగిరి మండలం) గ్రామానికి, దగ్గర్లో అదృశ్యమైన ఉత్తర ఉప్పలపాడు గ్రామం కావచ్చు! అలాగే మల్కాపురం (తుళ్ళూరు మండలం) గ్రామ నైఋతిదిశలో ఉప్పలపాడు గ్రామం అదృశ్యమైంది. పెదకాకాని మండలంలో కూడా ఉప్పలపాడు గ్రామం ఉంది.

**3. మంచ్చెకలపూండి** - మంచికలపూడి, దుగ్గిరాల మండలం.

**4. జుపూండి** - దుగ్గిరాల మండలంలో ఉన్న ఈమని, చింతలపూడి (ఉత్తర చింతలపూడి) గ్రామాల పరిసరాలలో జూపూడి (జుపూండి/జువ్వెపూండి) గ్రామం ఉండేది.

**5....లపూండి** - దుగ్గిరాల మండలంలో ఉన్న చింతలపూడి, పేరుకలపూడి గ్రామాలలో ఒకటి కావచ్చు! లేదా తెనాలి మండలంలో ఎరుకలపూడి కావచ్చు.

**6. నందివెలువు** - నందివెలుగు, తెనాలి మండలం.

**7. కాట్యవరం** - కఠెవరం, తెనాలి మండలం.

**8. ప్రాంబఱ్ఱు** - ఎక్కడో తెలియదు.

**9. తెలప్రోలు** - తేలప్రోలు, తెనాలి మండలం.

**10. మల్లివెలంటూరు** - ఎక్కడో తెలియదు. సత్తెనపల్లి సమీపాన వెలంటూరు అదృశ్యగ్రామం ఉంది. భట్టిప్రోలు, బొల్లాపల్లి మండలాలలో వెల్లటూరు గ్రామాలున్నాయి. పొన్నూరు మండలంలో వెల్లలూరు గ్రామం ఉంది.

**11. పినపాడు** - తెనాలి మండలం, తెనాలి లో కలిసిపోయినది.

**12. పినరావూరు** – చినరావూరు, తెనాలి మండలం, తెనాలిలో కలిసిపోయినది.

**13. పులుకంత్తమూ (రు?)** – ఎక్కడో తెలియదు.

**14 ..... పూరు** – శాసనంలో అక్షరాలు జీర్ణమయ్యాయి.

**15. పోతుంబఱ్ఱు** – పోతుమఱ్ఱు, వేమూరు మండలం.

**16. పూండివాడ** – పూడివాడ, నగరం మండలం.

**17. కోదూరు** – ఉత్తర నారాకోదూరు కంతేరు (తాడికొండ మండలం) గ్రామ సమీపాన అదృశ్యమైంది. నారాకోదూరు (చేబ్రోలు మండలం), సంగుపాలెం కోదూరు (పిట్టలవానిపాలెం మండలం), బ్రాహ్మణకోదూరు (పొన్నూరు మండలం) గుంటూరుజిల్లాలో ఉన్నాయి.

**18. లాము** – తాడికొండ మండలం.

**19. క్రోలుకొండ** – క్రోలు అంటే త్రాగు, పీల్చు అని జల అర్థం ఉంది. కావున మంగళగిరి మండలంలో ఉన్న నీరుకొండ గ్రామం కావచ్చు! గుంటూరులో కోలుకొండ ఇంటిపేరుతో కొందరున్నారు.

**20. క్రొల్లికొండ** – కొలనుకొండ, తాడేపల్లి మండలం.

**21. గుండిమడ** – గుండిమెడ, తాడేపల్లి మండలం.

**22. సింగరము** – సింగవరం+సింగారము లేక శృంగారము అయినచో దుగ్గిరాల మండలంలో ఉన్న శృంగారపురం కావచ్చు!

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 509.

# వినుకొండ తాలూకా

1. వినుకొండ మండలం
2. నూజెండ్ల మండలం
3. ఈపూరు మండలం
4. బొల్లాపల్లి మండలం
5. శావల్యాపురం మండలం

## 1. తిమ్మారెడ్డిగూడెం

గండిగనుమల (బొల్లాపల్లి మండలం) గ్రామానికి చేరువలో తిమ్మారెడ్డిగూడెం ఉండేది.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 23.

## 2. బొక్కముంతలపాడు

రేమిడిచర్ల (బొల్లాపల్లి మండలం) గ్రామానికి చేరువలో బొక్కముంతలపాడు గ్రామం ఉండేది. క్రీ.శ. 1595 దోమలగుండం (బొల్లాపల్లి మండలం) శాసనంలో బొక్కముంతలపాడు ప్రస్తావన ఉంది.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూమ్: 31, సీరియల్ నెం. 213.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 65.

## 3. కల్లూరు, కల్లూరుపాలెం

వినుకొండ మండలం కండ్లయేరునది (గుండ్లకమ్మకు ఉపనది)కి తూర్పున కల్లూరు, కల్లూరుపాలెం ఉండేవి. కల్లూరు గ్రామం నుండి అందుగులపాడు (వినుకొండ మండలం) నీలగంగవరం? (వినుకొండ మండలం) గ్రామాలకు డొంకబాటలున్నాయి. కల్లూరు గ్రామకరణాలు అందుగులవారు.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 164
2. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 5, పుట: 16.

# 4. కనుమలచెరువు పరిసర అదృశ్యగ్రామాలు - 1

బొల్లాపల్లి మండలంలో ఉన్న కనుమలచెరువు గ్రామానికి చుట్టుప్రక్కల అనేక గ్రామాలు అదృశ్యమయ్యాయి. ఈ గ్రామాలు ఎప్పుడు అదృశ్యమయ్యాయో? కారణాలు తెలియకపోయినా వాటి హద్దులు మాత్రం తెలుస్తున్నాయి. ఈగ్రామాల పూర్వ కరణాలు నందవరీకులైన వశిష్టసగోత్రులు కుడుములవారు.

**1.గన్నవరం:** కనుమల చెరువు గ్రామానికి తూర్పున 3 కి.మీ. దూరంలో ఈ గ్రామం ఉండేది. ఇప్పటికి ఆ గ్రామ చెరువును గన్నవరం చెరువు అంటారు. పూర్వం ఈ గ్రామాన్ని పడమటి గన్నవరం అనేవారు. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో ఈ గ్రామశిస్తుగా 230 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియాకంపెనీకి చెల్లించారు.

**2.గంగవరం:** కనుమల చెరువు గ్రామానికి తూర్పున 3 కి.మీ. దూరంలో గన్నవరం (అదృశ్యగ్రామం) ప్రక్కనే ఈ గ్రామం ఉండేది.

**3.బరిజేపల్లి (బలిజేపల్లి?):** కనుమల చెరువు గ్రామానికి తూర్పుగా, మాలపాడు (బొల్లాపల్లి మండలం) గ్రామానికి పడమరగా ఉన్న బరిజేపల్లి గ్రామం నేడు కనుమల చెరువు గ్రామంలో కలిసిపోయింది. నేటికీ బరిజేపల్లి పొలాలు అనే వాడుక ఉంది. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో ఈ గ్రామశిస్తుగా 298 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియాకంపెనీకి చెల్లించారు.

**4.చింతలపాడు:** హనుమంతునిపాడు: కనుమల చెరువు గ్రామానికిపశ్చిమాన 2 కి.మీ. దూరంలో ఈ గ్రామాలు ఉండేవి.

**5.గంగమ్మగుట్ట:** కనుమల చెరువు గ్రామానికి దక్షణాన 2 కి.మీ. దూరంలో ఈ గ్రామం ఉండేది.

**6.పాపారాయునిపాలెం:** కనుమల చెరువు గ్రామానికి ఆగ్నేయంగా 1 మైలు (1.60 కి.మీ.) దూరంలో ఈ గ్రామం ఉండేది.

**ఆధారం:** 1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 15.

2. కనుమల చెరువు గ్రామస్థులు కంభంపాటి గురవయ్య ఇచ్చిన సమాచారం.

3. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 88.

## 5. కోమటికుంట, జిల్లెళ్ళకుంట

బొల్లాపల్లి మండలం మేళ్ళవాగు గ్రామానికి దక్షిణదిశ అడవిబాటకు 5 కి.మీ. దూరంలో కోమటికుంట, జిల్లెళ్ళకుంట అను గ్రామాలుండేవి. ఈ గ్రామాలు అదృశ్యమైనప్పటికీ అడవివద్ద కోమటికుంట చెరువు వాడుకలో ఉంది. కోమటికుంట గ్రామంలో ఉన్న ఆంజనేయస్వామిని సమీప జయంతీపురం (బొల్లాపల్లి మండలం) గ్రామానికి తీసుకొచ్చి పునఃప్రతిష్ఠ చేశారు. కోమటికుంట, జిల్లెళ్ళకుంట గ్రామాల కరణాలు నందవరీకులైన గౌతమసగోత్రులు చింతపల్లివారు. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో కోమటికుంట గ్రామశిస్తుగా 120 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించారు.

**ఆధారం:**


1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 12.
2. వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు అర్ధలపూడి కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.
3. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 88.


## 6. గుమ్మనంపాడు పరిసర అదృశ్యగ్రామాలు

బొల్లాపల్లి మండలం గుమ్మనంపాడుకి అవనిగుండ్లపాడు, అనంతునిపాడు, ఉదతలపాడు, ఉప్పలపాడు శివారుగ్రామాలుగా ఉండేవి. ఈ గ్రామాల హద్దులు తెలియవు. బొల్లాపల్లి ప్రాంతంలో చిలిపిగా ఉన్న పిల్లవాడిని వ్యంగ్యంగా 'వీడు ఉదతలపాడోడు' అనే జాతీయం వాడుకలో ఉంది. ఈ గ్రామాల కరణాలు దేచిరాజువారు, పొట్లపల్లి (వెలమ)వారు, చింతపల్లివారు.


**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 23, 24

## 7. అందుగులపాడు

క్రీ.శ.1122 త్రిపురాంతకదేవాలయ శాసనంలో త్రిభువనమల్ల బిరుదాంకితుడైన పశ్చిమ చాళుక్యరాజు ఆరవ విక్రమాదిత్యుడు (క్రీ.శ.1076-1126) అందుమలపాడు (అందుగులపాడు) గ్రామాన్ని త్రిపురాంతకదేవరకు దానంగా ఇచ్చినట్లు ఉంది. అందుగులపాడు కరణాలు శ్రీవత్సగోత్రులు అందుగులవారు. అందుగులపాడు సమీపాన నేడు అందుగులకొత్తపాలెం గ్రామం ఉంది.

**ఆధారం:**

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 5.
2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 9 భాగం 1, సీరియల్ నెం. 204.

## 8. గోపీనాథునిపాలెం

అందుగులపాడు (వినుకొండ మండలం) అదృశ్యగ్రామప్రాంతాన గోపీనాథునిపాలెం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. గోపినాథునిపాలెం కరణాలు శ్రీవత్సగోత్రులు అందుగులవారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 5.

## 9. భాస్కరయ్యపాలెం

వినుకొండ మండలం కొప్పుకొండ సమీపాన భాస్కరయ్యపాలెం ఉండేది. భాస్కరయ్యపాలెం కరణాలు నందవరీకులైన వశిష్ఠసగోత్రులు కుడుములవారు. పిదప అవులమందవారు. సామంతపూడివారు వచ్చి కుడుములవారిని తరిమేసినా చివరకు కుడుములవారే ఈ గ్రామకరణాలయ్యారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 15.

## 10. ఎడ్లూరు (యడ్లూరు)

వినుకొండ మండలంలో నాయనిపాలెం గ్రామం ఉంది. ఆ గ్రామానికి పశ్చిమాన చెరువుకట్టపై ఉన్న విగ్రహంపైన గల శాసనంలో క్రీ.శ. 1419 నాడు గాదెల ఎల్లప్ప ఎడ్లూరిలోని చెరువుకట్టపై పోతురాజు విగ్రహాన్ని ప్రతిష్ఠ చేయించిన వివరం ఉంది. ఇప్పుడు ఎడ్లూరు గ్రామం లేదు. నాయనిపాలెం ఉన్న ప్రాంతంలో ఎడ్లూరు గ్రామం ఉండేదని తెలుస్తున్నది.

**ఆధారం:** సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 31, సీరియల్ నెం. 187.

## 11. పులుకూటిపాడు

శావల్యాపురం (మండలకేంద్రం) ఏర్పడకముందు ఉత్తరదిశలో పులుకూటిపాడు ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. గోల్కొండ పాలకుడు ఇబ్రహీం కులీ కుతుబ్ షా (క్రీ.శ. 1550-1580) తన వేశ్య 'శహలీ'కి ఈ ప్రాంతాన్ని ఈనాంగా ఇచ్చాడు. పులుకూటిపాడుకు దక్షిణదిశలో శహలి తన పేరు మీద శహలీపురం గ్రామాన్ని నిర్మించింది. అది కాలక్రమేణా శావల్యాపురంగా మారింది.

**ఆధారం:** గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 197, 198.

## 12. పుచ్చనూతల

నూజెండ్ల మండలంలో పుచ్చనూతల ఉండేది. మేకపాడు, బుగ్రిపాలెం, రెడ్డిపాలెం, బొట్లగుట్ట, రాముడుపాలెం, రవ్వవరం, ముప్పరాజువారిపాలెం మొదలగు గ్రామాలకు పుచ్చనూతల కేంద్రంగా ఉండేది. గ్రామకరణాలు ఉల్లగంటివారు, తరువాత పచ్చవవారు. రవ్వవరం (నూజెండ్ల మండలం) గ్రామానికి వాయవ్యంగా పుచ్చనూతల గ్రామం ఉండేది. గూగుల్ మ్యాపులో ఈ గ్రామాన్ని చూడవచ్చు.

**ఆధారం:** నూజెండ్ల గ్రామస్థులు రామినేని హనుమంతరావు
ఇచ్చిన సమాచారం.

## 13. మైలవరం

నూజెండ్ల (మండలకేంద్రం) నుండి వేంట్రాయుని అప్పాపురం (నూజెండ్ల మండలం) రహదారిలో నూజెండ్లకు అరమైలు దూరంలో మైలవరం ఉండేది. సాక్షిగా చెన్నకేశవస్వామి ఆలయం ఉంది. ఆ గ్రామం నూజెండ్లలో కలిసిందని స్థానికులు చెబుతున్నారు. వినుకొండ పాలకుడు నాదెండ్ల అప్పయ్య (సాళువ తిమ్మరసు మేనల్లుడు, పెద్దల్లుడు) క్రీ.శ. 1516లో తన మామయ్య తిమ్మరసు, లక్ష్మమ్మ దంపతులకు పుణ్యంగా మైలవరం గ్రామాన్ని మైలవరం చెన్నకేశవునికి దానంగా ఇచ్చారు. నూజెండ్ల గ్రామానికి దక్షిణదిశలో "బత్తులవారిపాలెం" గ్రామం ఉండేది. ఇప్పుడు లేదు. వినుకొండసీమ పద్యమాలిక (207 గ్రామాలు?)లో మైలవరం గ్రామ ప్రస్తావన ఉంది.

**ఆధారం:**

1. నూజెండ్ల గ్రామస్థులు ఇచ్చిన సమాచారం.
2. మాచర్ల వాస్తవ్యులు పావులూరి సతీష్‌బాబు ఇచ్చిన సమాచారం.

## 14. దాసుళ్ళపల్లి

వినుకొండ–కారంపూడి రహదారిలో కొండముట్ల (ఈపూరు మండలం) నుండి బొల్లాపల్లి (మండలకేంద్రం) వెళ్లే మార్గంలో దాసుళ్ళపల్లి గ్రామం ఉండేది. ఈ దాసుళ్ళపల్లి గ్రామంలో కొంతభాగం సమీప దుష్మన్‌పేట (ఈపూరు మండలం)లో కలిసిందంటారు. నేటికీ దాసుళ్ళపల్లి అను వాడుక ఉంది. గుంటూరుజిల్లా పాతమ్యాపులో దాసుళ్ళపల్లి గ్రామాన్ని చూడవచ్చు. బ్రిటిష్ దొర దూస్‌మన్ పేరున దూస్‌మన్‌పేట (దుమ్మన్‌పేట) ఏర్పడింది.

**ఆధారం:** వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు
అర్ధలపూడి కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 15. జర్వలకుంట్ల

గుట్లపల్లి (బొల్లాపల్లి మండలం) గ్రామ సమీపాన జర్వలకుంట్ల గ్రామం ఉండేది. కంగ్రిక (బొల్లాపల్లి మండలం) వద్ద గల చెరువును జర్వలకుంట చెరువు అంటారు. ఈ ప్రాంత కరణాలు దమ్మవళం, దేచిరాజు, పెమలూరు మొదలగు ఇంటిపేర్లు కలిగినవారు.

**ఆధారం:** వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు
అర్ధలపూడి కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 16. ఆవులయపాలెం, చప్పిడిపాలెం

కనుమల చెరువు (బొల్లాపల్లి మండలం) గ్రామానికి నైఋతిదిశలో ఆవులయపాలెం ఉండేది. కాలక్రమేణా కనమలచెరువు గ్రామంలో ఆవులయపాలెం కలిసిపోయిందంటారు. యాదవుల కులదైవం ఆవులయ్య ఆలయం నేటికీ ఉంది. కనుమలచెరువు గ్రామ సమీపాన ఉన్న చప్పిడివాగు వద్ద చప్పిడిపాలెం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు
అర్ధలపూడి కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.

## 17. అరుణగుండ్ల

పల్నాటి వీరచరిత్రలో ఊరకోట రాజధానిగా పాలించిన పేరమరాజు రాజ్యంలోనిది ఈ అరుణగుండ్ల. అనుగురాజు భటులు పశువుల మేత కొరకు అరుణగుండ్ల కోరు బయళ్ళకు రాగా ఆ పేరమరాజుసైన్యం ఎదుర్కొని యుద్ధం చేసారు. అదే అరుణగుండ్ల యుద్ధం. పలనాటి యుద్ధానికి ఇదే తొలి బీజం. బొల్లాపల్లి మండలంలో ఉన్న రావులాపురం, గండిగనుముల మధ్య రాచకొండ దగ్గర అరుణగుండ్ల గ్రామం ఉండేది. ఆనవాళ్లుగా పాటిదిబ్బలు కనిపిస్తుంటాయి.

**ఆధారం:** పలనాటి వీరచరిత్ర వచనము, యార్లగడ్డ బాల గంగాధరరావు,
విజయవాడ, 2010. పుట: 275

## 18. గుండాలపాడు

బొల్లాపల్లి మండలంలో గరికపాడు, హనుమాపురం (తండ) మధ్య గుండాలపాడు ఉండేది. మాచర్ల మలిదేవాదుల పక్షం ఉన్న అలరాజు తన మామ గురజాల పాలకుడైన నలగామరాజు వద్దకు రాయబారిగా వెళ్ళగా నాగమ్మ (నలగామరాజు మంత్రి) ఆయనకు విషం పెడుతుంది. అలరాజు చర్లగుడిపాడు (గురజాల మండలం) వద్ద మరణిస్తాడు. అలరాజు సహచరులు ఆయన భౌతికకాయాన్ని మేడపి తీసుకువెళ్తూ గుండాలపాడు గ్రామం చేరుకుంటారు. పేరిందేవి (నలగామరాజు కుమార్తె) తన భర్త మరణవార్త విని రోదిస్తూ గుండాలపాడు గ్రామానికి చేరుకొని భర్తతోపాటు అగ్నిగుండంలో దూకి ఆహుతి అవుతుంది. కావున ఈ గ్రామానికి గుండాలపాడు అని పేరు వచ్చిందంటారు.

ఫిరంగిపురం మండలంలో గుండాలపాడు పేరుతో ఒక గ్రామం ఉంది.

**ఆధారం:** మేళ్ళవాగు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు సోము శ్రీను ఇచ్చిన సమాచారం.

## 19. లింగన్నపాలెం

వినుకొండ పట్టణానికి తూర్పున 3 కి.మీ. దూరంలో లింగన్నపాలెం (కుంట) గ్రామం ఉండేది. దేవాదాయశాఖ ఆలయ పట్టికలో ఈ గ్రామానికి చెందిన శ్రీ వీరాంజనేయస్వామి ఆలయ ప్రసక్తి ఉంది. జంగాలపల్లి (నూజెండ్ల మండలం) గ్రామానికి పడమర లింగన్నపాలెం తూర్పు పొలిమేర హద్దు ఉంది.

**ఆధారం:**

1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 185.
2. వినుకొండసీమ, కంచర్ల పాండురంగశర్మ, విఠంరాజుపల్లె , వినుకొండ మండలం, 1984, పుట: 31

## 20. కంకణాలపల్లి

బొల్లాపల్లి మండలం గరికపాడు గ్రామానికి పశ్చిమాన 2 కి.మీ. దూరంలో కంకణాలపల్లి ఉండేది. ఇప్పుడు లేదు. నాగులేరు నది తీరాన ఈ కంకణాలపల్లి ఉండేదని అంటారు. నాటి పలనాటి వీరులు మేడపి (ప్రకాశంజిల్లా) నుండి కారంపూడి యుద్ధభూమికి వెళ్తూ కంకణాలు ధరించుట వలన ఈ గ్రామానికి కంకణాలపల్లి అని పేరు వచ్చింది. కంకణాలపల్లి కరణాలు నందవరీకులైన గౌతమసగోత్రులు చింతపల్లివారు.

పల్నాటి వీరచరిత్ర: మట్టివేముల దాటి మండలేశ్వరుడు ఘూర్ణిల్లు రవముతో గుమ్మడంపాడు చేరి యచ్చట నిల్వ చిత్తంబుగొనక గరికెపాటికి వచ్చి కాలూన కచట కంకణంబులపల్లె కడను నా ఘనులు కంకణమ్ములు కట్టి కదిలిరావేళ పట్టభద్రులు పైడిపాటికి వచ్చి మేళ్ళ వాగుననిల్చె మించిన దండు.

పైన తెలిపిన పద్యంలో మఱ్ఱివేముల ప్రకాశంజిల్లాలోని పుల్లలచెరువు మండలం లో ఉంది. ఇతర గ్రామాలు బొల్లాపల్లి మండలంలోనివి. సత్తెనపల్లి మండలంలో కూడా కంకణాలపల్లి గ్రామం ఉంది.

**ఆధారం:**

1. ప్రాచీన కావ్యాలలో తెలుగునాడు, పాపిరెడ్డి నరసింహారెడ్డి,
   తిరుపతి, 1991. పుట: 134.
2. మేళ్ళవాగు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు సోము శ్రీను ఇచ్చిన సమాచారం

## 21. జిల్లెళ్ళమూడి

కొత్తలూరు (శావల్యాపురం మండలం) సమీపాన జిల్లెళ్ళమూడి గ్రామం ఉండేది. కొత్తలూరు కరణాలు ఆరువేలనియోగులైన భారద్వాజసగోత్రులు కారుమంచివారు. జిల్లెళ్ళమూడి గ్రామం బాపట్ల మండలంలో కూడా ఉంది.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ,
నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 15.

## 22. ముక్కెళ్ళపాడు పరిసర అదృశ్యగ్రామాలు

నూజెండ్ల మండలం ముక్కెళ్ళపాడు గ్రామ సమీపాన నరసయ్యపాలెం, అత్తలూరు, ముక్కువారిపాలెం, గార్లదిన్నె, గంగయ్యపాలెం మొదలైన గ్రామాలుండేవి. ఆ గ్రామాలు అదృశ్యమైనప్పటికి సమీప గ్రామమైన మూర్తిజాపురం (నూజెండ్ల మండలం) గ్రామస్థులు నరసాయపాలెం (నర్సయ్యపాలెం) గంగమ్మ తిరునాళ్లు చేసుకుంటారు. నరసయ్యపాలెం మూర్తిజాపురం (మృత్యుంజయపురం) గ్రామ సమీపాన ఉన్నట్లు తెలుస్తున్నది. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో నరసయ్యపాలెం గ్రామశిస్తుగా 714 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించారు.

ఆధారం:

1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 56.
2. ముక్కెళ్ళపాడు గ్రామస్థులు చింతలచెరువు వెంకటసత్యనారాయణ ఇచ్చిన సమాచారం.
3. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997, పుట: 87.

## 23. వినుకొండ పరిసర అదృశ్యగ్రామాలు - 1

వినుకొండ పట్టణం చుట్టుప్రక్కల మాచపల్లి, తక్కెళ్ళపాడు, వీర్రాజుపాలెం, అప్పాపురం ఉండేవి. ఈ నాలుగుగ్రామాల కరణాలు ఆరువేలనియోగులైన శాండిల్యసగోత్రులు సువర్ణాదాయంవారు. తర్వాత చీమకుర్తివారు. వినుకొండ పాలకుడు నాదెండ్ల అప్పయ్య (సాళువ తిమ్మరసు మేనల్లుడు, పెద్దల్లుడు) క్రీ.శ. 1517లో వినుకొండలోని అనంతగోపీనాథునికి మండపము కట్టించి అప్పాపురం గ్రామాన్ని దానమిచ్చాడు.

ఆధారం: శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 72.

## 24. కంచరపేట (కంచరగుంట)

ఈపూరు (మండలకేంద్రం) గ్రామ సమీపాన కంచరపేట ఉండేది. ఆ గ్రామంలో ఉండే కంచర్లు సమీప అగ్నిగుండాల (ఈపూరు మండలం) కొండల్లో ముడిఖనిజాన్ని సేకరించి, రాగి, కంచు, ఇనుము లోహాలతో వస్తువులు తయారుచేసేవారు. ఒకనాడు తిరుమల, కంచి మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించిన ఆ గ్రామస్థులు తమ ఊరిలో ఇటువంటి ఆలయాలు లేనందుకు బాధపడ్డారు. వారి ఆవేదనను ఆలకించిన కంచి వీరభద్రుడు, తిరుమల వేంకటేశ్వరుడు, గురప్పస్వామి, వల్లభస్వామి ఆ గ్రామస్థుల తిరుగుప్రయాణంలో వారివెంట మానవరూపాలతో ప్రయాణించి వినుకొండ ప్రాంతానికి చేరుకున్నారు. ఈపూరు మండలంలో ఉన్న అగ్నిగుండాలకొండపై తిరుమల వేంకటేశ్వరస్వామి, ఊదుజర్ల గ్రామం (ఈపూరు మండలం) వద్ద గురప్పస్వామి, వనికుంట (ఈపూరు మండలం) గ్రామంవద్ద వల్లభస్వామి, కంచరపేటలో కంచి వీరభద్రస్వామి వెలసి తమ ఉనికిని చాటారు. అగ్నిగుండాల కొండల్లో కంచరపేట గ్రామస్థులు గని త్రవ్వుతుండగా ప్రమాదవశాత్తు గట్లు విరిగి భూస్థాపితమయ్యారు. ఈ విషయం తెలిసిన కంచరపేట స్త్రీలు అగ్నిగుండాల చేరుకొని తమ భర్తల కోసం రోదిస్తూ అగ్నికి ఆహుతి అయ్యారు. దాంతో ఒక్కసారిగా గ్రామం వలసపోయింది. ప్రతి రోజూ కంచరపేట పిల్లలతో ఓ బాలుని రూపంలో ఆడుకునే కంచి వీరభద్రస్వామి అలసి నిద్రపోయి లేచేసరికి ఆ గ్రామంలో ఎవరూ లేకపోవడంతో ఆయన అక్కడే నిలిచిపోయారట. ఆవిధంగా కంచరపేట గ్రామంలో వీరభద్రస్వామి ఒక్కరే ఉండిపోయారు. కంచరపేట పొలాలు వాడుక మాత్రం ఉంది. ఈపూరు వద్ద 'రాజుపాలెం' గ్రామం ఉండేదట. ఇప్పుడు లేదు.

**ఆధారం:**


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 187, 188.
2. వినుకొండ వాస్తవ్యులు నా చెల్లి, బావ ఒగ్గు శివపార్వతి, రాజేశ్వరరావు దంపతులు ఇచ్చిన సమాచారం.

# 25. వినుకొండ పరిసర అదృశ్యగ్రామాలు - 2

క్రీ.శ.1122 త్రిపురాంతకదేవాలయ శాసనంలో త్రిభువనమల్ల బిరుదాంకితుడైన పశ్చిమచాళుక్యప్రభువు ఆరవ విక్రమాదిత్యుడు (క్రీ.శ.1076-1126) మెట్టు(ట్ట)వాడిలోని 18 గ్రామాలను, ఏరువనాడులోని 13 గ్రామాలను, చిరునాడులోని 13 గ్రామాలను త్రిపురాంతకదేవరకు దానంగా ఇచ్చినట్లు ఉంది. వీటిలో కొన్ని గ్రామాలు అదృశ్యమయ్యాయి. చిరునాడు ప్రాంతం గుంటూరు జిల్లాలో వినుకొండ, గుండ్లకమ్మ, పసుపులేరు పరిసర ప్రాంతమని నా అభిప్రాయం.

**చిరునాడు గ్రామాలు**

| | |
|---|---|
| 01. కూ...మూనూర | - ఎక్కడో తెలియదు |
| 02. వొళగణగండి | - ఎక్కడో తెలియదు |
| 03. తో... ఉబయం | - ఎక్కడో తెలియదు |
| 04. తడపలి | - ఎక్కడో తెలియదు |
| 05. అందుమలపాడు | - అందుగులపాడు (ప్రత్యేకవ్యాసం ఉంది) |
| 06. ప... పసపులేరు | - పెద పసుపులేరు |
| 07. పిన పసపులేరు | - చిన పసుపులేరు |
| 08. బె(బి)ట్టలపాడు | - ఎక్కడో తెలియదు |
| 09. అ...న గుండాము | - అరుణగుండం? |
| 10. విలిగడు | - ఎక్కడో తెలియదు |
| 11. ఉప్పలపాడు | - ఉప్పలపాడు (నూజెండ్ల మండలం) |
| 12. ....రపలి | - ఎక్కడో తెలియదు |
| 13. మధుమంచ్చి | - మధమంచి (ప్రత్యేకవ్యాసం ఉంది) |

పసుపులేటి ఇంటిపేరుతో కాపు, రెడ్డి కులస్థులు గుంటూరు జిల్లాలో ఉన్నారు.

క్రీ.శ.1106 త్రిపురాంతకదేవాలయ శాసనంలో చందోలు రాజధానిగా పాలించిన వెలనాటి మొదటి గొంకరాజు (క్రీ.శ.1076-1106) త్రిపురాంతకదేవరకు కమ్మనాడులోని గండేటి (గుండ్లకమ్మ) దరి ...లపాడు దానంగా ఇచ్చినట్లు ఉంది. శాసనంలో అక్షరాలు నశించాయి కనుక ..లపాడు బె(బి)ట్టలపాడు కావచ్చు.

**ఆధారం:**

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 9 భాగం 1, సీరియల్ నెం. 204.

2. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 10, సీరియల్ నెం. 63.

## 26. మధుమంచి, మదమంచిపాడు

క్రీ.శ.1122 త్రిపురాంతకదేవాలయ శాసనంలో త్రిభువనమల్ల బిరుదాంకితుడైన పశ్చిమచాళుక్యప్రభువు ఆరవ విక్రమాదిత్యుడు (క్రీ.శ.1076–1126) మధుమంచి గ్రామాన్ని త్రిపురాంతకదేవరకు దానంగా ఇచ్చినట్లు ఉంది.

పురుషోత్తమగజపతి (క్రీ.శ. 1466–1497) రాయనిభాస్కరునికి క్రీ.శ. 1492లో మధుమంచ్చి గ్రామాన్ని అగ్రహారంగా దానం ఇచ్చాడు. వినుకొండ వద్ద గుండకినది (గుండ్లకమ్మ)కి ఉత్తరంగా ఈ గ్రామం ఉండేది.

విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509–1529) క్రీ.శ. 1519 ఫిబ్రవరి 26 శుక్రవారంనాడు వినుకొండసీమలోని మధుమంచ్చి గ్రామాన్ని కృష్ణాజిల్లా ఘంటసాల మండలం శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువుకు దానంగా ఇచ్చినట్లు శాసనాధారముంది. ఈ శాసనంలోనే ఆంధ్రమహావిష్ణువుకు ఇడ్డెనలు (ఇడ్లీలు) నైవేద్యంగా సమర్పించే విషయం ఉంది.

గుండ్లకమ్మ వరద ఉధృతికి మధుమంచ్చి గ్రామం కొట్టుకుపోయింది. ఆ గ్రామస్థులు గుండ్లకమ్మనదికి ఎగువ ఓ పాటిదిబ్బపై మధుమంచ్చిపాటి(పాడు) పేరుతో కొత్తగా మరో గ్రామాన్ని నిర్మించుకున్నారు. ఈ క్రొత్త గ్రామానికే కాలక్రమేణా మదమంచిపాడుగా మారింది. మదమంచిపాడు కరణాలు రావులపాటివారు.

మదమంచిపాడు వీరాంజనేయస్వామిచరిత్ర: నరసరావుపేట జమీందారు మల్రాజు గుండారాయనింగారు (క్రీ.శ. 1769–1819) ఏనుగుపాలెం (వినుకొండమండలం) గ్రామంలో ఉన్న పేద మధ్వ బ్రాహ్మణుడైన మోర్సుపల్లి వెంకటగిరి నరసదాసు గురించి విని ఓ రోజు ఆ బ్రాహ్మణుడి ఆతిథ్యాన్ని స్వీకరించారు. జమీందారు అతని స్థితిని గమనించి, మదమంచిపాడు గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. మోర్సుపల్లి వెంకటగిరి నరసదాసు తన పొలంలో సేద్యం చేస్తుండగా నాగలికర్రుకు ఏదో వస్తువు తగిలి పెద్దశబ్దం రావడం,ఆ ప్రదేశం రక్తంతో నిండి, ఎద్దులు, సేద్యగాళ్లు ఆ రక్తాన్ని చూసి మూర్ఛపోవడం జరిగింది. అప్పుడు వీరాంజనేయస్వామి తన ఉనికిని తెలుపగా వారు వెంటనే స్వస్థులయ్యారు. ఆ గ్రామస్థులు మోర్సుపల్లి వెంకటగిరి నరసదాసుచే వీరాంజనేయస్వామిని అచ్చటే ప్రతిష్ఠ చేయించారు.

క్రీ.శ. 1791-1788 మధ్య కాలంలో మదమంచిపాడు గ్రామశిస్తుగా 147 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించారు. మదమంచిపాడు గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. నేడు వీరాంజనేయస్వామి ఆలయం మాత్రమే అక్కడ ఉంది. ఆలయంలో పూజాదికాలు జరుగుతున్నాయి. 1985లో మైనేని ఇంటిపేరు గల ఒకే కుటుంబం అక్కడ ఉండేది. ఆ తర్వాత వారు కూడా సమీప గ్రామానికి వలసవెళ్ళడం జరిగింది. ఈ ప్రాంత పొలాలు నేటికీ మదమంచిపాడు రెవిన్యూ రికార్డులలోనే ఉన్నాయి. గుంటూరుజిల్లా పాతమ్యాపులో మదమంచిపాడు గ్రామాన్ని చూడవచ్చు. మదమంచి, మదమంచిపాటి ఇంటిపేరుతో కమ్మ మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**


1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 4, సీరియల్ నెం. 981.
2. ఆంధ్రప్రభ ప్రత్యేక సంచిక-గుంటూరుజిల్లా-2010. పుట: 34, 35.
3. జంగాలపల్లి (నూజెండ్ల మండలం) గ్రామస్థులు మోర్సుపల్లి సుదర్శనాచార్యులు ఇచ్చిన సమాచారం
4. వినుకొండ వాస్తవ్యులు గాలి సుబ్బారావు ఇచ్చిన సమాచారం.
5. రాయనమంత్రి భాస్కరచరిత్ర, గుంటుపల్లి సోమయ్య, చెన్నుపల్లి అగ్రహారం, బల్లికురవ మండలం, ప్రకాశంజిల్లా, 1910, పుట: 20.
6. మిత్రులు హైదరాబాద్ వాస్తవ్యులు భాస్కరుని గిరీష్ ఇచ్చిన సమాచారం.
7. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 87.
8. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్, వాల్యూమ్: 9 భాగం 1, సీరియల్ నెం. 204.

## 27. కనుమలచెరువు పరిసర అదృశ్యగ్రామాలు - 2

కనుమలచెరువు (బొల్లాపల్లి మండలం) గ్రామానికి ఆగ్నేయంగా 3 కి.మీ. దూరంలో మోర్కపాలెం గ్రామం ఉండేది. బ్రిటిష్ పాలనలో మోర్కపాలెం గ్రామస్థులు నీలిమందు తయారుచేసేవారు. 1823 డొక్కలకరవువల్ల ఈ గ్రామం అదృశ్యమయింది. కనుమలచెరువు గ్రామానికి పడమర 2 కి.మీ. దూరంలో హనుమంతునిపాడు (అదృశ్యగ్రామం) దగ్గర జూలకంటిపాడు గ్రామం ఉండేది. ఈ గ్రామం కూడా అదృశ్యమయింది. కనుమలచెరువు గ్రామానికి ఆగ్నేయంగా పాపరాయునిపాలెం (అదృశ్యగ్రామం)కి అర కి.మీ. దూరంలో పెద్దమ్మగుట్ట గ్రామం ఉండేది. అది కూడా అదృశ్యమయింది.

**ఆధారం:** కనుమలచెరువు గ్రామస్థులు కంభంపాటి గురవయ్య ఇచ్చిన సమాచారం.

## 28. సరికొండ

వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామానికి తూర్పున (?) సరికొండ అను పర్వతం ఉంది. దక్షయాగవిధ్వంసం తర్వాత పరమేశ్వరుడు తన నివాసం కొరకు సంజీవనికొండ (ఈపూరు మండలం) పై తన పాదం మోపగా ఆ పర్వతం తాను మోయలేనని ప్రార్థించింది. అప్పుడు పరమేశ్వరుడు సరియైనకొండ (సరికొండ) ఇదే అనుకొని శిఖరంపై తన కాలిగోటితో గీయగా సరికొండ తాను మోయలేనని వేడుకొన్నది. అప్పుడు పరమేశ్వరుడు త్రికూటాచలం (కోటప్పకొండ) పైకి చేరుకొన్నాడని జనశృతి. నేడు సరికొండ అదృశ్యగ్రామం ఉన్న ప్రాంతానికి ఉత్తర ఈశాన్యదిశలో సరికొండపాలెం ఉంది. సరికొండ ఇంటిపేరుతో భట్రాజు కులస్థులు గుంటూరుజిల్లాలో ఉన్నారు.

**ఆధారం:**

1. పాతగుంటూరు వాస్తవ్యులు చిరతనగండ్ల సోమేశ్వరరావు ఇచ్చిన సమాచారం.
2. సరికొండపాలెం (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు శాసనాల గోపి ఇచ్చిన సమాచారం.

## 29. గోపవరం

విజయనగరచక్రవర్తి కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509–1529) కాలంలో వినుకొండ పాలకుడైన నాదెండ్ల అప్పయ్య (సాళువ తిమ్మరసు పెద్ద మేనల్లుడు, పెద్దల్లుడు) రొంపిచర్ల (మండలకేంద్రం) అనంతగోపీనాథునికి 1516లో గోపవరం అను గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. ఈ గ్రామహద్దులు తెలియవు.

**ఆధారం:** గుంటూరుజిల్లా శాసనాలు, సంపాదకుడు: లంకా సీతారామశాస్త్రి, హైదరాబాద్, 1993, పుట: 120.

## 30. విభురాంపురం, కుంచాలపురం

కనుమర్లపూడి (శావల్యాపురం మండలం) గ్రామ సమీపాన విభురాపురం, కుంచాలపురం ఉండేవి. గోల్కొండ నవాబు ఇబ్రహీం కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1550–1580) కొండవీడును జయించి తన వేశ్య శాహాళీకి పురం కట్టించాడు. అదియే కాలక్రమేణా శావల్యాపురం అయింది. విభురాంపురం శావల్యాపురం దగ్గర కావచ్చు. కనుమర్లపూడి, విభురాంపురం, కుంచాలపురం గ్రామాలకు కరణాలు నందవరీకులైన గౌతమసగోత్రులు చింతగుంటవారు.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 16.

## 31. బొట్లగుట్ట

రవ్వవరం (నూజెండ్ల మండలం) సమీపాన పుచ్చనూతల (అదృశ్యగ్రామం) రెవిన్యూ గ్రామపరిధిలో బొట్లగుట్ట ఉండేది. తర్వాత సమీప లక్ష్మీపురం (నూజెండ్ల మండలం) గ్రామానికి బొట్లగుట్ట గ్రామస్థులు తరలి వెళ్ళారు.

**ఆధారం:** నూజెండ్ల గ్రామస్థులు రామినేని హనుమంతరావు ఇచ్చిన సమాచారం.

## 32. బొక్కముంతలపాడు, గార్లపాడు

రవ్వవరం (నూజెండ్ల మండలం) గ్రామం వద్ద బొక్కముంతలపాడు, గార్లపాడు ఉండేవి. ఈ రెండు గ్రామాల కరణాలు ఉల్లగంటివారు, జైనులు ప్రగడరాజువారు. గార్లపాడు గ్రామాలు గుంటూరుజిల్లాలో చాలా ఉన్నాయి. బొల్లాపల్లి మండలంలో రేమిడిచర్ల వద్ద కూడా బొక్కముంతలపాడు కూడా ఒక అదృశ్యగ్రామం.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 66.

## 33. రామచంద్రపురం

పువ్వాడ (నూజెండ్ల మండలం) గ్రామానికి సమీపాన రామచంద్రపురం ఉండేది. ఈ గ్రామహద్దులు తెలియవు. రామచంద్రపురం కరణాలు ఆరువేలనియోగులైన కాశ్యపసగోత్రులు తురగా అప్పరాజువారు. మంగళగిరి, చిలకలూరిపేట మండలాల్లో కూడా రామచంద్రపురం గ్రామాలు ఉన్నాయి.

**ఆధారం:** శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 48.

## 34. హసన్నాయునిపాలెం

వినుకొండ, అద్దంకి (వయా నాగులవరం) రహదారిలో వినుకొండకు 6 కి.మీ. దూరంలో హసన్నాయునిపాలెం 2010 వరకు ఉంది. ప్రధానరహదారికి బాగా దూరంగా ఉండటం వలన ఆ గ్రామస్థులు తమ గ్రామాన్ని వీడి కోటప్పనగరు, గాంధీనగరు అను గ్రామాలను నిర్మించుకున్నారు.

**ఆధారం:** పెదకంచర్ల (వినుకొండ మండలం) గ్రామస్థులు సోమేపల్లి దశరథరామయ్య ఇచ్చిన సమాచారం.

# 35. మన్నేపల్లి, మన్నేపల్లిపాడు

ప్రకాశంజిల్లా సరిహద్దులో రావులాపురం (బొల్లాపల్లి మండలం) ఉంది. ఈ గ్రామానికి దక్షిణదిశలో మన్నేపల్లి, మన్నేపల్లిపాడు ఉండేవి. మన్నేపల్లి ఎప్పుడో అదృశ్యమైంది. తర్వాత మన్నేపల్లిపాడు ఏర్పడింది. అదికూడా అదృశ్యమైంది. మన్నేపల్లిపాడు గ్రామ సరిహద్దులను రావులాపురం గ్రామస్థులు చెబుతారు. మన్నేపల్లి కొండ వద్ద స్వయంభూః నరసింహస్వామి, వేంకటేశ్వరస్వామి ఉన్నారు. శివరాత్రికి అక్కడ గొప్ప జాతర జరుగుతుంది. సమీపప్రాంతప్రజలు మన్నేపల్లిస్వామి (వేంకటేశ్వరస్వామి)కి మొక్కులు చెల్లించుకుంటారు. తమ సంతానానికి మన్నేపల్లి, మన్నేపల్లయ్య, మన్నేపల్లమ్మ అని పేర్లు పెట్టుకుంటారు. మన్నేపల్లిపాడు కరణాలు ఆరువేలనియోగులైన కౌండిన్యసగోత్రులు దేచిరాజువారు. వారి కరణీకరాన్ని పెసరవాయిలు గుండంరాజుకు విక్రయించారు. క్రీ.శ. 1781-1788 మధ్య కాలంలో ఈ గ్రామశిస్తుగా 843 పగోడాలు జమీందారు మల్రాజువారు ఈస్టిండియా కంపెనీకి చెల్లించారు. మన్నేపల్లి ఇంటిపేరుకల బ్రాహ్మణులు మొదలగు కులాలవారు గుంటూరుజిల్లాలో ఉన్నారు. మన్నేపల్లిపాడు సమీపానే గోపనపాలెం గ్రామం ఉండేది. ఇప్పుడు లేదు.

ఆధారం:


1. గుంటూరుజిల్లా గ్రామకైఫియత్తులు, వాల్యూమ్: 3, పుట: 190.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 56.
3. వెల్లటూరు (బొల్లాపల్లి మండలం) గ్రామస్థులు అర్థలపూడి కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం.
4. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 82.

# 36. పెదకంచర్ల పరిసర అదృశ్యగ్రామాలు

పురుషోత్తమగజపతి (క్రీ.శ. 1466-1497) క్రీ.శ. 1492లో రాయనభాస్కరునికి వినుకొండసీమలోని పెదకంచర్ల(కవులచర్ల?), పెరుమాళ్ళపల్లె, మధుమంచి, రఘునాథరాజుపాలెం, వెంకటేశునిపాలెం, మాధవరం, తిరుమలరాజుపాలెం గ్రామాలను దానంగా ఇచ్చారు. పెదకంచర్ల, పెరుమాళ్ళపల్లె మినహా మిగతా గ్రామాలు కాలక్రమేణా అదృశ్యమయ్యాయి. రఘునాథరాజుపాలెం, వెంకటేశు నిపాలెం, మాధవరం, తిరుమలరాజుపాలెం గ్రామాల కరణాలు బడుగులనాటి కన్నడిగులు కణ్వసగోత్రులు కవులచర్లవారు, ఆరువేలనియోగులైన కాశ్యపసగోత్రులు కసుపరాజు (కసువరాజు)వారు, రేనాటి కౌశికసగోత్రులు కండ్లగుంటవారు. వినుకొండ మండలంలో ఉన్న ఏనుగుపాలెం గ్రామానికి తిరుమలరాజపురం అని స్థానిక వాడుక. కావున తిరుమలరాజుపాలెం, ఏనుగుపాలెం (తిరుమలరాజపురం) ఒక్కటేనా? పరిశోధన చేయవలసివుంది.

**ఆధారం:**


1. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 16.
2. రాయనమంత్రి భాస్కరచరిత్ర, గుంటుపల్లి సోమయ్య, చెన్నుపల్లి అగ్రహారం, బల్లికురవ మండలం, ప్రకాశంజిల్లా. 1910. పుట: 20.

## 37. మైదవోలు, నారాయణపురం, మాధవపురంకండ్రిక

సంతరావూరు (చినగంజాం మండలం, ప్రకాశంజిల్లా) కరణం గాలి నరసింహయ్య, లక్ష్మీదేవమ్మల కుమారుడైన అహోబిల పండితుడు సంస్కృత, ప్రాకృత, ఛందోజ్యోతిష్య, అలంకారాది బహుశాస్త్ర పండితకోవిదుడు, నారసింహ ఉపాసకుడు. ఆయన తన చిన్ననాడే తల్లిదండ్రులను కోల్పోవుట వలన మేనమామ పోలూరి మాధవసోమయాజి వద్ద పెరిగాడు. వినుకొండ ప్రభువులు మల్రాజు వేంకటనరసింహారాయనింగారు (క్రీ.శ. 1730-1768) అతనికి గుండ్లకమ్మనది తీరాన గోకనకొండ (వినుకొండ మండలం) వద్ద మైదవోలు, నారాయణపురం గ్రామాలను దానంగా ఇచ్చాడు. ఆ రెండు గ్రామాలు గుండ్లకమ్మ వరదలకు కొట్టుకుపోయాయి. గోకనకొండ వద్ద మాధవపురంకండ్రిక గ్రామం ఉండేది. ఈ గ్రామ అదృశ్యకారణాలు తెలియవు. యద్లపాడు మండలంలో కూడా మైదవోలు పేరిట గ్రామం ఉంది.

తే. ఘనతర స్నేహమతి నీచజనము పాలు
చిత్తమే వేళ నతి దీర్ఘచింతపాలు
హరిహరీ! దేహ మంతయు నలతపాలు
మైదవోలున నుండుట మాకు చాలు.

తే. అష్టపురమందరస్థాయియై వెలింగి
శాశ్వతైశ్వర్యములకును సదన మైన
ప్రబల నారాయణపురంబు పాలకడలి
పట్టి మెడనున్న నవరత్నపతక మనగ

ఆధారం:

1. శ్రీరాజామల్రాజు వంశవైభవము, బి. యేలియ, కుంకలగుంట, నకరికల్లు మండలం, 1997. పుట: 47 - 51.
2. శ్రీకొండవీటి సామ్రాజ్యము, మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, నరసరావుపేట, 1920, పుట: అనుబంధం 22.

# జంటగ్రామాలు

| | | | |
|---|---|---|---|
| 1. | ధరణికోట | – | అమరావతి |
| 2. | పెదకాకాని | – | వెనిగండ్ల |
| 3. | ధర్మవరం | – | దరివేముల |
| 4. | పేట | – | సన్నిగండ్ల |
| 5. | మల్లవరం | – | తోకవారిపాలెం |
| 6. | గన్నవరం | – | మతుకుమల్లి |
| 7. | వరగాని | – | పెదనందిపాడు |
| 8. | భట్టిప్రోలు | – | అద్దేపల్లి |
| 9. | నల్లపాడు | – | చల్లావారిపాలెం |
| 10. | లేమల్లె | – | 14వ మైలు |
| 11. | పొన్నూరు | – | నిడుబ్రోలు |
| 12. | ఉండవల్లి | – | సీతానగరం |
| 13. | మంగళగిరి | – | తాడేపల్లి |
| 14. | అచ్చంపేట | – | చిగురుపాడు |
| 15. | దాచేపల్లి | – | నడికుడి |
| 16. | చెరుకుపల్లి | – | గుళ్ళపల్లి, ఆరంబాక |
| 17. | పొన్నపల్లి | – | నడింపల్లి |
| 18. | గూడవల్లి | – | నడింపల్లి |
| 19. | రేపల్లె | – | ఇసుకపల్లి |
| 20. | ఫిరంగిపురం | – | రేపూడి, గొల్లపాలెం |
| 21. | బెల్లంకొండ | – | నాగిరెడ్డిపాలెం |
| 22. | వేములూరిపాడు | – | అమీనాబాద్ |
| 23. | వేమవరంకండ్రిక | – | రేగులగడ్డ |
| 24. | కావూరు | – | లింగంగుంట్ల |

| | | |
|---|---|---|
| 25. సాతులూరు | - | బండారుపల్లివారిపాలెం, గొట్టిపాటివారిపాలెం |
| 26. సిరిగిరిపాడు | - | మిట్టమీదిపల్లి |
| 27. నాదెండ్ల | - | శంభునిపాలెం (భాగ్యనగరం) |
| 28. వేమూరు | - | ధర్మపురం |
| 29. చినరావూరు | - | పెదరావూరు |
| 30. కాజ | - | వెంకటరెడ్డిపాలెం |
| 31. తాడేపల్లి | - | ప్రాతూరు |
| 32. తూర్పుపాలెం | - | రావిఅనంతవరం |
| 33. గుత్తావారిపాలెం | - | పెదపులివర్రు |
| 34. ముత్తివారిపాలెం | - | పూషాడపువారిపాలెం |
| 35. కమ్మవారిపాలెం | - | నందూరివారిపాలెం |
| 36. ద్వైద | - | తేలుకుట్ల |
| 37. కొత్తపల్లి | - | నారికేళపల్లి |
| 38. పెనుమాక | - | కొత్తూరు |
| 39. వేలూరు | - | కుక్కపల్లివారిపాలెం |
| 40. పంగులూరివారిపాలెం | - | గణేశునివారిపాలెం |
| 41. రాయవరం | - | తుమ్మేపల్లి |
| 42. రెడ్డిగూడెం | - | మొక్కపాడు |

# ప్రతినామ గ్రామాలు

| | | |
|---|---|---|
| 1. కొమ్మూరు (కాకుమాను మండలం) | - | శివపురం, శృంగపురి |
| 2. రేపల్లె | - | నందవ్రజపురం |
| 3. ఓలేరు (భట్టిప్రోలు మండలం) | - | మదనపురం |
| 4. పెదపులివర్రు (భట్టిప్రోలు మండలం) | - | వ్యాఘ్రపురం, శార్దూలపురం |
| 5. వెల్లటూరు (భట్టిప్రోలు మండలం) | - | గోవిందపురం |
| 6. గూడవల్లి (చెరుకుపల్లి మండలం) | - | కుముదవల్లి |
| 7. గుళ్ళపల్లి (చెరుకుపల్లి మండలం) | - | భైరవేశ్వరం |
| 8. భట్టిప్రోలు (మండలకేంద్రం) | - | విరలేశ్వరం,శ్రీకృష్ణవేణ్యాతటపురి, విష్ణువర్ధనేశ్వరం, ప్రిదుండనగరం |
| 9. వలివేరు (చుండూరు మండలం) | - | శాలిమూలపురం |
| 10. నిజాంపట్నం (మండలకేంద్రం) | - | తిమ్మభూపాలపట్నం,నవనిధానపట్నం |
| 11. చేబ్రోలు (మండలకేంద్రం) | - | చింతామణిపురం (కృతయుగం), తామ్రపురం (త్రేతాయుగం), జయపోలు (ద్వాపరయుగం), చతుర్ముఖపురం (కలియుగం), స్కందపురం, మహాసేనపురం |

| | | |
|---|---|---|
| 12. చందోలు (వెలనాటి రాజధాని) (పిట్టలవానిపాలెం మండలం) | - | సంవ్వాదపురం (కృతయుగం), సనకసనందనసనత్కుమారపురం (త్రేతాయుగం), ధనదవోలు (ద్వాపరయుగం), సనదవోలు (కలియుగం), చంద్రపట్టణం |
| 13. అల్లూరు (పిట్టలవానిపాలెం మండలం) | - | అత్రేయపురం |
| 14. నల్లూరు (రేపల్లె మండలం) | - | శ్యామలాపురం |
| 15. కొండవీడు (రెడ్డిరాజుల రాజధాని) (యడ్లపాడు మండలం) | - | భీష్మకుండినపురం, అచలపురి, ముర్తుజానగరు |
| 16. ఫిరంగిపురం (మండలకేంద్రం) | - | విండ్దెపురి |
| 17. వంకాయలపాడు (యడ్లపాడు మండలం) | - | వాతాంకపురం |
| 18. రొంపిచర్ల (మండలకేంద్రం) | - | సవలేశవరం |
| 19. పెరవలి (వేమూరు మండలం) | - | లక్కమాంబాపురం |
| 20. చావలి (వేమూరు మండలం) | - | తిమ్మమాంబాపురం |
| 21. కొండపాటూరు (కాకుమాను మండలం) | - | కొండాయపాలెం, గిరిపురం |
| 22. పొన్నూరు | - | స్వర్ణపురి, గోష్ఠివనం |
| 23. గుంటూరు | - | గర్తపురి, గౌతమపురి, గోమటూరు |
| 24. గోవిందపురం (చిలకలూరిపేట మండలం) | - | జగన్నాథపురం |
| 25. గొరిజవోలు (నాదెండ్ల మండలం) | - | శ్రీరంగపురం |
| 26. చేజర్ల (నకరికల్లు మండలం) | - | కపోతపురం, బిట్టలాపురం |

27. ప్రత్తిపాడు (మండలకేంద్రం) - భక్తులవాడ
28. పెదకంచర్ల - శ్రీకృష్ణగంధర్వపురం
(వినుకొండ మండలం)
29. నార్నెపాడు(ముప్పాళ్ళ మండలం)- నారాయణపురం
30. మురికిపూడి - ముక్తిపురి, శ్రీరంగపురం
(చిలకలూరిపేట మండలం)
31. బొగ్గరం (ఈపూరు మండలం) - భోగవరం
32. ఏనుగుపాలెం - తిరుమలరాజపురం
(వినుకొండ మండలం)
33. గుత్తికొండ - గుచ్ఛాద్రి
(పిడుగురాళ్ళ మండలం)
34. వినుకొండ - కమఠగిరి, శృతగిరి, విష్ణుకుండినపురం, శృతశైలం
35. బొప్పూడి - బొబ్బిలిదేవపురం
(చిలకలూరిపేట మండలం)
36. బెల్లంకొండ (మండలకేంద్రం) - గుడగిరి, గుడశైలం ఏకచక్రపురం
37. మంగళగిరి - హ్రస్వశృంగి (కృతయుగం), ముక్త్యాద్రి (త్రేతాయుగం), ధర్మాద్రి (ద్వాపరయుగం), మంగళశైలము (కలియుగం)
38. పిడుగురాళ్ళ - లైమ్ సిటీ
(భారతదేశ సున్నపుగనుల్లో 3వ స్థానము)
39. గురజాల - మాధవిపురం
(12వ శతాబ్ది పల్నాటి రాజధాని)
40. తిమ్మాయపాలెం - రౌతురాయపురం
(వినుకొండ మండలం)

41. యనమదల - మహిషాసురమర్దనిగిరి
(ప్రత్తిపాడు మండలం)

42. దమ్మాలపాడు - ధర్మపురి
(ముప్పాళ్ళ మండలం)

43. తెనాలి - ఆంధ్రా ప్యారిస్

44. చిలకలూరిపేట - శ్రీశుకపురి, ఆంధ్ర కోయంబత్తూరు

45. మాచర్ల - మహాదేవిచర్ల, మాహిష్మతిపురం
(12వ శతాబ్ది పల్నాటి రాజధాని)

46. మండూరు - మాండవ్యపురి

47. నల్లపాడు - నరసింగపురం
(గుంటూరు రూరల్ మండలం)

48. గోళ్ళమూడి - అవుభళాపురం
(పెదకాకాని మండలం)

49. బాపట్ల - ప్రేంపల్లి, బ్రహ్మాపల్లితీర్థం, రాజమాణిక్యపురం, భావపట్టణం, బావపట్టు

50. మేడికొండూరు (మండలకేంద్రం) - కోనమాంబాపురం?, పొన్నమాంబాపురం

51. తుళ్లూరు - శివతాండవపురి, అవుభళాపురం
(నేటి ఆంధ్రుల రాజధాని)

52. ధరణికోట - క్రౌంచగిరి, అమరావతి,
(తూర్పు శాతవాహన రాజధాని) ధాన్యకటకం, ఆంధ్రపురి

53. నందివెలుగు (తెనాలి మండలం)- తిరుమలరాజపురం, నందిపురం

54. కారంపూడి (మండలకేంద్రం) - పల్నాటికాశి, ఉద్దండవీరతిరుపతి, పల్నాటియుద్ధభూమి

55. మున్నంగి (కొల్లిపర మండలం) - మునికోటిపురం

56. కుంచవరం (కొల్లిపర మండలం)- కుంభవరం

57. వెదుళ్ళపల్లి (బాపట్ల మండలం) - వేణుపురం
58. జడవల్లి (పొన్నూరు మండలం) - తిమ్మరాజపురం
59. రేపూడి (ఫిరంగిపురం మండలం) - తిరుమలస్వామిపురం
60. దుర్గి (మండలకేంద్రం) - దుర్గ్యపట్టణం
(ప్రాచీన శిల్పకళాక్షేత్రం)
61. అంబటిపూడి (అచ్చంపేట మండలం) - చోడాపురం
62. కోగంటిపాలెం (అచ్చంపేట మండలం) - బొల్లయపాడు
63. అనుపాలెం (రాజుపాలెం మండలం) - కుబాద్‌పురం
64. గోవాడ (అమృతలూరు మండలం) - శ్రీభాష్యపురం
65. కొల్లిపర (మండలకేంద్రం) - సదాశివమహారాజపురం
66. కోటప్పకొండ (నరసరావుపేట మండలం) - మూడుకొండలు, త్రికూటాచలం, త్రికూటాద్రి
67. గొడవర్రు (చేబ్రోలు మండలం) - గుణవరం, కృష్ణరాయపురం
68. లేమల్లెపాడు (వట్టిచెరుకూరు మండలం) - వేములేశ్వరపురం
69. ఆలపాడు (చుందూరు మండలం) - వేమవరం
70. పొన్నపల్లి (చెరుకుపల్లి మండలం) - వేమవరం
71. ధూళిపూడి (నగరం మండలం) - ద్వైతపురి
72. యాజలి (కర్లపాలెం మండలం) - ఆంజనేయపురం
73. చిలువూరు (దుగ్గిరాల మండలం) - శివపురం
74. కంభంపాడు (మాచర్ల మండలం) - స్తంభపురి
75. వడ్డమాను (తుళ్లూరు మండలం) - శాలిపురం, వర్ధమానపురం
76. అమీన్‌సాహెబ్‌పాలెం (నాదెండ్ల మండలం) - అవిసాయిపాలెం
77. మనుబోతులకుంట (పెదకాకాని మండలం) - వేంకటకృష్ణాపురం
78. 5వ మైలు (వట్టిచెరుకూరు మండలం) - ఆంధ్రా కాటేదాన్

79. అప్పికట్ల (బాపట్ల మండలం) - ఆంధ్రా బార్డోలి

80. పెదకాకాని (మండలకేంద్రం) - కాకండిపురం, వాయసపురం

81. జూనంచుండూరు (గుంటూరు రూరల్ మండలం) - జ్వాలాచండికాపురం

82. తాడువాయి (అచ్చంపేట మండలం) - భీమవరం

83. చల్లగరిగ (అచ్చంపేట మండం) - భీమవరం

84. గింజుపల్లి (అచ్చంపేట మండలం) - భీమవరం

85. వేల్పూరు (అచ్చంపేట మండలం) - అమరపురి

86. చింతపల్లి (అచ్చంపేట మండలం) - లక్ష్మీపురం

87. మామిళ్ళపల్లి (పొన్నూరు మండలం) - చూతపురి

88. కూచినపూడి (నిజాంపట్నం మండలం) - శ్రీపురం

89. మంతెనవారిపాలెం (పిట్టలవానిపాలెం మండలం) - రాచసిరిపూడి

90. గణపవరం (నాదెండ్ల మండలం) - తేమద్ద

# సందర్భం

గుంటూరుజిల్లాలో అదృశ్యగ్రామాల సాక్షిగా ఆ ఊరి ఆంజనేయ, వైష్ణవ స్వాముల ఆలయాలు ఉన్నాయి. మరికొన్నిచోట్ల ఆంజనేయ, వైష్ణవ మూర్తులను సమీపగ్రామాలలో ప్రతిష్ఠచేసి ఆలయాలు నిర్మించారు.

1 నుండి 24 వరకు ఆంజనేయస్వామి మూర్తులు.

1. నల్లఅనంతవరం (నరసరావుపేట తాలూకా)– అదే స్థలంలో స్వామి ఉన్నారు.
2. గుంటగార్లపాడు (నరసరావుపేట తాలూకా)– అదే స్థలంలో స్వామి ఉన్నారు.
3. మదమంచిపాడు (వినుకొండ తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
4. లింగన్నపాలెం (వినుకొండ తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
5. కోమటికుంట (వినుకొండ తాలూకా) – జయంతిపురం (బొల్లాపల్లి మండలం) గ్రామంలో కోమటికుంట ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
6. హనుమంతునిపాడు (పలనాడు తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు. కొందరు కృష్ణాపురం ఆంజనేయస్వామిగా పిలుస్తారు.
7. దామెరపాడు (పలనాడు తాలూకా) – తుమృకోట (రెంటచింతల మండలం) గ్రామంలో దామెరపాటి ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
8. రాగిపాడు (పలనాడు తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
9. వజ్రాలపాడు (పలనాడు తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
10. ఆకురాజుపల్లి (పలనాడు తాలూకా) – బ్రాహ్మణపల్లి (దాచేపల్లి మండలం) గ్రామంలో ఆకురాజుపల్లి ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
11. కోడిబోయనపల్లి (పలనాడు తాలూకా) – భట్రువారిపల్లి (కారంపూడి మండలం) గ్రామంలో కాడిబోయినపల్లి ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
12. సిద్ధిపాలెం (సత్తెనపల్లి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
13. సుదెళ్ళపాడు (సత్తెనపల్లి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
14. నివాసపాడు (సత్తెనపల్లి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.

15. కోళ్ళూరు (సత్తెనపల్లి తాలూకా) – సత్తెనపల్లి – పిడుగురాళ్ళ రహదారిలో బెల్లంకొండ అడ్డరోడ్డు వద్ద కోళ్ళూరు ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
16. దేచవరప్పాడు (సత్తెనపల్లి తాలూకా) – ఈ స్వామి ఎక్కడ ఉన్నారో తెలియదు.
17. తిమ్మేసుపేట (సత్తెనపల్లి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
18. గుళ్ళంపాడు (సత్తెనపల్లి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు
19. చినతక్కెళ్ళపాడు (సత్తెనపల్లి తాలూకా) – పెదతక్కెళ్ళపాడు (ఫిరంగిపురం మండలం) గ్రామ శివాలయంలో చినతక్కెళ్ళపాటి ఆంజనేయస్వామి ఉన్నారు.
20. నూజెళ్ళపల్లి (చిలకలూరిపేట తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
21. తుర్లపాడు (గుంటూరు తాలూకా) – రావెల (తాడికొండ మండలం) గ్రామంలో తుర్లపాటి ఆంజనేయస్వామి ఆలయం ఉంది.
22. పెయ్యలమిట్ట (గుంటూరు తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
23. గుండవరం (మంగళగిరి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.
24. పుట్టిపాడు (మంగళగిరి తాలూకా) – అదే స్థలంలో స్వామి ఉన్నారు.

వైష్ణవ మూర్తులు.

25. బంధంరావూరు (మంగళగిరి తాలూకా)లో ఉండే వేణుగోపాలమూర్తిని చేబ్రోలు గ్రామంలో ప్రతిష్టచేశారు.
26. అనంతవరం (రేపల్లె తాలూకా)లో ఉండే శ్రీరంగనాయక స్వామిని చేబ్రోలు గ్రామంలో ప్రతిష్టచేశారు.
27. శ్రీరంగనగరం (చిలకలూరిపేట తాలూకా)లో ఉండే శ్రీరంగనాయక స్వామిని సొలస(యడ్లపాడు మండలం) గ్రామంలో ప్రతిష్టచేశారు.



సిద్ధిపాలెం ఆంజనేయస్వామి
సత్తెనపల్లి తాలూకా



కోళ్ళూరు ఆంజనేయస్వామి
సత్తెనపల్లి తాలూకా



గుండవరం ఆంజనేయస్వామి
మంగళగిరి తాలూకా



ఆకురాజుపల్లి ఆంజనేయస్వామి
పలనాడు తాలూకా




హనుమంతునిపాడు ఆంజనేయస్వామి
పలనాడు తాలూకా



మదమంచిపాడు ఆంజనేయస్వామి
వినుకొండ తాలూకా



లింగన్నపాలెం ఆంజనేయస్వామి
వినుకొండ తాలూకా



వేణుగోపాలమూర్తి బంధంరావూరు
మంగళగిరి తాలూకా



అనంతవరం శ్రీరంగనాయకస్వామి, రేపల్లె తాలూకా
ఇప్పుడు ఈ స్వామివారు చేబ్రోలులో ఉన్నారు.



శ్రీరంగనగరం రంగనాయకస్వామి, చిలకలూరిపేట తాలూకా
ఇప్పుడు ఈ స్వామివారు సొలస(యడ్లపాడు మండలం)లో ఉన్నారు.



నామధేయం : మణిమేల శివశంకర్.

అసలు : మణిమాల, పుశులేటిగోత్రం, ముదిరాజ్ కులం.

తల్లిదండ్రులు : వరలక్ష్మీ, వెంకటరాజు గార్లు.

జన్మస్థలం : భర్తిపూడి, బాపట్ల మండలం, గుంటూరు జిల్లా.

స్వగ్రామం : మామిళ్ళపల్లి, పొన్నూరు మండలం, గుంటూరు జిల్లా.

చదువు : 5వ తరగతి, ప్రాథమిక పాఠశాల, అప్పికట్ల, బాపట్ల మండలం, గుంటూరు జిల్లా.

కుటుంబం : లక్ష్మీరాజ్యం (భార్య), జ్యోతిర్మయి (కుమార్తె), పార్థు (కుమారుడు).

మాతృబంధువులు : మనుబ్రోలు తులశమ్మ (అమ్మమ్మ), కోటయ్య (తాతయ్య).

వీరి పూర్వస్థానం : ఇలపావులూరు, చీమకుర్తి మండలం, ప్రకాశం జిల్లా.

పితృ బంధువులు : మణిమేల కోటమ్మ (నాయనమ్మ), తాతంరాజు (తాతయ్య).

వీరి పూర్వస్థానం : కొర్నెపాడు, వట్టిచెరుకూరు మండలం, గుంటూరు జిల్లా.

వృత్తి : ముఠా కార్మిక, వ్యవసాయం.

ఇష్టదైవం : కోటప్పకొండ శ్రీ త్రికోటేశ్వరస్వామి వార్లు.

నివాసం : ఇంటి నెం. 25-19-20, తిరుపతమ్మగుడివద్ద, భవానికాలనీ, సంపత్‌నగర్,

గుంటూరు-522004. మొబైల్ - 8019632030.

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | DKOQA 139 | **Date** | 26/7/22 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | No C2, 191 | | |
| **Missing Pages** | No | | |
| **Prepared By** | Sruthi | **Cutting By** | Sruthi |
| **Scanned By** | Lakshmi | **Pages** | 229 |